**PRAACHIINAANDHRA GAATHALU**
Tirumala Ramachandra

**ప్రాచీనాంధ్ర గాథలు**
**తిరుమల రామచంద్ర**

సంపాదకులు
**డా. డి. చంద్రశేఖర రెడ్డి**

ముద్రణ
**జూన్, 2013**

మూల్యం: రూ. **90/-**

ISBN : 978-93-82203-75-9

టైటిల్ డిజైన్
**జి.పురుషోత్ కుమార్**

ప్రింటర్స్
**సాయిలిఖిత ప్రింటర్స్**
హైదరాబాదు.

ప్రచురణ
**ఎమెస్కో బుక్స్**
1-2-7, బానూకాలనీ,
గగన్‌మహల్ రోడ్, దోమలగూడ,
హైదరాబాద్ - 500 029.
ఫోన్ & ఫ్యాక్స్ : 040-23264028.
e-mail : emescobooks@yahoo.com
www.emescobooks.com

పంపిణీదారులు
**సాహితి ప్రచురణలు**
29-13-53, కాళేశ్వరరావు రోడ్డు,
సూర్యారావుపేట, విజయవాడ - 2.
ఫోన్ : 0866-2436643
e-mail : sahithi.vja@gmail.com

# ముందుమాట

**ఆం**ధ్రశాతవాహనయుగం ప్రాకృత వాఙ్మయ చరిత్రలో స్వర్ణయుగం. ఈ యుగంలో రెండు గొప్ప గ్రంథాలు వెలుగు చూశాయి. వీటిలో మొదటిది గుణాఢ్యుని బృహత్కథ, రెండవది గాథాసప్తశతి. భారతీయ సాహిత్యంలోనే కాదు విశ్వసాహిత్యంలో శాశ్వతస్థానం సంపాదించుకున్న గొప్ప రచనలు. బృహత్కథ కథావాఙ్మయానికి మూల స్రోతస్సు అయితే, సప్తశతి రమణీయ కవితా లక్షణానికి ఉదాహరణ.

హాల శాతవాహనుడు క్రీ.శ. 25–30 మధ్య శాతవాహనాంధ్ర సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. పరిపాలించిన కాలం స్వల్పమే అయినా గాథాసప్తశతి వల్ల అజరామరకీర్తిని పొందాడు. కవివత్సలుడుగా ప్రశస్తికెక్కిన హాలుడు స్వయంగా కవి. సప్తశతిలో అతను రచించిన గాథలెన్నో ఉన్నాయి.

కోటి గాథల నుండి హాలుడు ఏర్చి కూర్చిన గాథలు ఏడువందలు. మూడువందలకు పైగా కవులు, కవయిత్రులు ఈ గాథలు రచించారు. దీన్నిబట్టి ఆనాటి ప్రాకృత వాఙ్మయ వైభవాన్ని మనం ఊహించుకోవచ్చు.

గాథాసప్తశతిలోని గాథలు ఆర్యాఛందస్సులో ఉన్నాయి. ఆర్యా ఛందస్సుకే పాతపేరు గాథ. పాడదగినది. ఇవి ముక్తకాలు. అంటే ఏ గాథకు అదే స్వతంత్రమైనది. సమకాలికమైన సంఘమూ, సామాన్యుల జీవనమూ, ప్రాకృతిక సౌందర్యమూ ఈ గాథల్లో ప్రతిబింబిస్తుంది. మామూలు మనిషి జీవితంలోని సుఖాలూ, సోయగాలూ, వియోగ దుఃఖాలూ, అమాయకత్వం, గడుసుదనం, అల్ప సంతోషాలూ, కోపతాపాలూ, అనునయాలూ, ఈర్ష్యాసూయలూ, అందాలూ,

వికారాలూ అన్నీ మనల్ని సమ్మోహపరుస్తాయి. రెండువేల ఏళ్ల కిందటి ఈ కవిత్వంలో మన పురాణ గాథలు గాని, పురాణ పురుషులు గాని కనిపించరు. నిజానికి ఇటువంటి సాహిత్యం ఎంత కనుమరుగై పోయిందో.

ఇంత సహజసుందరమూ, వ్యంగ్య వైభవోల్లసితమూ అయినందువల్లే అలంకారశాస్త్ర కారులకు తమ సాహిత్య లక్షణాలకు లక్ష్యాలుగా సప్తశతిలోని పద్యాలు పెన్నిధులుగా గోచరించాయి. యథేచ్ఛగా ఉపయోగించుకున్నారు. ఆలంకారికుల కింత ప్రియమైన రచన మరొకటి లేదని చెప్పవచ్చు.

గాథాసప్తశతికి వందల ఏళ్లకిందటే ఎన్నో టీకలు, వ్యాఖ్యలు వచ్చాయి. 15వ శతాబ్ది ప్రారంభంలో కొండవీటి రెడ్డిరాజు పెదకోమటి వేమారెడ్డి సప్తశతి నుండి నూరు గాథలు ఎంచుకొని సప్తశతీసారమనే పేరుతో టీక రచించాడు. వేమారెడ్డి ఆస్థాన కవి అయిన మహాకవి శ్రీనాథుడు నూనూగు మీసాల నూత్న యౌవనంలో గాథాసప్తశతిని తెలుగులోకి అనువదించాడు.

గాథాసప్తశతిలోని ఒక్కొక్క గాథను తీసికొని దాని పూర్వాపరాలను ఊహించి ఒక కథనే అల్లవచ్చు. దీన్ని విస్తరించి ఒక కావ్యాన్నే కూర్చవచ్చునేమో కూడా. సప్తశతిలోని కొన్ని గాథలను తీసికొని సుప్రసిద్ధ పండితుడు, రచయిత తిరుమల రామచంద్రగారు అలా కథలు అల్లారు. ఒక పూర్వరంగాన్ని కూర్చి అందమైన భావానికి సన్నివేశాన్ని కూర్చారు. సన్నివేశాన్ని కథగా మలిచారు. కొన్ని గాథల్ని ఒకచోట కూర్చి వాటికొక సన్నివేశరూపాన్నిచ్చారు.

గ్రీష్మంలో చలివేందిరాలు సర్వసాధారణం. దప్పిగొన్న బాటసారులకు చలివేందిరంలో దప్పిక తీరుతుంది. ఆ రోజుల్లో ఈ చలివేంద్రాలలో నీళ్లు అందించే పని ఆడవారే చేసేవారేమో. గ్లాసులు, చెంబులతో నీళ్లిచ్చే సంప్రదాయం చలివేంద్రాల్లో ఉండదు కదా. దోసిలి పట్టాలి. ఆ దోసిట్లోకి నీళ్లు సన్నటి ధారగా పోస్తూ ఉంటే తాగాలి.

బాటసారి వచ్చాడు. దోసిలి పట్టాడు. అందమైన యువతి సన్నటిధారగా నీరు పోస్తూ ఉంది. బాటసారి నీళ్లు తాగుతూనే కళ్లెత్తి ఆమె ముఖం వైపు చూస్తున్నాడు. దోసిట్లో వేళ్ల నడుమ సందు వదలి నీరు వదిలేస్తున్నాడు. నీళ్లు పోసే యువతి నీటిధారను మరింత సన్నం చేస్తూ ఉంది. అంటే ఆ యువతి ముఖ సౌందర్యాన్ని గ్రోలుతూ ఉన్న బాటసారీ, ఆ బాటసారి ప్రశంసాత్మకమైన చూపుల్ని ఆస్వాదిస్తున్న యువతీ ఇద్దరికీ దప్పిక తీర్చుకొనే, తీర్చే కార్యక్రమం అనంతంగా సాగిపోవాలని ఉందన్నమాట. ఎవరికీ తృప్తిలేదు. ఇటువంటి గాథలెన్నో ఈ సప్తశతిలో.

తిరుమల రామచంద్ర సంస్కృత, ప్రాకృత, తెలుగు, కన్నడ, హిందీ, ఆంగ్లాది బహుభాషల్లో విద్వాంసులు. ఎన్నో పరిశోధన గ్రంథాలు, సృజనాత్మక రచనలు, అనువాదాలు వారి కలం నుండి వెలువడ్డాయి. జీవితమంతా సాహిత్యోపాసనలోనే గడిచింది. ఎన్నో బిరుదులూ, సన్మానాలూ అందుకున్నారు.

ఇది తిరుమల రామచంద్రగారి శతజయంతి సంవత్సరం. ఈ సందర్భంగా ఆయనకు నివాళిగా ఈ పుస్తకాన్ని తెలుగు పాఠకలోకానికి అందిస్తున్నాం. రామచంద్ర గారికి ప్రాకృత వాఙ్మయం అభిమాన విషయం. అందులోనూ గాథాసప్తశతి మరింత ప్రియమైనది. అందుకే 'పల్లకి'లో ధారావాహికంగా వచ్చిన ఈ కమనీయ గాథలను గ్రంథరూపంలో మీ ముందుకు తెస్తున్నాం. ఆస్వాదించండి.

**సంపాదకులు.**

# విషయసూచిక

# జాణ

**ఆ**సి దీని నైపుణ్యం నవిసిపోనూ! ఎంత తెలివితేటలే! దీనికి కూడ పుట్టిందీ వలపు వెఱ్రి? వాణ్ని చూడగానే, పూచిన పూవుల గురువిందలాగ ఊగిసలాడిపోతుంది. మాకు లేవూ ప్రేమలు? వాటిని తెలుపడానికి వేళలూ, పాళలూ లేవూ? ఏమిటో అనుకున్నాను. గడుసుదే!

నర్తనం జరుగుతూ వుందా? జరుగుతున్నంత సేపూ ఎక్కడో ఉంది దాని మనసంతా. పదిమందితో పాటు వాడూ చూస్తున్నాడా? వాడి ఒక్కడి మెప్పే కావలసి వచ్చిందా దీనికి? చూపంతా వాడి మీదే. ఇక్కడ అడుగులు కలవవే అంటే, వినిపించుకోనక్కరలే? నర్తనం ముగిసిందా! అందరూ చప్పట్లు చరిచారు. బాగుంది.

దీని చాతుర్యం చిట్లిపడ! నా దగ్గరికి వచ్చి పొగడి, భుజం తట్టి వీపు నిమిరి చప్పున చెక్కిలి ముద్దు బెట్టుకుంది. చెలిమికత్తె సంతోషించిందిలే అనుకున్నాను. అందరినీ మెచ్చుకుందిలే, వెఱ్రిబాగులది: –అనుకున్నాను. దీని నంగనాచితనం ఇంగలం గాను! పట్టేశాను, ముద్దు పెట్టుకోడానికి కారణం.

నర్తనం ఆగి, అందరూ నిలబడ్డారా. అందరి చెక్కులూ మెరిసిపోతున్నాయి సంబరంతో. అటు తిరిగి చూశానో లేదో... మూడో గోపిక చెక్కిలిమీద ఏదో నీలంగా బొమ్మ కనిపించింది. తేరిపారజూస్తే కృష్ణుని బొమ్మ. ఎవరైనా గీశారా? నర్తనం కోసం వ్రాయించుకొందా? – అనుకున్నాను. కాదు. అద్దంలోలాగ పడింది అచ్చు. ఆ పక్కని గోపికను చూచాను. ఆమె చెక్కిలీ అంతే. గట్టుమీద నిలబడ్డ కృష్ణుని బొమ్మే అది! దీని తెలివితేటలు తరిగిపోనూ! ఎలా కనిపెట్టిందో ముందుగానే. ముద్దులు కురిపిస్తూ వెళ్లుతున్నది. అక్కడే నిలుచుని ఉన్నాడుగా చీకటి చెట్టులాగ గట్టుమీద! ముద్దుపెట్టుకోరాదూ? ఈ వగలూ వయ్యారాలూ పోవడమెందుకు?

ఎలా వచ్చాయే నీకు విద్దెలు? ఆ మన్మథమహారాజు ఉన్నాడే, వాడు పూనినాడంటే, ఇంతేనమ్మా ఇంతే! ఎక్కడ లేని శాణాతనమూ వస్తుంది.

# వగలాడి

అబ్బ! ఈ కృష్ణుడు ఎప్పుడూ ఇంతే. ఏదో విధంగా తలవంపులు తెస్తూనే ఉంటాడు మాకు. పంతిలో పరపక్షం అనేది ఏమి న్యాయం? పదిమందిలోను తలవంపులు ఒలక పోస్తే గాని తీరదా? ఏమిటి ఈ చేష్టలన్నీ, మమ్మల్ని ఏడిపించడం కోసం కాకపోతే? అమ్మమ్మ! వీడు పెట్టే ఆరడి అంతా ఇంతా కాదు. ఆ నాటి సంగతి తలచుకుంటేనే చిత్తైత్తి పోతుంది.

గోధూళివేళ, ముంగిట్లో నిలబడితే ఎవరిపైన అయినా ధూళి పడుతుంది; చేత్తో తుడుచుకుంటే పోతుంది; చేలాంచలంతో విసరుకుంటేనూ పోతుంది. "చెక్కిలి మీద ఏమిటా దుమ్ము?" అంటే పోదూ, అంతగా తను వికారం అనుకుంటే! ఇంతమందీ వాకిట్లో వేయి కండ్లతో వేచి ఉన్నారు గదా. అందరిపైనా గోధూళి పడలేదూ? ఆ రాధమ్మగారొక్కరిపైనే విరుచుకుపడిందా? ఆమెగారి కపోలాలపైని మకరికాపత్రాలే మాసిపోయాయా? అందరితోపాటు తిరిగివస్తున్నవాడు తన దారిని తాను పోవచ్చునుగా!

తనకు ఇష్టం పుడితే తల ఎత్తి చూడవచ్చు; గాని, ప్రేమలో పరవళ్లు తొక్కుతున్నట్టు, పదిమందీ చూస్తుండగా ఏమిటా పని? గబగబా ముందుకు వస్తే, "ఏమిటి ఈ నాటి అదృష్టం?" అంటూ ఆనందిస్తుండగా, ఈ పిడుగుపాటు! మా ముందునుంచే అంగలు వేసుకుంటూ వెళ్లి రాధమ్మగారి చెక్కిలి దగ్గరికి ముఖం పోనివ్వడమేమిటి? బుంగమూతిపెట్టి గోధూళిని ఊదడమేమిటి? ఆమెగారు పగడపు తీగ అయిపోవడమేమిటి?

ఆమెగారికైనా సిగ్గూ ఎగ్గూ ఉండవద్దూ అంట? ఆమెగారిని ఏమంటాములే పాపం, ఈ మహానుభావుడు హఠాత్తుగా వెళ్లి ఊదడం ఆరంభిస్తే? అది తలచుకొంటేనే, నా ఒళ్లు వడగాలి సోకిన మాధవీలత అవుతుంది. మనసేమో మంచుగాలి సోకిన కలువ తీగ అవుతుంది.

*(గాథాసప్తశతి 1-89)*

# పత్తికాయ నవ్వింది!

పత్తికాయ నవ్వింది! వెఱ్ఱిబాగుల వాడిని చూస్తే పత్తికాయే కాదు, ప్రపంచమంతా నవ్వుతుంది.

అయినా, ఈ రైతన్నకు మరీ ఇంత భోళాతనమా? తన యజమానురాలు తనంటే ముచ్చటపడింది; డన్ లప్ పక్కలను, హంసతూలికాతల్పాలను తలదన్నే మడి కయ్యలలోనే మన్మథుని ఆరాధింతాము రమ్మన్నది. ఆ ఆరాధన అంటే ఏమో తెలియని వయసు. అమ్మగారు చెప్పింది చేయడమే పరమావధి అయిన మనసు. మడిదున్నడం వంటి పనే కాబోలు ననుకున్నాడు. సరేనన్నాడు. దీనిలో తన ప్రమేయమేముంది గనుక? అమ్మగారే పూనుకుంది. ఆమె చెప్పినట్టే చేశాడు. ఆమె చెప్పింది ఏమి చేయలేదు గనుక!

తనకు అదేదోలాగ ఉంది. ఎక్కడికో తేలిపోతున్నట్టు ఉంది. కళ్లు మూతలు పడి పోతున్నాయి. ఆలోచనే పారడం లేదు. బలవంతంగా కళ్లు తెరచి చూచాడు. అమ్మగారు కళ్లు మూసుకొని చుట్ట చుట్టుకొని పడుకొని ఉంది. ఎంతసేపయినా లేవదు; కళ్లు తెరవదు. ఏమయింది అమ్మగారికి! భయం భయంగా జబ్బ పట్టుకొని కదిపి చూచాడు. కదల లేదు. ముఖంమీదికి వంగి ముక్కు పుటాల దగ్గర వేళ్లు ఆడించాడు. ఆనందపారవశ్యంలో ఉన్న యజమానురాలు ఈ అమాయికప్రియుణ్ణి గాభరా పెట్టిద్దామనుకుందేమో, ఒక్క క్షణం ఊపిరి బిగబట్టింది. రైతన్న గుండె జల్లుమంది. కదలదు. మెదలదు. ఊపిరి ఆడదు. కళ్లు తెరవదు. చచ్చిపోయింది. నిజం! ఏం చేయాలిప్పుడు? ఇక్కడుంటే ఏం ప్రమాదమో! చుట్టూ చూపు సారించాడు. ఎవరూ లేరు. ఇదే అదను. పరుగు తీశాడు. పరుగో పరుగు!

అప్పుడు నవ్వింది పత్తికాయ! ఆనందంతో చొక్కి కళ్లు మూసుకున్న ప్రియురాలిని వదలిపోతున్నాడు, ఎంత వెఱ్ఱివాడు ఈ రైతన్న అని! పత్తికాయ సగమే విచ్చింది.

విచ్చిన అంచులు ఎఱ్ఱగా పెదాలలాగ ఉన్నాయి. తడి పత్తి వెన్నెల రంగుతో నవ్వుతూంది.

*(గాథాసప్తశతి 4-60)*

# మనోరథం

అబ్బ! ఎన్నాళ్లు విరహం! ఇదిగో, ఇప్పుడే వస్తానన్నారు. ఏమీ కలవరపడవద్దు, క్షణంలో వచ్చి వాలుతానన్నారు. వెళ్లినట్టే వెళ్లి రెప్పపాటులో వచ్చినట్టే రానూ అన్నారు. క్షణాలు, గడియలు, జాములు, పగళ్లూ, రాత్రులూ, వారాలూ, నెలలూ గడిచాయి. ఏమంటాము? మీరు చెప్పేవి అన్నీ అబద్ధాలే అంటామా? ఎంత తీరని పనైతే ఆగుతాను- అంటారు. పనులనేవి అందరికీ వుంటాయి. అందరూ ఇలాగే పనిలో తలమునకలై ఉంటారా?

ఔను. పనులన్నీ ఒకే విధంగా ఉంటాయా? కొన్ని తొందరగా అవుతాయి, కొన్ని ఆలస్యంగాను. ఏదో తెమల్చుకొని రాకూడదూ? ఇక్కడ వేయికళ్లతో వేచి ఉన్నాను కదా! ఇన్నాళ్లు అయాయి, ఎలా గడుపుతున్నదో! ఎలా వేగిపోతున్నదో – అనే ఆలోచనే ఒక్కసారి మెరపులాగ మెరిసినా, ఇక ఉండగలరా? అంటే నా ఆలోచనే రాలేదనే కదూ- నిజమే. ఎలా వస్తుంది? చిక్కనిదానికోసం పడే తాపత్రయం చిక్కి చేతిలో ఉన్న దానికోసం ఉండదుగా!

రావడం సులభమా? ఒంటరిగా రావడం ప్రమాదం. దారిలో దొంగలూ, దొరలూ – ఒక్కరేమిటి పీక్కు తినే వారెందరో. పదిమందితో కలిసే రావాలి. అందరికీ పనులు పూర్తయి ఒక్కటిగా బయలుదేరాలి. అంచెల బళ్లు సిద్ధంగా ఉండాలి. దారి పయనానికి అనువుగా ఉండాలి. వానా, ఎండా, గాలీ అన్నిటికీ తట్టుకొని దారి సాగాలి. కలిసిన పదిమంది గమ్యం ఒకటే అయి ఉండదు గదా. చివరంటా అందరూ కలిసి రావడం ఎలా కుదురుతుంది? కలిసి వచ్చే వాళ్లలోనూ మోసగాళ్లుంటే? ఉండరులే. అంత నమ్మకమే లేకపోతే కలిసి ఎలా వస్తారు?

అబ్బబ్బబ్బ! ఎందుకీ ఆలోచనలు? వస్తారు. రేపో, మాపో వస్తారు. వస్తే ఎదురు పరుగెత్తనా? ఉహుఁ! వస్తారు కంచె తలుపు – గొళ్లెం తీసి ముంగిట్లో అడుగులు వేస్తారు. చుట్టూ పరికిస్తారు.

ఆముదపు చెట్టు ఏపుగా పెరిగి వుంటుంది. దోసపాదు నిండి ఉంటుంది. పొగడ చెట్టు పూవులు రాలుస్తూ ఉంటుంది. పాదిరి పూవుల వాసన గుప్పుమంటుంది. దొడ్లోని దూడలు అంబా అని అరుస్తాయి.

తల వాకిలి దాటి లోపలికి తొంగి చూస్తారు. నేను మూలలో అలకతో నక్కి ఉంటాను. అలకే మరి! ఇన్నాళ్లు ఎందుకాలస్యమట? పిల్లి అడుగులువేస్తూ దగ్గరికి వచ్చి పలకరిస్తారు. నేను పలకను, ఉలకను. పక్కన నిలబడి రెండు చేతులతో నా ముఖం ఎత్తి తమవైపు తిప్పుకుంటారు. నేను విసురుగా ముఖం దించేసుకుంటాను. నన్ను బుజ్జగిస్తారు. నేను కళ్లు తిప్పుతూ మూతి విరుస్తాను. మరీ బతిమాలుతారు, పాపం! ఇక బాగుండదు. అలకమాని పెదవి కదుపుతాను. ఆశ్చర్యంగా చూస్తారు. ఎప్పుడు వచ్చారు అన్నట్టుగా కళ్లు పెద్దవి చేసి చూస్తాను. ఆనందంతో పరవశు లైపోతారు...

ఆయన వస్తారా? ఇదంతా జరుగుతుందా?

*(గాథాసప్తశతి 1-17)*

# మామిడి కొమ్మ

ఏమయి వుంటుంది? ఇంటిల్లిపాదీ ముంగిట్లో మూగారే! ఎవరో ముసలాయన మోర ఎత్తి చూస్తున్నాడు. కళ్లు కనబడకపోయినా నుదుటికి అడ్డంగా చేయిపెట్టి. ఒక ముసలావిడేమో కొంగు నడుమున చెక్కి మెడ నిక్కించి చూస్తూంది. కొందరు యువతులేమో చేతులు జాడిస్తూ, వగలు పోతూ చూస్తున్నారు. యువకులేమో దూరంగా నిలుచున్నారు సరదాగా. పిల్లలయితే చుట్టూ పరుగులు తీస్తున్నారు. దగ్గరికి వెళ్లి తొంగి చూద్దామా? ఎవరి ముంగిట్లో వాళ్లు వేయి చేసుకుంటారు, మనకెందుకూంట! ఉహూఁ! ఈ మనసనేది ఉందే, కోతి. దీనికి అన్నీ కావాలి...

ఎంత దారుణం! ఎవరా పెద్దమనిషి? కుడి చేత్తో మామిడి కొమ్మ పుచ్చుకొన్నాడు; ఎడమ చేత్తో ఒక అమ్మాయి కొంగు పుచ్చుకొని బాదుతున్నాడు. ఎవరూ ఏమీ అనడం లేదేమి? విచిత్రం! అమ్మాయి పాపం, చాలా అలసిపోతూంది. కొడుతున్న పెద్ద మనిషి 'ఎవరు నీ మొగుడు?' అంటూన్నాడు. మొగుడే దగ్గర వుంటే, ఇలా బాదనిచ్చేవాడా చెప్పండి. దెబ్బలు తింటున్న అమ్మాయికి కూడ వినోదంగా వున్నట్టుంది. 'వద్దు వద్దు' అంటూ, చేతులు అడ్డు పెడుతూనే ఇక్కడ మరొక దెబ్బ వేయి అన్నట్టు వంపుసొంపులు చూపుతూంది; దెబ్బలకు పులకిస్తున్నట్టూ కనిపిస్తూంది. దెబ్బలకు పచ్చని వొళ్లు వడలిపోయిన మామిడి చిగురులాగ అయింది కదా, ఆ వయ్యారాలెందుకు? మొగుడి పేరు చెప్పి, 'కొట్టడం మానుకోవయ్యా!' అనగూడదూ?

ముసలి పెద్దమనిషిని అడుగుదామా, ఏమిటిదంతా అని?... ఏమనుకుంటాడో! 'మా ఇంటి వ్యవహారం నీకెందుకోయ్?' అనంటాడేమో. అంటే అననీ గాక! నేను చూడలేను బాబూ ఈ ఘోరాన్ని! సంపంగి పూవులాంటి అమ్మాయి వాడి వత్తలవుతూంటే!...

... వెర్రివాడా! ఇదొక వినోదం; ఆట. దీనిని చూతపతిక – మామిడికొమ్మ – అంటారు. చిన్న మరుదులు వదినెలను సరదాగా ఏడిపిస్తారు. నిజంగా దెబ్బలాటే అయితే ఇంత పెద్దవాణ్ని, ఇంటికి పెద్దను, ఊరుకుంటానటయ్యా? పరదేశిలాగ వున్నావు... అలాగా, అందుకే ఈ వినోదాలు నీకు తెలీవు!

*(గాథాసప్తశతి 1-28)*

# బుగ్గ మీది మసి

**అం**దమనేది దేంట్లో ఉంది? వస్తువులో ఉందా? మన చూపులో ఉందా? వస్తువులో కన్న మన చూపులోనే ఉందనవచ్చు. వస్తువు బాగలేకపోయినా, మన చూపుతో మనసు పెనవేసుకొంటే, వికారమైన వస్తువులోనూ అందాలే చిందుతాయి.

నిజానికి ఏ వస్తువూ వికారం కాదు. వికారమనేది ప్రపంచంలో లేనేలేదు. మనకు వికారంగా తోచింది మరొకరికి సుందరంగా కనిపించవచ్చు. మరొకరికి వికారమైంది మనకు రమణీయాకారంగా అగుపడవచ్చు. అందానికి, తద్వ్యతిరేకానికి నిర్వచనాలేమీ లేవు. సౌందర్యదృష్టి ద్రష్టది, అనుభోక్తది. అతనికి ఏది నచ్చితే అదే అందమవుతుంది.

కాని, అందరూ మెచ్చే అందచందాలున్నవారు వికారవస్తువులు ధరించినా, కోతి చేష్టలు చేసినా మనోహరంగానే ఉంటుంది; కొండంత కొప్పున్నమ్మ కొరివి దయ్యం లాగ వెంట్రుకలు విరబోసుకున్నా ముచ్చటే అన్నట్టు.

అంతే. అచ్చంగా ఆ ఇల్లాలి సంగతీ అదే. పొద్దు పొడిచింది మొదలు పొద్దు గూకే వరకు ఒకటే పని. వంటా, వార్పూ. కుచ్చెళ్లు పైకి ఎగగట్టింది. పైట బిగించి నడుమున చెక్కింది. వంట ఇంటి వేడి భరించలేక కంచుకాన్ని కాదన్నది. నుదుట చెమట ముత్యాలు కట్టింది. ముంగురులు ఆ ముత్యాలను తాకుతూ నాట్యమాడుతున్నాయి. కట్టెల పొయ్యి! పొయ్యి మీది చట్టి పొగ చూరి మరీ నల్లదైంది. చట్టి దించేటప్పుడు చేతికి మసి అంటిందేమో! పరాకుగా ఆ చేత్తో బుగ్గను తాకింది. బుగ్గకు మసి అంటింది. పచ్చని బుగ్గ మీది మసిచార మరీ కొట్టవచ్చినట్టు కనిపిస్తూ, కల్యాణం నాటి కాటుక చుక్కలా మెరిసిపోతూంది.

అప్పుడు మహానసంలోకి (వంటింట్లోకి) అడుగుపెట్టాడు పతిదేవుడు. బుగ్గమీది మసితో ముచ్చటలు ఒలికే ఇల్లాలిని చూచాడు. కవిత్వం పుట్టుకు వచ్చింది. విరగబడి నవ్వాడు. ఎందుకు వెకిలి నవ్వులు – అన్నట్టు ముఖం చిట్లించి మూతి విరిచింది. బుగ్గ మీది మసి చుక్క ఇంకా అందం కుమ్మరించింది. "అబ్బ! ఇప్పటికి గెలిచావు

చందమామను! అంతా జాబిల్లిలాగే ఉంది గాని, జాబిల్లిలోని నల్ల చారలు లేవే? బోసి మొగం అని జాబిల్లి నిన్ను వెక్కిరిస్తున్నాడే అనుకున్నాను. ఇన్నాళ్లకు బుగ్గ మీది మసిచారతో చందమామను ఓడించావు–" అని పిల్లవాడిలా కేరింతలు కొట్టాడు.

ఇల్లాలు ఉలిక్కి పడింది. బుగ్గమీద మసా? ఎక్కడిది? చేతికున్న మసి అంటిందేమో? దానికింత అట్టహాసమా! ఆశుకవిత్వమా! మసి అంటింది, తుడుచుకో – అంటే పోలా? ఈ మగవాళ్లు ఎప్పుడూ ఇంతే. మనకేది వికారమో, అదే వారికి... అనుకుంటూ వంటపనిలో మునిగిపోయింది.

*(గాథాసప్తశతి 1-13)*

# ముర్రుపాలు తాగిన గేదె దూడ

**చె**ల్లీ, చూడు! అతడు నీ ఒక్కదాని సొమ్మే కాదు పొద్దస్తమానం కులకడానికి. గుత్తకు తీసుకొన్నావా ఏమిటి? మాకూ హక్కుంది సుమా! కొత్త వింత, పాత రోత అనే సామెతను ఎరుగుదువు కదూ! బాగా గుర్తుంచుకో. కొత్తదానివి. మన ప్రియతముని సంగతి తెలీదు నీకు. సవతుల సాధింపు ఇలాగేలే అనుకోనేవు! నిజం, ముమ్మాటికీ నిజం, మేమన్నది.

ఏమన్నావు? నాకివన్నీ తెలీవు. చెప్పినట్టు వినడం పత్ని ధర్మం కదా. దానిని అనుసరించడం తప్పా - అంటావు కదూ! మాకే చెప్పవచ్చావూ పత్నీధర్మాలు? నిజమే. నీవు అమాయికురాలివే. నోట్లో వ్రేలు పెడితే కొరకలేని దానివే. బాగుంది. అంతా అతడే చూస్తాడు. అంతా అతడే చేస్తాడు, చేయిస్తాడు. మరీ అర్భకురాలివా నీవు? నన్ను మీ అందరికన్నా ఎక్కువగా ప్రేమిస్తున్నాడు. మహా గోముగా చూసుకొంటున్నాడు. మంచం దిగనివ్వడు. పడకటిల్లు కదలనివ్వడు. నాకూ ఇష్టమే ఇవన్నీ- అంటే పోలా? నాకేం తెలీదని బెట్టెందుకు? అమ్మాయ్, అతన్ని చూడవద్దు. కనిపిస్తే కళ్లు మూసుకో. పలకరిస్తే పలకవద్దు, పెదవులు బిగబట్టుకో. అతని మాటలు చెవిలోపడకుండా చెవులు మూసుకో.

ముద్దు పెట్టుకోడానికి వస్తే ముఖం రెండు చేతుల్తోను కప్పుకో, కౌగిలించుకోడానికి వస్తాడా, దొరక్కుండా కూలబడు. అవసరమైతే కాలికి బుద్ధిచెప్పు: చేయి పట్టుకొని లాగినప్పుడు ఒళ్లు పులకరించిందా, అరచేతుల్తో గట్టిగా రాసుకో. అన్నిటికీ తల అడ్డంగా తిప్పు- అన్నామా? ఇలాటి అపభ్రంశాలు, అవాచకాలు మానుంచీ ఎప్పుడైనా విన్నావా?

కళ్లు మండీ, గుండె మండీ అంటున్నామనుకొనేవు? మాకెందుకు మంటలు? మేమూ ఒకప్పుడు అతనిలో ఒకటై ఉన్న వాళ్లమే. కాలం ఒకే విధంగా ఉంటుందా? మగమహారాజు ఎందరు మగువలనైనా తెచ్చుకోగలడు. తన అంతఃపురంలో ఉంచుకోగలడు. మేము అడ్డు వస్తామా? రాగలమా? వస్తే మాత్రం ఆగుతాడా?

మాకూ తెలుసుగా రాచపద్ధతులు! తెలిసే, అన్నీ ఆకళించుకొనే వచ్చాము సుమా! అలాంటప్పుడు అసూయలెందుకు పుడుతాయి చెప్పు?

నీ సౌభాగ్యానికి సంతోషిస్తున్నాము సుమా! ఈ సుఖాన్ని చవి చూడని వారం కాము గదా– నీ అంత లేకపోయినా ఎంతో కొంత ముద్దూ మురిపం తీర్చుకొన్న వాళ్లమే కాదా. ఈ రుచి ఒకసారి ఆస్వాదిస్తే తీరేది కాదు సుమా! ప్రేమ అనే దప్పి ఆరని తీరని దప్పి. అందులోను మన ప్రియతముని ప్రేమసుధను ఒకసారి చవిచూసిన, బలిగొన్నవారికి ఈ దప్పిక తీరేదేనా? నీవిప్పుడు ఆ ప్రేమను తనివితీరా జుర్రుకుంటున్నావు. చాల సంతోషం. ఈ సంగతి ఒప్పుకోనందుకు!

ఒక్క మాట అడుగుతాను చెప్పు. మీ పుట్టింట్లో పాడి ఉంది కదూ. గేదె పాడి ఉంటుంది. ముర్రుపాలు తినే ఉంటావు. హిమాలయపు మంచు ముద్దలాగ, కండ చక్కెర గడ్డలాగ, పేరిన, బాగా గట్టిగా పేరిన గేదె పెరుగులాగ ఉంటుంది.

ముర్రుపాలంటే – జున్నుపాలంటే మాకు మరీ ఇష్టం సుమా! గేదె పెయ్యలు ముర్రుపాలు తాగి మత్తుగా పగలెల్లా నిద్రపోతాయి. ఆ పాల ప్రభావం అలాటిది. సులభంగా జీర్ణం కాదు. మత్తుగా, మొద్దుగా నిద్రలో పడుతారు. బుద్ధి గేదె బుద్ధిలాగ పిడచగట్టుకు పోతుంది అని వైద్యులు, జాతాశౌచం గనుక ఆచార విరుద్ధం, తాగరాదని ధర్మశాస్త్రజ్ఞులు (ధార్మికులు) అంటారు గాని, ముర్రుపాల రుచి వారికేమి తెలుసు? ఇటు తాగామో, అటు మధువును సేవించినట్టు మత్తుగా పడిపోయామో!

ఇప్పుడు విను. నీవు ముర్రుపాలు తాగిన గేదె పెయ్యలాగ పగలెల్లా ముడుచుకొని పడుకొంటున్నావు. రాత్రంతా మేల్కొని ఉండక తప్పదు కదా పాపం! అందుకని మేను వాడిన తామర తూడులాగ అయిపోతున్నది. మా మాటలకు కళ్లు తెరుద్దామన్నా మూతలు పడుతున్నాయి.

సరే! మనసు మనసులో ఉండదు. ఇవన్నీ ఏమిటి? నీవు అతనికి ప్రియతమను కాదంటున్నావే? అబద్ధాలెందుకు? ఒప్పుకో. అంతే. మేము కోరుతున్నదంతే. ఇంకా ఒప్పుకోవూ...

*(గాథాసప్తశతి 1–65)*

# ప్రియుని చూపు

**చూ**పులోనే ఉందంతా. చూపుతో చూడడం ప్రతి ప్రాణీ చేసే పనే. బెదురు చూపులు, వలపు చూపులు, భయం కొలిపే చూపులు, వాత్సల్యం కురిపించే చూపులు, మోసం చూపులు – ఇలా ఎన్నో! చూపులంటే జ్ఞాపకం వచ్చింది లేడి చూపు. చిన్న అలికిడి కలగగానే బిత్తరపోయి చూస్తాయి లేళ్ళు, ఏదో ముంచుకొని వచ్చినట్టు. పులి చూపులైతే అసలు చూడలేం, ఎదుటివారిని తినేద్దామా అన్నంత క్రౌర్యం ఉట్టిపడుతూ ఉంటుంది వాటిల్లో. సింహం చూపులో క్రౌర్యం కన్నా తానే గొప్ప అనే గాంభీర్యం కనిపిస్తుంది. ఏనుగు చూపులో ఉదాత్తత కనిపిస్తుంది. తోడేలు, నక్క చూపులలో జిత్తులమారితనం పేరుకొని ఉంటుంది అరచేతి మందాన. ఆవు, ఎద్దు చూపులలో ప్రశాంతత పొంగిపొర్లుతూ ఉంటుంది. ప్రియుల – ఇష్టమయిన వారి చూపులు మనకు ఎప్పుడూ హాయిగానే ఉంటాయి.

కొందరిని చూస్తుంటే క్రూరమృగాల చూపులను పుణికి పుచ్చుకున్నారా – అనిపిస్తుంది. కొందరు తమ చూపులతో ఎదుటివారిని కాల్చి వేస్తున్నట్టుంటారు. మరికొందరు నీ పని పడతాను కాచుకో– అన్నట్టు చూస్తారు. జింక చూపులవారు కొందరు మగవారిలోనూ కనిపిస్తారు. మహిళల దృష్టి పడగానే బెంబేలు పడిపోతారు. ఔను! అంత బెదురు గొడ్లయిన జింకలు అడవిలో ఉండటమెందుకు? ఆవులూ, గేదెలూ, మేకలలాగ ఊళ్లలో ఉండరాదూ? క్రూరమృగాల బారిన, వేటకాండ్ర పోరిన పడనవసరం లేదు. తమ అందమైన మేనితో, కాటుక కనులతో గ్రామవాసులను ఆనంద పరచవచ్చు గదా!

గ్రామమంటే గుర్తుకు వచ్చింది. గ్రామం పెద్దల సంగతి నాకు తెలియదు గాని, గ్రామణి, గ్రామణి పుత్రుడు (గ్రామాధికారి, అతని కొడుకు) పరమదుర్మార్గులు సుమా! గ్రామణి అయితే, అధికారబలంతో నరిసిన గుబురు మీసాల మరుగున నవ్వులతో చిలిపి చూపులు పంపుతాడు. గ్రామణి పుత్రుడైతే, వెకిలిగా చూస్తాడు. మనం తప్పుకొని పోవడమే తప్ప మరేమి చేయగలం? ప్రక్క ఊరి గ్రామణి కొడుకుకు పెళ్లామంటే

భయం. వేప విత్తనంలోని పురుగులాంటివాడని అందరూ తెగతిడతారు. అయినా అదేమిటో ఊళ్లో ఆడవారంతా అతడంటే పడిచస్తారు! ఎందుకో? నాకయితే ఇది గొప్పవారితో పొత్తుంటే గొప్ప అనుకొనే మనస్తత్వంలాగ కనిపిస్తుంది గాని మరే కారణమూ కనిపించదు. ఫాల్గునోత్సవంలో (హోలీలో) చూడాలి వాళ్ల సరసాలు!

ఫాల్గునోత్సవమంటే మనసులో ఆ నాటి సంగతి తళుక్కుమంటుంది. వస్తాడో రాడో అని ఎదురుచూచాను. ఉత్సవమంతా గాలించాను. ఎలా వచ్చాడో, ఎప్పుడు వచ్చాడో!! ఒకచోట విసుగెత్తి నిలుచున్నానో లేదో... కనుచూపు మేరలో నిలుచుని రెప్పపాటు లేకుండా నా వైపే చూస్తున్నాడు. సిగ్గుతో ముడుచుకుపోయాను. తలెత్తి చూచాను నెమ్మదిగా. చూపులతో చూపులు కలిశాయి. తల వంచాను. ఓరగా చూచాను. నా పాలిండ్ల పైనే ఉంది అతని చూపంతా. చూస్తుంటే హాయిగానే ఉంది. అయినా పైట బిగించి కొస నడుములో చెక్కాను. నడుము, నాభిమండలం చూస్తున్నాడు. పక్కకు తిరిగాను. పిరుదులనే చూస్తున్నాడు తదేకంగా. కాళ్లు వంకరచేసి అటు తిరిగాను. తిరగడంలో ఊరువులు ఒకదానిపై ఒకటి ఒరుసుకుంటూ అరటి బోదెలలాగ కనిపించాయేమో! అతని చూపు వాటి అందచందాలు ఆస్వాదిస్తూంది. మరి కొంచెం పక్కకు ఒరిగాను. పొందికయిన పిక్కలు అతని చూపులను పట్టివేశాయి. ఏమి చేయను? బొంగరంలాగ తిరిగాను గిరగిరా. పొడుగాటి వేణి నాగుబాములా సాగింది. దానిని చూడడం ప్రారంభించాడు. ఎంతసేపని తిరగను! అలసి సొలసి పక్కన వున్న పందిరి కంబం పట్టుకొని నిలుచున్నాను. అతని చూపు నన్ను ఆపాదమస్తకం అరవైసార్లన్నా పర్యవేక్షించింది. సిగ్గుపడదామన్నా ఓపిక లేదు. చూడనీలే, చూచి ఆనందించనీలే - అనుకున్నాను. నాకూ ఒళ్లంతా కడిమి చెట్టులాగ అయింది కదా!

ఏమిటీ రహస్యం, చెప్పరూ? గ్రామణి, గ్రామణి పుత్రుడు చూచినప్పుడు ముళ్లు గుచ్చినట్టుండేదే? అతడు చూస్తే పచ్చ కర్పూరం చిలకరించినట్టూ, వెన్నెలలు విరగబూసినట్టూ, విరజాజులు వెదజల్లినట్టూ ఉందేమిటి? అతడు చూచినప్పుడు నా అంగాలను కప్పుకున్నాను. పక్కకు తిరిగాను గాని మళ్లీ మళ్లీ చూస్తే బాగుండుననే మనసులో అనుకున్నాను. దీనికి కారణమేమంటారు? ఇష్టం. అతడంటే నాకు ఇష్టం. ఇష్టమనే కోణంతో చూస్తే అంతా తీపే! లేకపోతే అంతా ఒగరూ, చేదూనూ. ఇష్టమైనవాడు సర్వరమణీయుడు, సర్వసురభి!

*(గాథాసప్తశతి 1-73)*

# నీకేమిటి ఎరువు!

అబ్బ! ఏం మనిషో! పగలూ లేదు, రాత్రీ లేదు. నిరంతరం ఉపవనంలోనే కాపురం. ఏ చెట్టుకు ఎలాటి ఎరువు వేయాలి? ఏ చెట్టు పక్కన ఏ చెట్టు ఉండాలి? ఏ చెట్టుకు ఏ తీగ పాకించాలి? మల్లెతీగను మామిడి కొమ్మకు పాకిస్తే బాగుంటుంది. గున్నమామిడికి చుట్టూ పాదు చేసి అరుగులు కట్టించాలి. కొబ్బరి చెట్టు బాగా కాయడానికి సాధారణమైన సముద్రపు ఉప్పు చాలా? సైంధవలవణం వేయాలా? సైంధవలవణం గడ్డలను నాకడానికి కొబ్బరి చెట్టేమయినా గుఱ్రమా? సరోవరం దగ్గర వేప చెట్టు ఉండరాదు. వేప వేళ్లు నీళ్లను వెదుక్కుంటూ సాగిపోయి సరోవరంలోకి దిగుతాయి. కండచక్కర పానకం వంటి నీళ్లు చేదు విషమయిపోతాయి. ఊదుగు చెట్టుంటే భూతాలు రావట. గార గింజెల నూనె తలకట్టును పెంచుతుందట. మఱ్ఱి చెట్టును దూరంగా వేయాలి. దానికింద మరొక చెట్టు పెరగదు. ఖర్జూరం చెట్టు! వద్దు, వద్దు - పిట్టకయినా నీడుండదు, పళ్లు కోసుకుందామా అంటే కష్టం మీద కాని అందవు. సరోవరంలో తామరలతో పాటు కలువలు కూడా పూయిద్దాం. ఇవీ ఆ మనిషికి ఎడతెగని ఆలోచనలు!

చెప్పడం మరిచాను. మరీ విడ్డూరం! ఆడది తమలపాకుల తమ్మ ఉమిస్తే ఏదో చెట్టు పూస్తుందట. ఆడది పారాణి కాలితో తంతే మరేదో చెట్టు కాస్తుందట. కౌగిలించుకుంటే ఇంకేదో చెట్టు పువ్వులతో నవ్వుతుందట. ఇదంతా ఎవరో వృక్షాయుర్వేదాచార్యులు చెప్పారట. నాతో రేయీ, పగలూ ఇదే గోల! ఈ చెట్టును తన్ను. అదిగో ఆ చెట్టుపై ఉమ్మివేయి. ఇక్కడ చూచావా! ఈ చెట్టును కౌగలించుకో. ఆ దూరంగా వుండే చెట్టును చూడు. ఆ పక్కన ఉండే చెట్టును పలకరించు - ఇదీ వరుస!

ఛీ! నా కర్మ కాలి, చెట్టునూ పుట్టనూ కావలించుకోవాలా? పలకరించడానికి, చూడటానికి మనుషులే లేరా? నిజమే. ఎక్కడున్నారులే! ఈ మనిషి ఉండీ ఏమి ప్రయోజనం? ఆ చెట్లకు చేసే దోహదాలు తనకు చేసుకోరాదూ? చెట్టంత మనిషి

తానుండగా, అలో లక్ష్మణా అంటూ నేను చెట్టును కావలించుకోనా? కురవకం మీద పడనా?

నా కడుపులో ఒక్క కాయ కాస్తే చూద్దామని తహతహలాడిపోతున్నానే! కాపురం పెట్టి ఎన్నేళ్లు! ఎన్నేళ్లు! వంపు సొంపులన్నీ వ్యర్థమయిపోతున్నాయే! ఒక్కసారి చేరదీద్దాము, ఒక్కసారి పారాణి పాదాల మీద కెంపులు చూద్దాము, ఒక్కసారి పళ్ల మధ్య నలిగిన తములం అందుకుందాము.. ఊహుఁ! ఇవేమీ లేకపోగా చెట్టును కావలించుకో, పుట్టను తన్ను - ఇవీ శృంగారాలు!

ఏం చేయను చెలీ, ఏం చేయను? నవ్వనా, ఏడవనా? నవ్వుతాను. వెక్కిరిస్తూ నవ్వుతాను. ఎప్పుడు తెలుసుకుంటాడో ఈ మనిషి?

*(గాథా సప్తశతి 1-6)*

# అగ్గికీ ఆశే!

ఔను! ఈ ఆడవాళ్లంతా ఇంతే - వంటను యజ్ఞమనుకుంటారు, వంటసాలను యజ్ఞశాలనుకుంటారు. మరికొందరు మహానసాన్ని మహాసామ్రాజ్యంగా భావిస్తారు. లోపల అడుగుపెట్టామా కొంపలంటుకుపోయినట్టు బాధపడతారు. "ఎప్పుడూ ఏమిటీ వెంట? వేళా పాళా, చోటూ మాటూ లేదా? కొంగు పట్టుకొని ఎక్కడికైనా సిద్ధం! ఎప్పుడూ చూస్తూ కళ్లు మిటకరించడం ఎందుకూ? పనీ, పరమార్థము లేకపోతే సరి!" అంటూ రుసరుసలూ, విసవిసలూనూ.

నేను వచ్చి వంటింటి గడపలో నిలుచున్నానా? ఏమైనా మనసులో ఆదరమూ, ఆప్యాయతా ఉన్నాయా? ఏ పని చేస్తున్నప్పుడు ఏ అందం వుంటుందో జుర్రుకోడానికి వచ్చాడని కొంచెం ఇది ఉండక్కరలా? నిజంగా మగువలు మరువమూ, దవనమూ వంటివారు. ఆపాదమస్తకమూ అందమే. ఏం చేసినా చూడాలనిపిస్తుంది. ఏం పలికినా వినాలనిపిస్తుంది. దీనికి నిషేధాలు, నిరోధాలు ఉండరాదు. కాలం మహావేగంతో పరుగులిడుతూంది కదా! అందాలు చూచుకోకుండా ఎలా ఉండగలరు? అదిన్నీ మన ఇంట్లో, మన ఎదుట ఉన్న అందం? పరభామా, చూడరాదనడానికి?

త్సొ త్సొ! పాపం గుమ్మడి పూవులా, తమ్మి మొగ్గలా పొయ్యి ముందు వాలి ఏం చేస్తూందో? పచ్చి కట్టెలా? పొగ చూరి పొయ్యి మండడం లేదు కాబోలు! ఈ కట్టెల పొయ్యి బతుకే ఇంత! హాయిగా హసంతి (కుంపటి) వాడరాదూ? 'వంటకు పనికి రాదు. కుంపట్లో వంట - మా బాగుంది! ఇంటిల్లిపాదికీ, అతిథికీ, అభ్యాగతికీ, వచ్చిన చుట్టాలకూ వంట త్వరగా తెములుతుందా?' అని ఎదురు ప్రశ్న. దీనికి పరిష్కారం లేదు. కాని....

ఆట పట్టించడానికి ఇదే సమయం. "ఇదిగో చూచావా? నీవు వంటలో గరితవు. నలభీమపాకాన్ని, వనవాసంలో ద్రౌపదీదేవి పాకాన్ని తలదన్నావు - సీతాదేవి పాకం చేసినట్టు ఆధారాలు లేవు. కనుక ఆమె జోలి మనకు వద్దు.

నిప్పు మండడం లేదని కోప్పడకు, పొగచూరిన నీ కళ్లు ఎంత అందంగా ఉన్నాయని? నీ ఊర్పయితే ఎఱ్ఱ పాదిరి పూవులాగా గమగమలాడుతూంది. ఊది ఊది నీ పెదాలు మరీ ఎరుపెక్కాయి. ఈ సౌందర్యాన్ని చూద్దామని, నీ కమ్మని ఊర్పులు తాగుదామని అగ్నిదేవునికి కూడా ఆశ సుమా! పొగ అనే సాకుతో నీతో ముచ్చట్లాడుతున్నాడు సుమా! దేవతలు ఎందరు మానవస్త్రీలను ప్రేమించడం లేదు? అగ్ని ఆ దేవతలలో వాడేగా!"

"చాలులేండి, వంటింట్లోనూ అలంకారశాస్త్రమా, పొయ్యి మండక ఛస్తుంటే? అందుకే ఇంట్లో ఎవరైనా పెద్దలు ఉండాలంటారు... అమ్మో! ఈ పొయ్యితో వేగలేనురా తండ్రీ!..."

*(గాథాసప్తశతి 1-14)*

# తూములోని పసుపు

ఇల్లంటే ఇలా ఉండాలి. చుట్టూ కంచె, కంచెకు చిన్న తలుపు, కంచెకు కొంచెం ఆవలగా పూలమొక్కలు. పెరట్లో కూరగాయల పాదులు. కంచె తలుపుకు కొంచెం ఎడంగా గున్నమామిడి చెట్టు. చేతికి అందేట్టు మామిడిపళ్లు. ఇటుపక్క ఆముదపు చెట్టు. కంచె సందులోంచి ఆముదపు ఆకులు దూసుకొని బయటికి వచ్చాయి. ఈ ఇంట్లో పడుచుల పయోధరాలు పట్టెడేసి పట్టెడేసి అని అరచిచెబుతున్నట్టు ఉన్నాయి, ఆ ఆముదపు ఆకులు. దొడ్లోని బీర పాదు విరగపూసింది. బీర పూవుల గుత్తులు ఇంట్లోని యువతుల కళ్ల మెరపులు తెలుపుతున్నాయి.

పనీ పాటూ చేసుకుంటున్న చేడెలను చూస్తుంటే మహా ఆనందంగా ఉంటుంది సుమా! అటేమో ఒకావిడ వడ్లు దంచుతూంది. రోకలిపోటుకు తగిన లయలో పాట పాడుతూంది. మరొకావిడ దంచిన వడ్లను చెరుగుతూంది. చెరిగేప్పుడు, దంచేప్పుడు కలిగే అంగాల కదలికలోనే ఉంది అందమంతా. అటువైపు మరొకావిడ బావి నుంచి నీళ్లు తోడుతూంది. నీళ్లు తోడుతున్నప్పుడు బాహుమూలరుచి, పయ్యెదలో కదలిక చూచేవారిని వె(రెత్తించవూ?

అటు చూడండి. పూలు కోస్తూంది ఆ యువతి. ఆవిడే ఒక ఉద్యానవనం. ముఖమేమో విరిసిన మందారం, కళ్లేమో వావిలి గుత్తులు, పళ్లు మల్లెమొగ్గలు. ముక్కేమో మోదుగ మొగ్గ. పెదవులు మామిడి చిగుళ్లు. మామిడికాయలేవో చెప్పనక్కరలేదు. తానే పూలతోట కదా, తననే భగవంతునికి అర్పించుకొంటూ సాగిలపడి మొక్కితే చాలదూ?

ఆ వైపు చూడండి. ఒకావిడ నీళ్లు తోడుతుంటే, మరొకతె పాదులకు నీళ్లు కడుతూ కడుతూ ఏమేమి ఊహించుకొంటూందో, ఏమేమి తలపోస్తూందో! బోదెలు పొర్లిపోతున్నా చూచుకోడం లేదు. ప్రియుణ్ని తలచుకుంటూందేమో! తలచుకోనివ్వండి మంచిదే. కాని ఏ పని చేసినా ఏకాగ్రత అవసరమంటారు. ఒక పని చేస్తున్నప్పుడు మరొకటి తలచుకుంటే చేస్తున్న పని పాడయిపోదూ?

ఇటు చూడండి. ఇదండీ రసకందాయమైన దృశ్యం! ఒకావిడేమో స్నానాలగది తూమును చిన్న కర్రతో కెలుకుతూంది. పూచిన తంగేడులాంటి శరీరయష్టి. పసుపు నీళ్లాడింది – పసుపు రుద్దుకొని స్నానం చేసింది. మరీ పచ్చగా ఉంది. పసుపు స్నానం ఎందుకు? ఎందుకేమిటి? మూన్నాళ్ల మైల తర్వాత పసుపు రుద్దుకొని స్నానం చేయడం ఆచారం. ఆచారమే కాదు, ఆరోగ్యం. పసుపును ఆహారంలోను వాడతారు. ఒంటికీ పూసుకుంటారు. మగవారూ పూసుకొనేవారు. కాని, స్త్రీలకు సౌభాగ్యసూచకంగా పూసుకోడం ఆచారమైంది. మైలపడిన మూన్నాళ్లు పసుపు నూనె, పసుపు నేయి ముఖానికి పూసుకోడం కూడ కద్దట. పసుపు తూము గండ్లలో ఇరుక్కుంది. నీళ్లు పోవడం లేదు. చిన్న కర్ర తీసుకుని పసుపును తోస్తూంది.

అంత శ్రద్ధగా శుభ్రం చేస్తున్నది. ఎవరిని కృతార్థుని చేస్తుందో! ఎవరినో ఎందుకు? పతిదేవుణ్ణే. పాపం శంకించడం ఎందుకు? మురికి నీళ్లు నిలవైపోకుండా గండ్లలో అడ్డుకున్న పసుపును తోసి వేస్తూంది. అంగరాగంతో గుమగుమలాడిపోతూంది శరీరమంతా. రాత్రిసేవకు ఇంత సన్నాహం.

ఆ పక్కింటావిడను చూడండి. ఆవిడా పసుపు స్నానం చేసింది. తలంటుకుంది. పిక్కలదాకా వేలాడుతున్న కేశపాశం. చెట్టు పట్టలు, ఇప్పపొడి కలిపిన చూర్ణంతో తల రుద్దుకుంది. ఎంత నీళ్లు పోసుకున్నా స్నానచూర్ణం కేశపాశంలో మిగిలిపోయింది. దంతపు దువ్వెనతో దువ్వుకుంది. చూర్ణం దువ్వెన సందుల్లో ఇరుక్కుంది. ఇరుక్కున్న మురికిని సన్నటి పుల్లతో తీసివేస్తూంది. దువ్వుకుంటున్నప్పుడు ఏమి సోయగం, ఏమి వయ్యారం! బాగా తల దువ్వుకుని సింగారించుకుంటోంది. రాత్రి వరకూ వేచి ఉండాలి. అప్పటికి గాని ఈ ప్రసాధనమంతా ఫలించదు. అంతగా వేచి ఉండడం ఎందుకు? శుభస్యశీఘ్రం కదూ! బాగుంది! వేళా పాళా లేదా? ఇంట్లో పెద్దలు, పిన్నలు, సిగ్గూ బిడియం ఉండవూ?

ఏమైనా అదృష్టవంతుడు, ఎవరో గాని ఈమె ప్రియుడు! మూన్నాళ్ల విరహం తర్వాత ముచ్చటలు తీర్చుకుంటాడు. ముచ్చట్లు చెబుతాడు. ముచ్చట్లు వింటాడు. అదేమిటో గాని, ఇష్టమైన ముచ్చట్లు ఎప్పుడూ హాయిగానే ఉంటాయి. అర్థం పర్థం ఉండదు. వరుసా, క్రమం ఉండదు. పొందికా, పద్ధతీ ఉండదు. వట్టి గుసగుసలు, రుసరుసలు. అయినా మత్తుగా ఒత్తుగా ఉంటాయి. అందరికీ అలాటి అదృష్టం పట్టేనా?

*(గాథాసప్తశతి 1–80)*

## గుల్లం గుల్లం!

ఔను... ఎడబాటు ఘోరమైంది. దీనిని సహించడం కష్టం. కాని, సహించక తప్పదు. జీవికకోసం పరదేశం వెళ్లవలసి వస్తుంది. ప్రయాణం సరిగా సాగదు. ఈ సాతవాహనుల కాలంలో మహాపథాలు పడ్డాయి గనుక సరిపోయింది గాని, పూర్వం పరదేశగమన మంటే మరీ బీభత్సమట. దారీ లేదు, డొంకా లేదు. ఏదో అడవిన పదుగురూ తొక్కగా ఏర్పడిన కాలిబాటన పోవడం, దొంగలు కొట్టడం, గొల్లుమనడం సర్వసామాన్యమట. ఈ సాతవాహనుల రాజ్యంలో దొంగల భయం లేనేలేదు. గ్రామీణులూ, గ్రామరక్షకులూ పాంథులను ఎప్పటికప్పుడు యోగక్షేమాలు కనుక్కొంటూ ఆదుకొంటుంటారు. నేను వచ్చే దారిలో ఒక గ్రామణి ఇంట విడిది చేయవలసి వచ్చింది. అతని కొడుకు మహాశూరుడు. దొంగలతో, దుండగులతో పోరాడి, అతని రొమ్మంతా గాయాల గంట్లతో చూడ భయంకరంగా ఉండేది. అతని ఇల్లాలు అతని ఆ ఎగుడుదిగుడు రొమ్ముమీద ఎలా పడుకునేదో కాని, గ్రామం మాత్రం ఆదమరచి నిద్రపోయేది.

దొంగల బెడద లేదు గాని, దొంగచాటు పడతుల బాధ మాత్రం కొన్ని గ్రామాల్లో ఎదురయింది. ఒకనాడు మిట్టమధ్యాహ్నం ఎండ మండిపోతోంది. ఒక ఇంటి అరుగుమీద చూరునీడన కూర్చుని పోదామని అలా నడుం వాల్చాను. పనుల తొందర, ఎక్కువసేపు విశ్రాంతి సమయమేదీ? లేచి పోబోయాను. ఇంతలో ఇంట్లో నుంచి ఒక వనిత వచ్చింది. వయసులోనే ఉంది. "పాంథుడా, మధ్యాహ్నం ఎండ భయానికి మన ఒడలి నీడ కూడ ఒడలిని దాటిపోవడం లేదు. నీవు వెళ్లుతున్నావు. కొంచెం విశ్రమించు నా నీడ నా మీదే ఉంది చూచావా? ఇదిగో!!!" అంటూ తన స్తనచేలం తొలగించి వేలితో చూపింది. నేను భయపడిపోయాను. ఇంతదేశం తిరిగాను కాని ఎక్కడా కాలు జారలేదు. ఎలా జారను? నా కోసం పరితపించే ప్రియసతి ఊళ్లో ఉండగా, ఎలా అన్యాయానికి ఒడిగట్టను? పాపం ఎలా ఉందో!

నేను ఉషః కాలం పయనాలకు మంచిదని పెద్దలంటారు కదా అని ఉషఃకాలంలో బయలుదేర నిశ్చయించుకొన్నాను. వెనకటి రాత్రల్లా పోరుపెట్టింది, 'పోవద్దు, పోవద్దు' అని. పని తప్పనిసరి ఆయె. పోకపోతే ఎలా? ఎంతో సమాశ్వాస పరచాను. పని ముగియగానే రెక్కలు కట్టుకొని వాలుతానన్నాను. ఏవేవో మాటలు, బాసలు చేశాను. ఉహూ వింటేనా? తన ప్రయత్నాలన్నీ విఫలం కావడం చూచి, "ఓ తల్లీ, భగవతీ, నిశాదేవీ! తెల్లవారకుండా చేయవమ్మా. నా ప్రియుడు అప్పుడు వెళ్లడమే పడదు" అంటూ ప్రార్థన చేసింది. నేను నవ్వుకున్నాను.

నా పయనం తప్పదని నిశ్చయం చేసుకొన్న తర్వాత మతి చలించినట్లుంది. విరహంలో – ఎడబాటులో ప్రాణాలు నిలుపుకొనడం ఎలా? దాని రహస్యమేమిటి? అని ఎడబాటులో ఉన్న మగువలను అడగడానికి బయలుదేరింది. నేను నిజంగానే పకాలున నవ్వాను. నవ్వు నాలుగందాల చేటంటారు పెద్దలు. నా విషయంలో నిజమయింది ఆ మాట. ప్రియురాలు కోపంతో ఎర్రనయిపోయింది. "ఇక నీతో మాట్లాడను! తిరిగి వచ్చినా నోరు తెరవను!" అని భీష్మించుకుంది. ఇంకా ఆ కోపం చల్లారిందో లేదో! స్వభావతః కొంచెం బిగుమానం మనిషి. ఇప్పుడిక బింకమూ తోడయింది.

నేను త్వరలో వస్తాననే ఆశాబంధంతో వేళ్లు లెక్కపెడుతూ, గోడమీద గీతలు గీస్తూ, ముత్యాల సరాలలోని ముత్యాలను పక్కకు తోస్తూ కాలం గడుపుతూ ఉంటుంది. నేను ప్రయాణంలో, ప్రవాసంలో ఎంత బాధపడుతున్నానని! చలి కాలంలో ఈ బాధ మరింత.

లేదు. కోపం చల్లబడే వుంటుంది. నేను ప్రవాసానికి బయలుదేరినప్పుడు మాట్లాడకపోయినా, వాలకం చూచానుగా! నేను ఇంటి మలుపు తిరిగేవరకూ కంచె చివరి దాకా కళ్లు మరీ పెద్దవి చేసుకొని పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ వచ్చింది. అది చూడగా, పంజరంలోని పిట్ట పరుగులు తీసినట్టనిపించింది. ఇప్పుడూ అంతే. నేను వచ్చినట్టు తెలియగానే కంచె వద్దకు వచ్చి, మునికాళ్లమీద నిలబడి చూస్తుంది. కాలి బొటనవేళ్లు ఎంత బాధపడతాయో! చేతులెత్తి చూస్తున్నప్పుడు పయోధరాలు పైకి ఉబ్బి మరీ పెద్దవిగా, అందంగా కనిపిస్తాయి. ముంగిటిలోని మల్లెలూ, పున్నాగాలూ పాద్రిపూలూ తలపైన, ఒంటిమీద పడి వనదేవతలా సాక్షాత్కరిస్తుంది...

ఎంత ఉత్సాహంతో తిరిగి వచ్చాను. ఎంత ఉత్కంఠతో పొంగిపోతున్నానో, కాని, ఏదీ? స్వాగతమేదీ? ఇంట్లో ఎవరూ లేరా? లేకేం, లోపల ఉన్నారు. మానధనుల

మానజ్వరం ఇంకా దిగలేదన్నమాట! కంచె తలుపు తీశాను. నత్తనడకలు సాగించాను. చుట్టూతా చూచాను. పాద్రిచెట్టు ఎండిపోతూంది. మల్లెతీగ వాలిపోయింది. పున్నాగాలు పూయడం లేదు. ఉన్న నాలుగుమెట్లూ ఎక్కి తలవాకిట్లో అడుగుపెట్టాను. తెచ్చిన మూటా ముల్లె మూలలో పెట్టాను. పిల్లి అడుగులు వేస్తూ పథసాల దాటాను. అటూ ఇటూ పరికించాను. పడక గదివైపు నడిచాను. ఓరగా వేసిన తలుపు నెట్టాను. పందిరి మంచంపై దీర్ఘసమాధిలో ఉన్న ప్రియురాలు. పక్కనే మూడేళ్ల పాపడు.

పాపడు దిగ్గున లేచాడు. నా చేయి పట్టుకొన్నాడు. అమ్మ దగ్గరికి లాక్కు వెళ్లాడు. అమ్మ కదలలేదు, మెదలలేదు. పాపడు ఇద్దరినీ చూస్తూ నిలుచున్నాడు. పాపడి చేయి విడిపించుకోకనే ప్రియురాలి వద్దకు వెళ్లాను. వేళ్లు పట్టుకొన్నాను. ఏదో విషప్పురుగు తాకినట్టు విసరికొట్టింది. ధైర్యం చేసి వంచిన ముఖాన్ని చిబుకం పట్టుకొని పైకెత్తాను. ముఖం వాల్చి, కళ్లుమూసుకుంది. రెండు చేతులతోను ముఖం పుణికి పుచ్చుకొన్నాను. దయ్యం పట్టినట్టు తల అటూఇటూ ఆడించింది. 'ఎంత చిక్కిపోయావు పాపం!' అన్నాను. 'ఫ్చ్!' అన్నది. 'ఈ యౌవనం నదీప్రవాహం వంటిది. రాత్రులు, పగళ్లు గడచిపోతున్నాయి. తిరిగి రావు. ఎందుకీ పాడు కోపం?' అన్నాను. మూతి మూడు వంకరలు తిప్పింది.

ఇక ప్రయోజనం లేదు. గృహిణి కోపగించుకుంటే, ఎలా గడుస్తుంది సంసారం? నేను బహుకాలప్రవాసం నుంచి తిరిగి వచ్చాను. ఇప్పుడే శాంతి కావాలి. నిజానికి సంసారమనే పదానికి భార్యాభర్త లిద్దరూ రెండు చక్రాలు, జోడు గుర్రాలు, సమానస్కంధులు. ఒకరి హెచ్చూ, మరొకరి లొచ్చూ ఏమీ లేదు. దాసుని తప్పులు దండంతో సరి! ప్రణామాంతో మానః అన్నారు పెద్దలు. నమస్కారం చేస్తే అలక తొలగుతుంది అనుకొన్నాను. మోకాళ్లపై వంగి ప్రియురాలి పాదాలపై పడ్డాను దభీమని. ఇదంతా గంభీరంగా చూస్తున్న పాపడికి, తండ్రి దండం పెట్టడం ఏదో వినోదమనిపించింది. ఠపీమని నా వీపుమీద ఎక్కి 'గుల్లం గుల్లం!' అంటూ సవారీ ప్రారంభించాడు.

ఈ దృశ్యం చూచి గృహిణి పకాలున నవ్వింది. కోపమంతా ఎక్కడ పోయిందో! నవ్వును ఆపుకోలేకపోయింది. "తప్పు తప్పు" అంటూ నన్ను లేవనెత్తింది. జాముసేపు ప్రియుడు ఎంత ప్రయత్నించినా కాని పని, పాపడు క్షణంలో సాధించాడు!

*(గాథాసప్తశతి 1-11)*

# దోస తీగ కొసలు

ఇష్టులయిన వారిని ఎంతసేపు చూచినా, ఎంతసేపు పలకరించినా తనివి తీరదు. స్వప్నంలో మంచి నీళ్లు తాగినట్టు ఉంటుంది. కొందరు తత్త్వవేత్తలు స్వప్నానుభవం కూడ పరిగణనీయమే అంటారు. ఆ అనుభవం కూడ కొంత హాయి ఇస్తుంది గనుక యథార్థం వంటిదే నంటారు. కాని స్వప్నంలో తాగిన మంచి నీటితో దప్పిక తీరుతుందా? అలాగే మనకు ఇష్టమైన వారి చూపులూ, మాటలూను.

ఆ ఉత్సవంలో నన్ను చూచాడా? ఏమి చూపులవి? ఆశ తొణికిసలాడిపోతున్నది. కాని, మరొకసారి ఆ చూపులు పైన పడుతాయా. మరొకసారి జుర్రుకుందామా – అంటే, ఏదీ? ఆ ఆశ అరకొరగానే మిగిలిపోయింది. ఇంత కాలమైంది, మరి ఆ చూపు ఏమయిందో! అందువల్లే స్వప్నంలో మంచినీళ్లు తాగినట్టయింది. స్వప్నం ఉన్నంతసేపూ మంచినీరు తాగుతున్నట్టే ఉంటుంది. కల ఎంతసేపుంటుంది? కరిగిపోదూ! కరిగిపోగానే మిగిలేదేమిటి? అసంతృప్తి, నిరాశ, దప్పి తీరకపోవడం.

ఇదీ ప్రేమలోని వేడి. దూరం నుంచి సంతృప్తి కలిగినట్టే ఉంటుంది. దగ్గరికి వెళ్లితే ఎండమావులవుతాయేమో నన్న ఆందోళన కలుగుతుంది. ఆందోళనకు ఏమిటి ఆధారం? ఆధారం ఉంటే అది ఆందోళన ఎందుకవుతుంది? ఈ ప్రేమ అనే దానికి ఆధారం లేదు, ఆధేయం లేదు. అదే పరిస్థితులను బట్టి ఆధారమవుతుంది, ఆధేయమూ అవుతుంది.

ఆధారమయినప్పుడేమో కోపాలూ, తాపాలూ, మానాలూ, అవమానాలు, దానిలోనే పుట్టి లీనమయిపోతాయి. వాటి నామరూపాలు కనిపించవు. అలకలు, ములుకులు, పలుకులు, కులుకులూ – అన్నీ దానిలో మునిగిపోతాయి. అలకంటే ఆ నాటి సంఘటన స్మృతిపథంలో సంచరిస్తుంది.

పాపం! ఏదో తప్పు చేసి వచ్చాడు. తప్పులు మానవుల వల్లే అవుతాయి గాని మానుల వల్ల కాదు గదా! ఎంతసేపో అనునయించాడు విసుగూ, విరామమూ లేకుండా, నా పట్టుదల పాపిష్ఠిది. సడలలేదు. వెళ్లిపొమ్మన్నాను. ఔను మరి! తప్పు

సామాన్యమయింది కాదు కదా! నా అలక న్యాయమయిందే! నా సఖీజనం కూడా ఆ మాటే అన్నారు. కాని, ప్రయోజనమేమిటి? ప్రేమంటే పడి చచ్చే పడతుల అలక సాగుతుందా చాలాకాలం? బింకంతో ఎక్కడుండగలం? అలక ఎంతసేపు కొనసాగించగలం? అన్ని తప్పులు చేసినా, అతని పైన ఉన్న తీపికొద్దీ, మౌనం - బింకం పిడికిలిలోని ఇసకలాగ సురసురమంటూ జారిపోసాగాయి. ఈ దౌర్బల్యమే కాదూ మగవారి బలం! ప్రేమ అనేది అన్నిటినీ అణిచివేస్తుంది, మఱ్ఱి చెట్టు తక్కిన చెట్లను లాగ.

ఈ వెఱ్ఱితనం చూచి మరికొందరు సకియలు అన్నారు గదా- "ఎంత పిచ్చే నీకు? మరీ అంత బేలతనం పనికి రాదు సుమా. అంతటి తప్పు ప్రత్యక్షంగా కనిపించింది. ఎవరో చెప్పిన కొండేలు కావు. నీవే నీ కనులార చూచావు... సరే. కలుసుకొన్నావు మళ్లీ. ఇది ఎలా వుందంటే, కాచిన మంచినీళ్లను చల్లార్చి తాగినట్టు. కాగి చల్లారిన మంచినీటిలో వెనుకటి రుచి వుంటుందా?" ఊఁహుఁ! అని నేను మాత్రం, వాళ్లతో ఏకీభవించను. తప్పు జరిగింది. ...ఇద్దరూ సర్దుకుని సమాధాన పడ్డారు. ఇకమీద తప్పులు జరుగకుండా చూద్దామని అనుకున్నారు. మునుపటిలాగ ప్రవర్తించడానికి అభ్యంతరం ఏముంటుంది? సర్దుకోడమన్నా, పశ్చాత్తాప పడడమన్నా తప్పును తుడిచివేయడమే కదా. దొంగ తప్పు చేస్తాడు. మరొకడు కోపావేశంలో ఏదో చేయరాని పని చేస్తాడు. రాజశాసనం అతనిని దండిస్తుంది. అంతటితో అతని తప్పు- కళంకం మాసిపోతాయి. ఇదీ అలాగే కదూ. పాలూ నీళ్లులాగ, పాలూ పంచదారలాగ కలిసిపోవాలి.

ఈ ఆలోచనలోనే మునిగి అటువైపు చూదును కదా, వరిచేలు పండి వంగిపోయాయి. ఇవి ఇంతవరకు సంకేతస్థానంగా ఎంతో ఉపకారం చేశాయి. ఆ గుబుర్లలో ఎవరు ఎక్కడ ఉన్నదీ, ఏమి చేస్తున్నదీ బ్రహ్మదేవునికైనా తెలియదు. అలాటి వరిచేలు కోతకు సిద్ధమైతే ఏమి చేయను? మరొక మంచి సంకేతస్థలం ఎక్కడ వెదకను? ఏడుపు వచ్చింది. తల వంచుకొన్నాను. కన్నీరు కపోలాలపై చారలు కట్టింది.

ఇది కూడా నా నెచ్చెలులు కంటబడింది. వారు విరగబడి నవ్వారు. నాకు మరీ మండుకు వచ్చింది. ఒకరి తీపు మరొకరికి తీపి, ఎద్దు పుండు కాకికి ఏమిటి లెక్క అన్న సామెతగా. ఉరిమి చూచాను. "ఎంత అమాయికవే నువ్వు!! ఇటు చూడు. పచ్చని పూలతో ఏపుగా పెరిగిన జనుప చేను, చూచావా, అరదళం అద్దుకొన్న గటిలాగ. నీకు సంకేతస్థలానికి కరవేమిటి మరి? వెఱ్ఱి వేయి విధాలు అంటే ఇదే కాబోలు!" అన్నారు.

నిజమే, నాకు తోచలేదు సుమా. జనప చేలు మరీ పదిలం! చూపరుల దృష్టి బంగారులాగ మెరిసే పచ్చని పూవులమీద పడుతుంది. చేల మధ్య ఏమి జరిగేదీ ఎవ్వరికీ తెలియదు.

అయ్యో! ఎంత దారుణం! ప్రాణమిచ్చే చెలులందరినీ వదలి దూరంగా పోవలసి వచ్చింది. వాళ్లను చూడలేకపోయాను. ముఖం పక్కకు తిప్పుకొన్నాను. కన్నీళ్లు కాలువలు కట్టాయి. ఇంతయినా లోకజ్ఞానం రాలేదేమో? 'లోకగతి ఇది. సంయోగవియోగాలు లోకసహజమయినవి. సముద్రంలో రెండు దుంగలు కొట్టుకొని వస్తాయి. ప్రవాహ వేగానికి రెండూ కొంతదూరం కలిసి ముందుకుపోతాయి. ఏ సుడో, ఏ పెద్ద కెరటమో కొడితే విడిపోతాయి. అలాటిదే ఈ ప్రపంచంలో ప్రాణికోటి సమాగమమని అనుభవం వడపోసిన వ్యాసులవారన్నారే. ఏడవకు, ఈ ప్రేమలనేవి దోస తీగ లేత కొడులు (కొసలు) లాగ చాలా సున్నితమైనవి. పక్కన వున్న వాటిని పెనవేసుకొంటాయి. వాటిని గట్టిగా పట్టి లాగామా పుటుక్కున విరిగిపోతాయి. కనుక నెమ్మదిగా విడిపించి మరొక దానికి పాకించాలి. అక్కడ అల్లుకు పోతాయి. నీవూ అంతే. ఇక్కడ వున్న ప్రేమను నెమ్మదిగా ప్రియతమునిపై మరింతగా చూపు గట్టిగా పట్టుకుంటుంది.

'కాని, లేత కొడులను సుతారంగా పాకించాలి. గోళ్లు తగిలాయా, మాడిపోతాయి. ఇది లోక రీతి, అమ్మాయ్! ఒకటి గ్రహించావో లేదో, ఆడవాళ్లు అంటు మామిడి వంటివారు. ఇక్కడ కత్తిరించి అక్కడ అంటు కడితే అతుక్కుపోయి, పుష్పిస్తారు. అన్నారు నిజమేనా?

*(గాథాసప్తశతి 1-10)*

# పేదరాలి వేవిళ్లు

వేవిళ్లు వనితల మాతృత్వానికి పూర్వరంగం. పుట్టబోయే పసిపాపల పెదవులను, కలువ కన్నులను, తామర అడుగులను తలచుకుంటూ వనితలు పొంగిపోతూ ఉంటారు. ఆ పొంగుతోనే పాదాలూ, బుగ్గలూ, మొగమూ పొంగుతాయి. ఏవేవో తియ్యని తలపులు పెనవేసుకుంటాయి. పగటి కలలకు పరిమితే ఉండదు. కోరికలు పుట్టుకువస్తాయి. వాటితో పాటే నోట నీరూరుతుంది.

పాపం! కేవలం ముద్దరాలు. తొలి వేవిళ్లు, ఒడలంతా ఏమిటోగా ఉంది. కడుపులో దేవినట్టు అవుతుంది. ఏమిటేమిటో తిందామని ఆశ. పుల్ల దానిమ్మలా? పుల్ల మామిళ్లా? పుల్ల పుల్లని పెరుగా? పుల్లని - పళ్లు కూడా పులిసిపోయే పుల్లని - నిమ్మలా? పుల్ల ద్రాక్షలా? తీపి ఇష్టమా? ఆవుపాలు, లడ్డుకాలు, మోదకాలు - ఏవి? పిండ ఖర్జూరమా?

అబ్బ! ఈ సఖీజనం ఊరికే పీక్కుతింటుంది. ఏది ఇష్టమని పదే పదే అడుగుతుంది. ఏమి చెప్పను? నాకు తినుబండారాలపై ఇష్టం ఉంటే, చెప్పనూ? వీళ్లకు కొంచెమైనా ఇంగితం లేదు. పెద్దల ముందే అడగడమా? ప్రియుని ముందే పరాచకమా? ఇలాంటి ఆటలు వద్దు. నాకు సిగ్గుతో చచ్చినంత పనవుతుంది. తలెత్తుకుని పెద్దల ముందుకు పోలేను - అని ఎన్నోసార్లు గింజుకున్నాను. వింటే కదా!

పెద్దల ఎదుట అడిగినా, ఏమోలే అని సర్దుకోవచ్చు. సవతుల ఎదుట అడిగితే, చిన్నబుచ్చుడం కాదూ? ఏమైనా కావాలన్నామా? - ఎంత దురాశ, కొండమీది కోతిని తెమ్మంటూంది. చుక్కలు రాల్చుకు రమ్మంటూంది. పులి పాలు కావాలట పాపం! పిల్లడు పులిలాగ మహాపరాక్రమవంతుడు కావద్దూ! అని బుగ్గలు నొక్కుకోరూ?

మట్టి తిందామని ఉంటుంది. గోడలు గీరుకొని సున్నం తిందామని ఉంటుంది. చింతగింజలు నమలుదామని ఉంటుంది. చింతపండు పుక్కిట పెట్టుకుందామని ఉంటుంది. మామిడి ముట్టెలోని జీడిమీద మనసు పోతుంది. తింటే ఏమవుతుందో, నాకేమైనా సరే. పుట్టబోయే వంశోద్ధారకునికి కడుపులోనే ఏమైనా అయితే? ఇవన్నీ

ఎవరితో చెప్పను? సఖులతో చెబుదామా అంటే, వట్టి ఆకతాయి మూక. క్షణంలో ఊరికి ఊరే వినిపోతుంది.

ఆయనతో చెబితే? ఛ! ఎలా చెప్పనూ? నాకు మట్టితినాలని ఉందండీ - అందామా? ఇదేమి కోరిక! మట్టి తింటావా అన్నమే లేనట్టు? - అని నవ్వరూ! ఇంత చేశారు గదా! దానికంతా మూలకందం ముకుందం తనే కదా! ఒకమారు నోరువిప్పి - వద్దు - పెదవి కదల్చి అడగ్గూడదూ? నీకే కోరికలు? ఏమన్నా కావాలా? ఎక్కడికైనా పోదామని ఉందా? - అని.

పోదాము అంటే జ్ఞాపకం వచ్చింది. సీతమ్మతల్లి అడిగిందట నాకు అడవిలోని ఋష్యాశ్రమాలు చూద్దామని ఉందండీ అని. రాముడు ఇదే సాకుగా తీసుకొని నిండు చూలాలిని అడవికి పంపాడు. అమ్మో! అది తలచుకుంటేనే భయం! అలాంటివి నాకు వద్దు గాక వద్దు! నేను ఎక్కడికో వెళ్లను. నాకు ఋష్యాశ్రమాలు అక్కరలేదు. క్షేత్రాలు అక్కరలేదు.

కన్నులారా ఆయనను చూస్తుంటే చాలు. అదే పదివేలు. అందుకే, సఖులు ఏం కావాలని అడిగినప్పుడల్లా ఆయన వైపే చూస్తున్నాను, ఏమన్నా అనుకోనీ, ఏమన్నా అర్థం చేసుకోనీ, నాకు అంతకన్నా కావలసిన వస్తువు కనిపించడం లేదు మరి!

ఇంతకూ, ఎవరికైనా ఎందుకు చెప్పాలిట నా కోరికలు? పొరుగింటి ఇల్లాలిని చూచి నేర్చుకోవాలి. ఉత్తమ యిల్లాలు. పెద్ద సంసారం. రాబడి అంతంత మాత్రం. ఇంటి సంగతి పూర్తిగా తెలుసు. వేవిళ్ల సంగతి ఇంటి వాళ్లకు చెబితే ఒట్టు. ఏవేవో ఆశలు పుట్టక ఉండవుగా. కాని ఇంట్లో నిప్పచ్చరం. ఏమి కోరినా ప్రయోజనం లేదు ఇంటిల్లిపాదినీ కష్టపెట్టినట్టే అవుతుంది. కోడలి చిన్న ఆశనయినా తీర్చకపోయామే అని కుమిలిపోతారు అందరూ. అందుకని, బంధువులు - దగ్గరివారు ఏమైనా అని పోయినా, మనసులోనే దాచుకున్నట్టు - చెబితే ప్రమాదం, చెప్పకపోతే బాధ - కోరికలన్నిటినీ మనసులోనే పదిలం చేసుకుందిట ఆ ఇల్లాలు. మనకా దరిద్రం బాధ లేదు ఎప్పటికీ. అయినా చెప్పను. హృదయంలోనే దాచుకుంటాను.

మరొక పేద ఇల్లాలి వేవిళ్లను గురించి అమ్మ చెబుతూ ఉండేది. దరిద్రమంటే దరిద్రం కాదు. కటిక దరిద్రం. భర్త ఎంతో ప్రయత్నిస్తున్నాడు ధనసంపాదనకు. కాని ఏదీ కలిసి రావడం లేదు. విధి వక్రించినప్పుడు తోకే పామయి కరిచినట్టు ప్రతిదానికీ అంతరాయమే. ఏమి చేయగలడు? అభిమానధనుడు. యాచన చేయలేదు.

ఈ దుఃస్థితిలో భార్యకు వేవిళ్లు. ఇంటి స్థితి, భర్త దీన హీనస్థితి తెలిసిన దొడ్డ ఇల్లాలు. ఏమని అడుగుతుంది? అడిగిందా, భర్త తీర్చలేడు. బాధపడిపోతాడు. తేనె, నెయ్యి, చక్కర, పళ్లు కావాలని అంటే, ఎక్కడి నుంచి తెస్తాడు?

అయినా భర్త సహృదయుడు. యథాశక్తి ఏమైనా తెద్దాము. చూలాలి కోరికలు తీరుద్దాము - అని అనుకునేవాడే. బీదరికం బెదిరింపులకు భయపడేవాడు కాదు. ప్రేయసీ, ఏం కావాలి? నా వంశం నిలబెట్టే గృహలక్ష్మివి. ఏదయినా కోరుకో. ఒక్క కోరికనైనా తీర్చనివ్వు. దారిద్ర్యం వల్ల పెద్దపెద్ద ఆశలు తీర్చలేననుకో. అయినా, చిన్న కోరిక తీర్చలేనా? నా పరిస్థితిని గ్రహించిన సహృదయురాలివి. గొంతెమ్మ కోరికలు కోరవు గదా! ఊఁ! ఒక్కసారి ఏం కావాలి? అని బుజ్జగించే పతిపై ఒక చూపు విసిరిందట.

కలువల దండ విసరినట్టయి, భర్త తన్మయత్వంతో తబ్బిబ్బయి, తేరుకుని, ఏం కావాలో ఒక్కసారి చెప్పవూ! - అన్నాడట. ఏమడిగినా సరే, తీరుద్దాము. ఒక్కగా నొక్క కోరిక. ఎలాగయినా తీర్చాలి. అదే పట్టుదల అతని మాటల్లో, కళ్లల్లో ప్రతిధ్వనించింది. నిరీక్షించాడు. ఆతురత ఎక్కువవుతూంది. ప్రియురాలి పెదవుల నుంచి ఏ పల్కులు వెలువడుతాయో అని కళ్లప్పగించి చూచాడు. వీనులప్పగించి విన్నాడు.

తీరుస్తారా? అయితే వినండి. ఉదకం-మంచి నీళ్లు - కావాలి. చల్లటి మంచి నీళ్లు. వట్టి వేళ్లు, పచ్చ కర్పూరం, గొజ్జగి రేకులు, మంచు ముక్కలలాంటి తియ్యదోస ముక్కలు, ఏలకులు ఉన్న పానీయం కాదు. కేవలం వట్టి శీతలోదకం ఇవ్వండి చాలు - అన్నదిట. ఎన్నిసార్లు, ఎవరు ఎంతసేపు అడిగినా ఒకే సమాధానం - మంచి నీళ్లు, మంచి నీళ్లు.

ఆ దుర్గతి నాకు లేదు. నా ప్రియుడు ఏది అడిగినా, తెచ్చిపెట్టగలడు. అర్థబలం, అంగబలం ఉన్న వివేకసుందరుడు. అయినా అడగను. అంతే! నా చూపుతోనే గ్రహించుకోవాలి, నాకేమి కావాలో. గ్రహించుకోలేనివాడిని అడగడం జాణతనం కాదు. ఇంతకూ ఎందుకిదంతా? నాకు మాతృత్వాన్ని ప్రసాదించనున్న ఆ మధురమూర్తిని చూస్తూ ఉంటే చాలదూ? వేయి కోరికలు తీరినట్లు!

*(గాథాసప్తశతి 1-15, 3-90, 5-72)*

# ఏడుస్తున్న దుప్పటి

దారిద్ర్యమనేది ఘోరమైన అభిశాపం. దానికి విరుగుడు లేదు. దారిద్ర్యమొక మహావ్యాధి. దానికి చికిత్స చేసే వెజ్జు లేడు. దరిద్రుడు స్వజనమధ్యంలో ఉండడమంటే పంచాగ్ని మధ్యంలో తపస్సే. పూర్వపు పెద్దలెవరో అన్నట్టు దరిద్రుడు అందరికీ చులకనే, అన్నిటికన్నా చులకనే. గాలి కూడ వాణ్ని దూదికన్నా సులువుగా ఎగురవేస్తుంది.

దరిద్రునికి ఎన్ని సద్గుణాలున్నా రాణించవు. అతడు శాంతంగా ఉన్నాడా! గతి లేక శాంతంగా ఉన్నాడు. ఉండకుండా ఏమి చేస్తాడు? అంటారు. న్యాయం చెప్పవచ్చాడు. మింగ మెతుకు లేదు గాని, తీర్పరిగా వచ్చాడయ్యా- అంటారు. బాగా చదువుకున్నాడు అని - అంటామనుకోండి. ఏమిటి ప్రయోజనం? అర్థ కరీచ విద్యా అన్నారు. కూటికిరాని విద్య కోటి అయినా ఎందుకు? - అంటారు. ధనమూలమిదం జగత్. ధనం లేనిదే ఏమీ రాణించదు.

దరిద్రుడు బాధపడని ఋతువుండదు. ప్రతి ఋతువులోను దరిద్రుడు బాధపడుతూనే వుంటాడు. ఎండకాలంలో ఒక బాధ. తలదాచుకొనే చోటు వుండదు. సూర్య చంద్ర తారలు నట్టింట్లోనే నాట్యమాడుతారు. వర్షాకాలంలోనేమో ఉరుస్తున్న పూరిళ్లు, తాటిపాకలూను. బాగా కప్పితే ఉరవదు గదా, మరి మేఘాలు అంతదట్టం కప్పినా, ఆకాశం కప్పు ఎందుకుగా కారుతుందో - అని ఒక దరిద్రుడు ఆశ్చర్యపడ్డాడట. మరొక పేదవానికి మేఘాలపై కోపం వచ్చింది. బాగా అయింది శాస్తి మేఘానికి. గాలి బాగా పెద్దగా కొట్టింది. ఆ దెబ్బకు మేఘం కొండమీది నుంచి దొర్లి పడింది. ఒళ్లు విరిగి ముక్కలయింది. మెరపు అనేది ఏమనుకున్నారూ? మెరపు కాదది. ఒళ్లు ముక్కలై ఛస్తున్న మేఘంలో తుకతుకలాడే ప్రాణం - అని తన అక్కసు వెళ్లబోసుకున్నాడు.

మరొక దరిద్రుడు వర్షాకాలంపై తన కోపాన్ని మరొకవిధంగా తీర్చుకున్నాడు. అది మేఘం కాదండీ, పెద్ద దున్నపోతు! దానిని ఇంద్రుడు వజ్రాయుధంతో -

పిడుగుతో– కొట్టాడు. ఆ దెబ్బకు కడుపులోని పేగులు బైటికి వచ్చి వ్రేలాడుతున్నాయి. అవే మెరపు తీగలు అంటారు. నిజానికి అవి పేగులు – అన్నాడు. పేదవాని కోపం పెదవుల చేటు!

వర్షాకాలంలో ఒక పేద ఇంటి ఇల్లాలు పడిన పాట్లు వింటే, కడుపు తరుక్కుపోతుంది. పతి ఏదో వాణిజ్యం కోసం ప్రవాసం వెళ్లాడు. ఒక గడువుకు వస్తాను అని చెప్పాడు. ఆ గడువును ఆమె గోడమీద గుర్తు వేసుకుంది. ఇంతలో వానకాలం వచ్చింది.

పెనుగాలి వానకు పూరిగుడిసె కప్పు, ఎంత గట్టిగా కప్పినా, అక్కడక్కడ కొట్టుకుపోయింది. వాన ధారలు కట్టి కురుస్తున్నది. గోడలు తడిసిపోతున్నాయి. భర్త చెప్పిన, గోడపై వేసిన గడువు గుర్తు ఎక్కడ తడిసి మాసిపోతుందో అని ఆమె తాపత్రయం. ఆ గుర్తుపై నీళ్లు పడకుండా చేతులు కప్పి వాన కొట్టినంతసేపూ కూచుంది ఆ ఇల్లాలు.

హేమంతంలో బీదలపాట్లు మన శత్రువులకూ వద్దు! ఎముకలు కొరికే చలిలో వారు కప్పుకోడానికి సరైన దుప్పట్లు, కంబళ్లు లేక, సరైన వెచ్చని ఇళ్లు లేక నరకయాతన అనుభవిస్తుంటారు. రాత్రులు పిడకల కుంపటి ముందు కూచుంటారు వెచ్చదనం కోసం. పగలు వారు సమీపిస్తే, పొగ చూరిన, పిడకకంపు కొట్టే గుడ్డలు చూడ ఘోరంగా ఉంటాయి. కొందరి గుడ్డలయితే చినిగిపోయి, బాగున్న చోట నేత చివికిపోయి ఉంటాయి. అలాటి వారి జీవితాలు బాగుపడడం ఎప్పటికి? ఎప్పటికీ కాదేమో! అలా వారు బాధపడవలసిందే!

ఎందుకంటారా? అలాటివారు చాలా అభిమానధనులుగా ఉంటారు. ఎవర్నీ ఏమీ అడగరు. తమలో తామే మథనపడుతుంటారు. ఒక గృహిణి భర్త దరిద్రుడు. కాని, చాలా ఆభిజాత్యాభిమానం గలవాడు. ఆమెకు అంతకన్నా బింకం. కూటికి తక్కువయితే, కులానికి తక్కువా?– అన్న సామెతగా ఉండేది. దగ్గరివారి సహాయం పొందడానిక్కూడ ఇష్టపడేది కాదు. వాళ్లు ఎంత టెక్కూ దీనికి అని అనుకునేవారు. అయితే ఆవిడకేం? వారి సాహాయ్యం కోరేది కాదు గదా? తన భర్త గౌరవాన్ని కూడ నీడలాగా కాపాడేది. దానికి ఎలాటి మచ్చా రానిచ్చేది కాదు. ఇంటికి బంధువులు, తమ వైభవాన్ని చూపడానికి కొందరు వచ్చేవారు. ఇతరుల దరిద్రాన్ని లెక్కించడం

వారి వినోదం. అలాటివారు వస్తే, వారికి సక్రమంగా సకలోపచారాలు జరగాలి. ఇంటి గౌరవం కాపాడుకొనడానికి, ఎలాగో ఒకలాగు కష్టపడి వారికి ఆతిథ్యమివ్వాలి. ఇవ్వకపోతే పదిమందిలో తలవంపులు, ఆక్షేపణలు. ఇస్తే, ఇల్లు గుల్లవుతుంది. తన నగా, నట్రా అంతా అమ్మి, అతిథిసత్కారం చేసింది. మరికొందరేమో వచ్చి, పదిపూటలు ఉండి, సుష్ఠుగా భోజనం చేసి, వెళ్లేటప్పుడు పదిరూకలు ఇవ్వబోయేవారు, పూటకూళ్ల ఇండ్లల్లో చెల్లించినట్టు. అలాంటి వాళ్లంటే, ఆమె మండిపడేది. చిల్లి గవ్వయినా ముట్టుకొనేది కాదు. తమ కులీనత్వం సొబగుకు, సొంపునకు ఎలాటి నలుపూ రానిచ్చేది కాదు. వారి నుంచి ఎట్టి సాహాయ్యం పొందినా తమచేయి కిందే కదా! ఒక్కసారి చేయికిందయిందా, ఇక ఆత్మగౌరవమనేదేముంటుంది? తల కొట్టివేసినట్టు కాలేదూ? ఆ బంధువు ఆత్మీయులే కావచ్చు. నిజంగానే తోడ్పడుదాము, ఏ కొంత కష్టం తగ్గినా తగ్గినట్టే అని సహృదయతతోనే ఆలోచించవచ్చు. ఆత్మీయుల తోడ్పాటులో తప్పేముంది గనుక! అయినా ఆ ఇల్లాలు ఆ విషయంలో తల ఒగ్గేది కాదు. ఆభిజాత్యబలం, ఆత్మాభిమానశక్తి అలాటివి.

ఇలాటిదే మరొక మానధనమైన కుటుంబం. ఇంటికంతా ఉన్నది ఒకే దుప్పటి, వేసవిలో దాని అవసరం అంతగా ఉండదు గాని, వానకాలంలోను, చలి కాలంలోను అది తప్ప మరొకటి గతిలేదు. శీతబాధను తొలగించుకోవాలంటే అందరూ ఒకేచోట పడుకొని దానిని కప్పుకొనేవారు. అంతమందికి అది ఎలా చాలుతుంది? ఒకరు తమ ఒళ్లు కప్పుకోడానికి ఇటు లాగితే, మరొకరు అటు లాగుతారు. మధ్యన ఉండే చిన్నవారు దుప్పటి ఎక్కడ తమకు దక్కకుండా పోతుందో అని కాళ్లతో తంతూనూ, చేతులతో లాగుతూనూ బిగబట్టుకుంటారు. వీరందరి మధ్యన దుప్పటి పిగిలిపోయింది. దానిని మార్చడానికి తగిన రూకలేవీ? కుట్లు, కుట్లు, వందకుట్లు. ఆ కుట్టిన, పిగిలిన, చినిగిన దుప్పటి కిందే ముడుచుకొనేవారు అంతాను. అది నలిగి నలిగి మురికి పట్టింది, కంపు కొడుతూంది.

ఎన్నాళ్లిలా? ఉతకాలి కదా, ఉతికితే మరీ చినిగిపోతుందేమోనని ఇల్లాలి భయం. ఉతకకుండా కంపు పట్టిన దానిని కప్పుకొంటే అనారోగ్యభయం. చివరికి తెగించి ఉదికి ఆరవేసింది, ముంగిటిలోని చెట్టు కొమ్మకు. దాని అంచులనుంచి నీరు టపటపమంటూ కారుతూంది. 'అమ్మయ్యో, ఈ దరిద్రకుటుంబం నన్ను లాగి లాగి

చంపుతూంది. ఇల్లాలేమో ఉతకడమనే నెపంతో వీపును బాదుతుంది. ఇక ఈ లాగుళ్లు, బాదుళ్లు సహించలేను బాబోయ్! నన్ను రక్షించండి! వీరింట్లో ఉండలేనండోయ్! నన్ను రక్షించండి!' అంటూ ఏడ్చేసింది. ఆ ఏడుపే, ఆ కన్నీటి బొట్లే అవి! నీటి చుక్కలు కావు సుమండీ!

ఆ ఏడుపు, ఆ కన్నీళ్లు ఆపగలరా మీరు?

*(గాథాసప్తశతి 1-18)*

# మాలాకారి

అబ్బబ్బ! ఏమి జనం! ఏమి జనం! పెళ్లి పందిట్లోని జనమంతా ఇక్కడే గుమిగూడా రేమిటి? అక్కడ సప్తపది, శపథాలు జరుగుతూంటే, చూడకుండా ఇక్కడ మూగారేమిటి చీమల్లాగ జనం? ముఖ్యంగా నూనూగు మీసాలవారు, నడివయస్సువారు ఇక్కడే ఉన్నారే. తల నరిసినవారూ ఉన్నారండోయ్. ఏమిటి చెప్మా ఇందరిని ఆకర్షించే విశేషం?

తోసుకు తోసుకు వెళ్లుతున్నారు నవయువకులు. వారిని అంతగా ఆకర్షించేది ఏదో అయి ఉంటుంది. తక్కినవారూ ఉన్నారు గనుక అందరికీ ఆహ్లాదకరమైనదే అయి ఉంటుంది. లేకపోతే వివాహమున్నా మానుకొని ఇక్కడెందుకు కుమ్ములాడుతారూంట!

ఏ దొమ్మరాటన్నా అయి ఉంటుందా, చూచినవారు తిరిగి రాక అతుక్కుపోతున్నారు? దొమ్మరిసాని మొగ్గ వేస్తుంటే, దాని సాహసాన్ని చూచేవారు కొందరైతే, దాని తీరయిన అంగాలు చూచేవారు చాలామంది. మొగ్గ వేసినప్పుడు జవజవలాడే నడుము, ఆకసం చూచే రొమ్ములు, బరువంతా మోసిన పక్కలు, చేతులు, వెనక్కు తన్నుకొని వస్తున్న పిరుదులు - దేనిని ముందు చూద్దామా, దేనిని ముందు చూద్దామా అని ప్రతివారూ దొంగ చూపులు విసురుతారు సుమండీ! దొమ్మరి వాయించిన చప్పుడు లేదు, దొమ్మరి డోలు పెద్ద భళాభళీలు లేవు, గడలు, తొడల చరుపులూ లేవు. మరేమిటి వీరిని ఇంతగా ఆకట్టుకుంటున్నట్టిది?

పోనీ, చూచిన పెద్దమనిషి ఎవరైనా తిరిగి వచ్చి, అయ్యా, ఇదీ ఇక్కడ జరుగుతున్న వినోదం, ఇదీ వింత - అంటే, మనమూ వెళ్లవచ్చు. చూడవచ్చు, ఆనందించనూవచ్చు. వెళ్లినవారు మూకలో జొరబడటమే కాని, తిరిగి రావడమే లేదుగా! ఏం జరుగుతున్నదో ఎలా తెలుస్తుంది?

హమ్మయ్య! అటువైపు నుంచి గాలి వీచింది! వివిధకుసుమాల సౌరభాలు కుమ్మరించి పోయింది. ఏదైనా పూవుల ప్రదర్శనమయి ఉంటుందా? ఇంతటి ఉత్కంఠను ఎందుకు చంపుకోవాలి? వెళ్లిచూస్తే పోదూ!...

పూవుల రాసులు కనిపిస్తున్నాయి. పొదిరి పూలూ, మొల్లలూ, విరజాజులు, కడిమి పూలు, పున్నాగాలు, కలువలు, కమలాలు - ఔను ప్రదర్శనంగా కనిపించదే... తప్పుకోండయ్యా, తప్పుకోండి. చూచారుగా, చాలాసేపు, వెళ్లరాదూ, చూడని వారికి తావిచ్చి. ఈ గుంపులోంచి ముందుకు పోవడమే గగనం.

అబ్బో! ఇదా సంగతి. మాలలల్లుతున్న మదవతి అన్నమాట వీరందరి దర్శనీయవస్తువు! మహా చలాకీగా ఉందిలే మాలాకారి. చూడరూ మరి? విరగబడి చూస్తారు. అంతఃపురంలోని అందం వంటిది అప్పనంగా వీథులలో కనిపిస్తే చూడరూ? ఏం సొగసు! ఏం బిరుసు! నాభిమండలం కిందికి చీరకట్టు. అదీ పిక్కలు సగం కనిపించేలా. సన్నని వేళ్లతో సుతారంగా పూవులు ఎత్తి దండ కడుతూంది.

"ఇప్పుడే కోసిన మొగ్గలండీ ఇవి. ఈ దండ చూచారా, ఎంత పొడవుందో? నేను చేయి ఎత్తితే, నేలమీద జీరాడుతుంది" అంటూ చేతులెత్తుతుంది, రెండు చేతులలో రెండు పొడుగాటి దండలు పట్టుకొని. క్షణం సేపు! మెరపు మెరిసినట్టవుతుంది. నవయువకులకు మూర్ఛపోయినంత పని అవుతుంది. అలా పూమాలను చూపుతూనే అందరి మనస్సూ బుట్టలో వేసుకొంటూంది.

వెర్రివాళ్లు! ఆ వేళ్ల కాంతిని, బాహుమూలాల మెరపును, కన్నుల వెలుగును చూచి కళ్లు జిగేలుమనగా, అలాగే ఉండిపోతున్నారు బొమ్మలలాగ.

ఆ యువకుణ్ణి చూడండి. అతనికి పూవులు అక్కరలేదు. ఇటు చూడండి. ఈ ముసలాయనకూ పూవులు అవసరం లేదు. కాని ఊరికే ధర అడుగుతూ తిరుగుతున్నారు. ఎప్పుడెప్పుడు మాలాకారి బుజాలు ఎత్తుతుందా, సుందర బాహుమూలాలు చూద్దామా అనే ఆశే కాని, నిజంగా పూవులు కావలసికాదు.

మాలాకారీ! ఎంతటి నెరజాణవే! ఇంతమందిని పూలదండలు కట్టినట్టు కట్టిపడేస్తున్నావు. పూవును ముసురుకున్న తుమ్మెదలలాగ నీ చుట్టు ముసురుకున్నారు. నీ సోయగం, సొబగు ఆస్వాదించాలని దొంగ బేరాలు ఆడుతూ కాలయాపన చేస్తున్నారు. నీకూ తెలుసు, వాళ్లు దొంగలని, వాళ్లకు పూవులు అక్కరలేదని. ఎందుకు వెళ్లమనవు? బేరం చేస్తే చేయండి, లేకపోతే పోండి అనలేవూ?

ఔను, నీవు అనవు, నిజం. నీవు అనలేవు. నీ అందాన్ని, నీ పరువం పాడు కాకుండా అందలం ఎక్కిస్తున్నప్పుడు, మూగడం నీకు హాయిగా ఉన్నప్పుడు, నీ కీర్తి ఇనుమడిస్తున్నప్పుడు, పూవుల కన్నా నీ విలువ ఎక్కువవుతున్నప్పుడు ఎందుకు అనాలీ అంట!

*(గాథాసప్తశతి 6-96, 98)*

# గాజుల గల గల

ఇక వినలేనండీ ఈ గాజుల గల గల! గాజుల్లో ఏమిటుందో ఇంద్రజాలం! అట్టే పట్టేస్తుంది మనస్సును, బుద్ధినీ, హృదయాన్నీ. మా కొండాపురం గాజులు మరీనూ, ఏ మహానుభావుడు కనిపెట్టాడో గాని, ఈ కాచవలయాలను, ఆడవారికి ఆభరణాలూ, మగవారికి సంకెళ్లూ అయాయి. ఉత్తరాపథమంతా మా కొండాపురం గాజులకు, కుండిన కాచవలయాలంటే మహా మోజట. విరగబడి కొంటారట వనితలు.

ఈ గాజులు మగవాళ్లతోపాటు మగువలనూ బాగా ఏడిపిస్తున్నాయండీ. ప్రవాసానికి పతిదేవులు అటు వెళ్లారో, లేదో, ఇటు ఈ గాజులు పెరగడం ప్రారంభమవుతాయని ఇల్లాళ్లు ఒకటే గోల. విరహానికి చిక్కి శల్యమయిపోతాయి చేతులు. గాజులు వదులయిపోయి పెరిగినట్టు భ్రాంతి కలిగిస్తాయి. మరీ అమాయికలైన గృహిణులు గాజులు ఇలా పెరుగుతాయా అని అమ్మలక్కలను అడగడం, వాళ్లు నవ్వడం - ఇదీ వరస.

ఆ మధ్య పొరుగూరికి వెళ్లాను. ఒక ఇంటి అరుగుమీద కూర్చున్నాను, సేద తీర్చుకుందామని. ఇంట్లో ఒకావిడ మంచంపై పడుకుంది. చుట్టూ కొందరు మూగి ఉన్నారు. ఇదేమి పీడరా, అరుగుపై కూర్చుంటే అంత్యక్రియలు- అని అనుకున్నాను. బతికే ఉందట. భర్త వ్యాపారానికి వెళ్లాడట. ఇల్లాలు విరహంతో వేగిపోయి మంచం పట్టింది. చెలికత్తెలు సమాధాన పెడుతున్నారు. ఆమె ఈ పక్కకు ఆ పక్కకు పొర్లినప్పుడు చేతి గాజుల రవళి సన్నగా వినిపిస్తున్నది. ఆ రవళి తెలుపుతూంది, ఇల్లాలికి ప్రమాదం లేదని, ఊరట కలిగిస్తూంది దగ్గరివారికి. నాకెందుకీ విరహబాధ అని రెండడుగులు వేసి మరొక ఇంటి అరుగు చేరాను.

అక్కడా ఇలాటిదే మరొక దృశ్యం. భర్త చాలా కాలంగా ఇల్లు చేరలేదు. ఆయన క్షేమంగా తిరిగి రావాలని ఇల్లాలు ఏదో వ్రతం చేస్తూ, కాకులకు అన్నం ముద్దలు వేస్తూంది. చిక్కిపోయిన ముంజేతినుంచి గాజులు జారి అన్నం ముద్దపై పడ్డాయి. ఒక్క కాకయినా వచ్చి అన్నం ముడితే ఒట్టు! ఏదో వల పన్నింది పట్టుకోడానికి -

అని, కాకులు దూరంగా వాలి కావు కావు మంటున్నాయి. అత్తగారు మహాకోపిష్ఠురాలు. కాని, ఏం చేస్తుంది! తన కుమారుని కోసమేగా ఇదంతా! ఆవిడ కూడా కోడలితోపాటు కన్నీళ్లు పెట్టుకుంది. ఆవిడ భర్త కూడా కోపిష్ఠుడేనట. రాత్రులు గాజులు పగులగొట్టే వాడట. తెల్లవారగానే, ఆ వర్తమానం ఊరంతా కతలుకతలుగా, కొందరికి వెతలు వెతలుగా పాకిపోయేదట.

మరొక ముద్దరాలి సంగతి మరీ ముచ్చటయింది. కొత్తకాపురం. లంకంత ఇల్లు. ఎవరిపని వారిది. భర్త రాచకార్యం కోసం నగరానికి వెళ్లాడు. వియోగం తప్పదు. పాపం! ఆ ముద్దరాలికి కళ్లు మూసినా భర్తే. నిద్ర పోతున్నా, కలలోనూ భర్తే. స్వప్నంలో కనిపించాడేమో! సుతారంగా చేతులెత్తి కౌగిలించుకొంది. ఎవరిని? ఎవరున్నారు గాలి తప్ప? తననే కౌగిలించుకుంది. గాజులు వదులయిపోయి పక్కకు ఇరుపక్కలా పడ్డాయి గల గల మంటూ.

ఇదండీ పతాకస్థాయి పొందిన నాటకం! చుట్టుపక్కల ఎవరైనా ఉన్నారా? ఉంటే ఇదేమిటయ్యా నీకు పోయే కాలం? వాళ్ల దొడ్లో జరుగుతున్న సంగతి నీకెందుకు? భలే పెద్దమనిషివే! అని నిలదీయరూ? బతికి పోయాం. ఎవరూ లేరు. పొంచి చూడడం, తొంగి చూడడం సజ్జనుల పని కాదు. కాని, ఏం చేయను? మానవసహజమైన కుతూహలం. వద్దు. పొరుగూరు, ఏమైనా శృంగభంగం అయితే మన ఊరికంతా చెడ్డ పేరు.

అదుగో! ఎవరో వస్తున్నారు. ఈ ఇంటి అల్లుడేనట. అరుగుపై కూర్చున్నాడు నాతోపాటు. బతికిపోయాను. నా కుతూహలాన్ని ఇతగాడు గమనించి ఉంటే, కొంపలు కూలేవి సుమా! 'ఏమిటి, అల్లుడుగారూ, ఇంత పొద్దుపోయి వచ్చారు! ముందు గదిలో కూర్చోండి' – మరదలు పిల్ల స్వాగతం. 'ఎందుకు అలా దిక్కులు చూస్తారు, మిరియాలు మింగిన కోతిలా? అక్కయ్య కనిపించలేదనేగా. దొడ్లో స్నానం చేస్తూందండోయ్! విశ్రాంతి తీసుకోండి' – మరదలు హాస్యం.

ఆ స్నానం చేస్తున్న కూతురు కడుపు బంగారం గానూ! ఎంతసేపని నీళ్లు పోసుకుంటుందో? చేతులూ, కాళ్లూ నెమ్మదిగా తోముకుంటూంది కాబోలు – ఒకే గాజుల రొద. ఇతగాడు వేళగానివేళ వస్తాడని కలగనిందా? పుట్టినిల్లు. పనీపాటూ లేదు. తీరిగ్గా లేచింది. ప్రాతరశనం ముగించే వేళకు అపరాహ్ణమయింది. ఒళ్లు శుభ్రంగా తోముకోవద్దూ!

ఆ గాజుల రొదకు ఇంతవాణ్ని నాకే మనసు చెదరిపోతూందే, ఇక అల్లుడు కొత్తగా పెళ్లయింది కాబోలు, మనస్సు అల్లల్లాడిపోదూ? క్షణక్షణానికీ రంగులు మారుతున్నాయి అల్లుడి ముఖంలో. కళ్లు మూతలు పడుతున్నాయి. స్నానం చేస్తున్న భార్య రూపం – అంగాంగాలూ ప్రత్యక్షమౌతున్నాయేమో! ఉండలేకపోతున్నాడు. ఊగిసలాడిపోతున్నాడు. కళ్లెర్ర చేస్తున్నాడు. లేచి లోపలికి పోబోతున్నాడు! అంతలోనే తమాయించుకొని కూర్చుంటున్నాడు. ఏదో దయ్యం పట్టినట్టు మెడ అటూ ఇటూ తిప్పుతున్నాడు. చెవులు మూసుకుంటున్నాడు, పళ్లు కొరుక్కుంటున్నాడు. తన కోపం, విసుగూ ఎవరైనా పట్టేస్తారేమోనని అంతలోనే నవ్వుకుంటున్నాడు. గాజుల రవళి ఎక్కువవుతూంది.

ఆ కొంటె మరదలు పిల్ల పోయి బావగారి వార్త అందించిందేమో! మరీ జాగు చేస్తూంది అమ్మాయి. బాగానే ఏడిపిస్తూంది. అల్లుడూ, ఎందుకోయ్ అంత ఆరాటం! కొంచెం ఆగలేవూ? పగలంతా నీళ్లు పోసుకుంటూ గడపదు గదా! ఓపిక పట్టు. ఇంతగా ఆత్రం చూపావా, వెకిలితనం అంటారు. పేర్లు పెట్టడానికి మరదలు ఉండనే ఉంది.

దీనికంతా కారణం గాజుల గలగల అంటావా? ఔను. అవి మన కొండాపురం గాజులు. వాటి తీరే అంత. అవి మహర్షుల మనస్సులను కూడ మాయలో పడేస్తాయి.

*(గాథాసప్తశతి 7–53)*

## మరది ఆగడం

ఊరుకున్న కొద్దీ మరీ మితిమీరిపోతున్నది మరది ఆగడం. ఏం చేయను? సమష్టి కుటుంబం. పెద్దలకు చెబుదామా, కుటుంబం కూలిపోతుంది. నిప్పు లేకుంటే పొగ పైకెగురుతుందా? ఏదో ఉంటుంది. ఇప్పటికి పొక్కింది- అని లోకులు పలుగాకులు కూస్తారు. ఆయన చెవిలో వేద్దామా, తమ్ముడంటే వల్లమాలిన వాత్సల్యం. నా మాటలు చెవికి ఎక్కవు. తను, తన భార్య ఎన్ని శృంగారలీలలు చేసినా కాదన్నామా? కాని, వాటికీ ఎల్లలున్నాయి కదా!

తోడికోడలు అమాయిక. ఏది గుట్టు, ఏది రట్టు అనేది పూర్తిగా తెలీని-గోల. రహస్యంగా పడకటింట్లో ఏమి గొడవలు పడతారో, ఎవరు చూడవచ్చారు? వేయి ఉంటాయి. ఎవరు కిందున్నా, ఎవరు మీదున్నా వాళ్ల సంగతి కాని, ఆలాటివి పడకటిల్లు దాటి బయటికి పొక్కరాదు గదా! ఆ మాటలన్నిటినీ ఏకరువు పెడుతుందనే చిలుకను కూడ పడకటింట్లో పెట్టుకోవద్దన్నాను తోడికోడలితో. 'ఎందుకు?' అన్నది. 'ఎందుకేమిటి? మీ రాత్రి రహస్యాలన్నీ తెల్లవారగానే ఇంటిల్లిపాదికీ వార్తాహరునిలాగ వినిపిస్తూంటేను' అన్నాను. 'సరే, అక్కా'- అంటూ తల వంచుకొంది.

ఆ నాడు విదియో, తదియో. శరదృతువు కాబోలు, నింగి నిర్మలంగా ఉంది. పడమటివైపు నెలవంక కనిపించింది. మరది, సతీసమేతంగా మల్లె పందిరి కింద నిలబడి నెలవంకవైపు చూస్తున్నాడు. భార్యామణి కూడ పైట జారిపోతున్నదని కూడ చూచుకోకుండా రెండు చేతులూ ఎత్తి వయ్యారంగా సిగ వెనుక ఆనించి, ముఖం ఐమూలగా పెట్టి నెలవంకను చూస్తూంది. బాహుమూలాల మీద, వక్షోజాల మీద వున్న నఖక్షతాలు కొట్టవచ్చినట్టు కనిపించాయి. ఒక క్షణం అటు చూచాను. ఎంత సిగ్గుచేటు! పెద్దల కంటబడితే ఇక ఏమన్నానా? ఒళ్లు మండిపోయింది. మరొకరయితే ఏమి చేసేదాన్నో. 'మరదిగారూ, ఏమిటిది? ఆకాశంలో ఏం చూస్తున్నారు? మీ ప్రియతమ బాహుమూలాలలో ఎన్ని నెలవంకలున్నాయో చూచుకోండి-' అన్నాను, విసురుగా.

తాము ఏకాంతమనుకున్న ప్రాంతానికి నేను ఎలా వచ్చానని, ఉలికిపడ్డారు ఇద్దరూ. తోడికోడలు చప్పున పైట భుజం నిండా కప్పుకుంది. మరది తల వంచుకొని వెళ్లిపోయాడు. కాని, కంట్లో కొద్దిగా ఎర్రటి జీర కనిపించింది. పూర్తిగా సొంత విషయం కదా. కోపం రావడం సహజం. ఏమైనా కల్పించి చాడీలు చెబితే, ఏమవుతుందోనని నేనూ కొంచెం బెరుకుపడ్డాను. నా అంతరాత్మకు తెలుసు నా సంగతి. భయమెందుకు – అని కుదురుపడ్డాను.

ఒకనాడు మరది ఇంట్లో అడుగుపెట్టాడు, ఎక్కడినుంచో వచ్చి. పాద్రిపూవుల పరిమళం గుప్పుమంది. ఊళ్లో పాద్రిచెట్టు ఒక్క గ్రామణి (గ్రామాధికారి) ఇంట్లో తప్ప మరెక్కడా లేదు. గ్రామణిగారింట్లో ఎవరితోనన్నా ఈయనకు సంపర్కం ఉందా? లేకపోతే ఈ పాద్రి పూవులు జుట్టులో, చెవుల్లో, పాద్రి దండలు చేతులకూ, మెడలోనూ ఏమిటి? ఊరికి ఊరే కూడై కూయదూ? మాంసం తింటున్నాము కదా అని పేగులు మెళ్లో వేసుకుంటారా? ఈ సంగతే అత్తయ్యతో చెప్పాను. 'అత్తయ్యా, ఇది బాగా లేదు సుమండీ! మరదిగారి ప్రవర్తన ఏమీ బాగుండలేదు. పెద్దవాళ్ల ఇంటితో గొడవ. ఏమి ప్రమాదమో!–' అన్నాను. ఆవిడ ఏమంటుంది పాపం! ఇంత మాత్రం ఆవిడ చెవిలో వేయడం కూడ తప్పే! మామయ్యగారికి, తాతయ్యగారికి తెలిస్తే, ఏమవునో! పెదవి దాటితే పృథివి దాటుతుందంటారు, నిజం. నేను పెదవి గదపకుండా ఉండవలసింది అనుకున్నాను.

అత్తయ్యగారు నా మాట చేరవేసింది కాబోలు! మరది కొంచెం కోపంగానే ఉన్నాడు. ఇటీవల కొంచెం మర్యాదకు భంగకరంగానే ప్రవర్తిస్తున్నాడేమోనని సంశయంగా ఉంది. ఒకనాడు ఒంటరిగా ఉన్న నన్ను నిలవేశాడు. ఎంత చిన్ననాటి నుంచీ చూస్తున్నా, ఎంత తమ్ముడిలాగ ఆదరిస్తున్నా, ఏదో హఠాత్తుగా అఘాయిత్యం చేస్తే ఎలా రక్షించుకోగలను? నన్ను అవమానించదలచుకొన్నాడో, పరీక్షించ దలచుకొన్నాడో, మరొక వదినె మరదుల సరసం తెలిపాడు. ఆ వదినేమో మరదిని మరిగిందట. మరదికి కొంత కాలానికి విసుగు పుట్టిందట. వదినె మరది ఇంటికి వస్తే, అంతవరకు తోక ఆడిస్తూ వెంట తిరిగే కుక్క ఆవిడ వైపు చూడనైనా చూడలేదట. అప్పుడు వదినె కోపంతో అన్యాపదేశంగా 'మరదీ, మరదీ, తోక అల్లాడిస్తూ కుంయి కుంయి మంటూ వెంట తిరిగే కుక్కకు పని తీరగానే పెడ ముఖం పెట్టే విద్యను ఎవరు నేర్పేరయ్యా?' అందిట. నీవే నేర్పావని అనడమే కదూ!– ఇదీ ముచ్చట.

విన్నాను శాంతంగా. ఏమంటే, ఏం వచ్చి పడుతుందో! తన సంగతులలో జోక్యం కలిగించుకొన్నాననే తప్ప, మరో దుర్బుద్ధి ఉండదు. నేనే పొరబడ్డానేమో! అయినా ఆడది అరటాకు. ముల్లు వచ్చి పడ్డా, ముల్లు మీద ఆకే పడ్డా ఆకుకే హాని. కనుక కళ్లు విప్పార్చి చూచాను. అతని కళ్లల్లో భయం కనిపించింది. ఈ వేడి మీదే దెబ్బ పడాలి. నోరు విప్పి ఉపదేశాలూ, ఉపన్యాసాలు చేయడానికి అదను కాదు. కనుక వసారాలోకి రమ్మని సైగ చేశాను. వచ్చాడు వినయంగా. వసారా గోడలపై రామకథ చిత్రించి వుంది. రాముని వెంట వెళ్లుతున్న లక్ష్మణుని చూపించాను. లక్ష్మణుడు రాముని వెంట అరణ్యవాసానికి వెళ్లింది మొదలు అయోధ్య చేరే వరకు ఉన్న కథాచిత్రాలను పగలెల్లా చూపాను. అంతకన్నా ఏం చెయ్యనూ?

అయినా, నా మానాన నేనుండక, ఎవరైనా మనపై అభాండాలు మోపకుండా జాగ్రత్తపడక, ఇతరుల ఊసెందుకూ? సమష్టి కుటుంబంలో ఎవరితో, ఎంతవరకు, ఎలా మెలగాలో తెలుసుకొంటే చాలదూ?

*(గాథాసప్తశతి 1-35, 5-69, 6-70, 7-88)*

# చేను కాపరి చిన్నది

**ఓ** కలమగోపీ – చేను కాపరి చిన్నదానా, వడిసెలను ఎంత అందంగా తిప్పుతున్నావో! వడిసెలతో నీవు కొట్టడం పిట్టలనుకాదుసుమా, నా బోటి వలపు పిట్టలను! ఇంతకూ నీవు పిట్టలను కొట్టడమేమిటి, నీ శరీరమంతా పిట్టలే కదా. సెలయేరులాగా జాలువారుతున్న నీ కేశపాశంలో నెమలి పురి ఉంది. నీ కళ్లల్లో కాటుక పిట్టలున్నాయి. నీ గొంతులో కోయిలలున్నాయి. పులి జూదం పలకలాగ ఉన్న నీ వీపులో రెక్కలు విచ్చుకొన్న గరుడుడున్నాడు. నడకలో హంసలున్నాయి. పిక్కల్లో పావురాలున్నాయి. పాదాలలో లకుముకులున్నాయి. అరే! ముఖ్యమైనదే మరిచాను. రొమ్ముల్లో చక్రవాకాలున్నాయి. మధ్యలో వానకోయిల పిల్ల ఉంది... మరి ఇన్ని పిట్టలు నీలోనే ఉన్నప్పుడు నీ జాతివైన పిట్టలు నీ వద్దకు రావూ?

మరి నీ వడిసెల విసిరే వయ్యారాన్ని భరతముని చూడలేదేమో! అదొక నాట్యభేదం అనేవాడు. దానికి నిన్నే ఉదాహరణ సుందరిగా పేర్కొనేవాడు. ఆ నాడు విష్ణుచక్రాన్ని తిప్పాడంటారు గాని, చూచిన వాళ్లెవరు? నీవు వడిసెల తిప్పుతూ వైష్ణవీశక్తి వయ్యావు. రసికుల ప్రాణాలు లాగుతావు గనుక కొందరు కానివారు నిన్ను మృత్యువని, నీ వడిసెల మృత్యుపాశమని అంటారు కాని, నేను ససేమిరా నమ్మను, మన్మథుని ఆరో బాణమంటాను.

ఆ మధ్య ఒకమారు పొరుగూరికి వెళ్లుతున్నాను. దారి నడుమ వరిచేలు ఏపుగా పండాయి, కంకులు తల వాల్చాయి. కోతకు సిద్ధంగా ఉన్నాయి, కలమగోపికి పని ఇలాంటి సమయలోనే కదా ఎక్కువ వడిసెలలు! విసురుతూ ఉంది. విధవిధాల పక్షులు ఎగురుతూ ఇంద్రధనుస్సుల అందాన్నిస్తున్నాయి ఆకాశానికి. గొంతెత్తి పాడేస్తూంది కలమగోపి. పాటకు తగినట్టు వసంతకాలం. పైరగాలికి తుమ్మెదలు జుమ్మంటూ శ్రుతివేస్తున్నాయి. పాటనిండా విరహవేదనే. ఎంత మనోహరంగా ఉందో! కాని వినలేకపోయాను. ఇల్లాలి చూపులు జ్ఞాపకం వచ్చాయి. ఉండలేకపోయాను. వెంటనే తిరుగు ప్రయాణం కట్టాను.

మరొక కలమగోపి సంగతి గుర్తుకు వచ్చింది. చేనులో ఒక స్థలం సంకేత స్థలంగా పెట్టుకుంది. పంట కాలువలకు నీరు పారిస్తూ, ఒక కాలువ నుండి మరొక కాలువకు నీరు మళ్లించడానికి కాళ్లు అడ్డంగా పెట్టింది. పాదాలు అడ్డం కాగానే నీరు పక్కకు పొర్లి మరొక కాలువలోకి మళ్లాయి. ఆ పాదాలు అడ్డం పెట్టినచోట బురదలో అడుగుల జాడలు పడ్డాయి. అదేనన్నమాట సంకేతం. అడుగుల జాడలున్న చోట మరుసటి సాయంకాలం సూర్యాస్తమయం తర్వాత కలుసుకోమని ప్రియునికి వార్త.

తానొకటి తలిస్తే, దైవమొకటి తలచిందన్నట్టు కలమగోపి పన్నాగమంతా దండగయింది. మరుసటి ఉదయం చేను యజమాని కలుపు తీయడం కోసం చేనంతా దున్నివేశాడు. సంకేతస్థలం చెరిగిపోయింది. ప్రియుడు వచ్చాడు. చేనంతా గాలించాడు. ఎక్కడ ఉండమని ప్రియురాలు చెప్పిందో గుర్తుపట్టలేకపోయాడు. తిరిగాడు, తిరిగాడు, తిరిగాడు పాపం! నిరాశతో వెళ్లిపోయాడు. కలమగోపి చూస్తూ ఏమీ చేయలేకపోయింది.

ఇంకొక కలమగోపి ముచ్చట మరీ విషాదకరం. వరిచేలు పంటకు వచ్చాయి. కోతలు కావాలి. కంకులు తెల్లబడుతున్నాయి. నీరు తీసి గట్టిపడుతూన్నాయి. అదేమిటి? పని తగ్గిపోయింది, కొంతకాలం కావలి పని తగ్గింది కదా, హాయిగా ఉండవచ్చు గదా కలమగోపి! మరి ఎందుకు చిక్కిపోతూంది, ఎండిపోతూంది చేనుతో పాటు? ముఖమూ పాలిపోతున్నదెందుకూ?

మర్మజ్ఞులకు తెలియందేముంటుంది? ఇంతకాలం చేయెత్తు పెరిగిన వరిచేలో ఏమి చేసినా సాగిపోయేది. దారిని పోయే పాంథులకు ఈవిడ కల్పవల్లి. కోరిన కోరికలు తీర్చేది. తనకు ఇష్టమయిన వారిని తరచు అనుగ్రహించేది. అదట ఇదట అని అందరూ అపవాదులు వ్యాపింపజేసేవారే కాని, వచ్చి, చూచి, పట్టుకున్నవారు ఏరీ? ఇంతకూ అలా పట్టుకొనడానికైనా ఎవరు వస్తారు గనక? ఎవరు ఎలా ఏడిస్తే మనకేమిటి? మనం న్యాయంగా ఉంటే పోలా? ఎవరి పాపాన వారే పోతారు - అనేదేగా మనందరి ప్రవృత్తి! ఈ పద్ధతే మంచిదేమోననీ అనిపిస్తుంది, ఆలోచించగా. ఎవరికివారు సన్మార్గంలో ప్రవర్తిస్తే కొంత కాలానికైనా అన్యాయం కొంత తగ్గుతుందనుకుంటాను.

కనుక కలమగోపి ఎన్ని కామతంత్రాలు సాగించినా ఎవరు పట్టించుకుంటారు? అలాటి వాటికి ఇష్టపడేవారు సమాజంలో కొందరేగా! సత్పురుషులను కలమ గోపికల్లాంటివారు ఎలాగూ చెనకలేరు. కనుక సంఘానికి వచ్చే బాధ ఏమిటి? ఏదో,

ఎప్పుడూ, అడవుల్లో చలికీ, వానకూ, ఎండకు తట్టుకొని నిలిచి, ఆ ఇంత ధాన్యం పిట్టలపాలు కాకుండా కాపాడుతూ తిండి పెడుతున్న కలమగోపి - ఎలాటి వినోదమూ, విలాసమూ జీవితంలో ఎరుగని కలమగోపి - దొంగచాటున ఏదో కొంత సుఖపడితే మనకు వచ్చిన నష్టమేమిటి? పోనిద్దురూ!

ఏమైనా, కలమగోపి కోకిల గొంతు చక్కగా పాడుతుంది. పథికులకు ప్రియురాళ్ల మధురస్మృతులు కలిగిస్తుంది. చూపుల తూపులతో, వంపుల వయ్యారాలతో, ఆనందం కలిగిస్తుంది. ఇంత చాలు మనకు.

*(గాథాసప్తశతి 2-28; 7-90; 91)*

# వ్యాధసుందరి

**అ**బ్బబ్బ! ఎప్పుడూ వేట! వేట! ఏం వేటో! ఏం ఎడబాటో! ఆయనను తలచుకొని కళ్లు మూసుకుంటే ఒళ్లు పులకరించి పున్నాగపు కొమ్మే అవుతుంది. ఏ దిక్కు చూచినా దిక్పాలకులు నిలబడ్డట్టు అతని రూపే కనబడుతుంది.

ఆ నాటి ముచ్చట ఇంకా మరచిపోలేను. వ్యాధవనితలం (బోయతలం) కొందరం పళ్లకోసం దూరంగా ఉన్న అడవికి వెళ్లాం. మా దురదృష్టం! దొంగలు మమ్మల్ని చుట్టుముట్టి పట్టుకొని బందీలు చేసి లాక్కుపోతున్నారు. ఇంతలో పిడుగుపాటుగా ఎవరిదో అల్లె తాటి గర్జన వినిపించింది. 'ఎవరో మహావీరుడు వస్తున్నాడు. భయం లేదు' అని తోటి బందీలకు కూడా ధైర్యం చెప్పాను. కాని, ఆ ధ్వని ఏదో అకాలజలద గర్జితమని ఆ బందీలు నన్ను వెక్కిరించారు.

ఇంతలో ఎలా వచ్చాడో వచ్చాడు – అప్పుడే గిల్లిన మామిడి పూగుత్తి వెంటబడే కొదమ తుమ్మెదలాగ వచ్చాడు. ఆయన వచ్చాడో లేదో, దొంగలు కాలికి బుద్ధి చెప్పారు.

'ఇక వెళ్లండి. ఎందుకు జాగు? ఎందుకీ మందగమనం?' అన్నాడు. గంభీరంగా తన జట్టును విడిపించిన యూథపతి (నాయకగజం) లాగ చూచాడు. నా పెదవులపై తీగ నవ్వు చంద్రరేఖలా సాగింది. మా పల్లె వైపు కదిలాం.

ఆకసంలో సైంధవలవణ పర్వతాలలాగ, దూదిపింజల పుంజాలలాగ శరత్కాల మేఘాలు పరుగెత్తుతున్నాయి. వాన వల్ల తడిసిన దారిపైకి కొంచెం ఆరి, లోపల కొంచెం మెత్తగా ఉంటూ, అడుగులు వేస్తూంటే, పాము బుస కొడుతున్నట్టు ఉంది. నా చూపంతా పడగెత్తిన పాములాగ ఠీవిగా వెళ్లుతున్న ఆతనినే వెన్నాడుతూంది.

సింగంలాగ మెడతిప్పి నా వైపు చూచాడు. గుండె కువకువ మన్నది. రేగు రెమ్మ తెంపి అందించాడు. చెవిలో చెక్కుకున్నాను. అంబుల పొదికి ఉన్న నెమలిపింఛం అందించాడు. కొప్పులో తురుముకొన్నాను. వెంట ఉన్న వ్యాధవనితలు నా వైపు చూచి, నా మయూరపింఛ కిరీటాన్ని చూచి బుగ్గలు నొక్కుకున్నారు. ఎంతో

మురిసిపోయాను. ఇంతలో పల్లె, ఇల్లు సమీపించాయి. చిరునవ్వుతో వీడ్కోలు పుచ్చుకొన్నాడు.

ఇంట్లో అడుగుపెట్టాను. పిచ్చెత్తినట్లయింది. శేఫాలికాపుష్పాల దిమ్మ తిరిగే వాసన. పిచ్చి బాగా ముదిరింది. అతణ్ణి మాత్రం ఊరికే ఉండనిస్తాయా ఆ నాటి సంఘటనలు? నా అంత బాధా పడి ఉంటాడు...

నా మనోరథం నెరవేరింది. ఆయన పల్లెకు కాపురం వచ్చాను. కొండమీది పల్లె ఎంత అందంగా ఉందో? చుట్టూ దట్టమైన నీడల చెట్లు, గాలికి వంగి రాచుకొని కీచుమనే వెదురు వనాలు, ఒళ్లంతా పూచిన కడిమి పొదలూ, కొంతదూరంలో కడిగి తుడిచినట్లున్న కొండల బండలూ, హోరున పారే సెలయేళ్లూ, వాటి సరసన నాట్యమాడే నెమళ్లూ... ఎంత అదృష్టం ఆ ఊరివారిది!

అత్తయ్య సవరి ఎంత మంచివారో? కన్నతల్లి మనసు. 'గోదావరి గట్లకు వెళ్లకమ్మా- పాడు గట్లు. శీలాన్ని కూల్చుతాయి' అని హెచ్చరించారు కాపురానికి వచ్చిన కొత్తల్లో. 'మంచి, చెడు, సుఖం, దుఃఖం తెలుసుకొని నడిచేవారే ఆడవారు, అలా కాని వారు మగవారి పాలిట ముదిమి వంటి వారు సుమా!' అంటూ హితవు చెప్పారు. తక్కిన పనులన్నీ మాని, నన్ను, తన కొడుకు జీవితాన్ని పొడిగించే సంజీవనౌషధి లాగా కాపాడుతున్నారు అత్తయ్య.

'అమ్మాయీ, మనం వ్యాధులం గనక మనకు ముత్యాల విలువ తెలియదని, వాటిని వదలి గురువిందలు గొప్పవనుకుంటామని జనం అంటారు. నీవు అలా చేయకు. ముత్యాల హారాలు వేసుకో. యమునానది తరంగాలపై నురగలు కదలాడినట్టు ఉంటుంది' అన్నారు నా పొగరెక్కిన రొమ్ములు చూపిస్తూ, తల వంచుకున్నాను.

ఒకమారు మొక్కలు నాటడానికి ఎర్ర మట్టి తవ్వాను. నాటిన పిమ్మట చేతులు కడుక్కుంటున్నాను. 'ఎందుకమ్మాయి, అంతగా కడుగుతావు? ఏమి పిచ్చి నీది? పగడాల తీగల వంటి నీ వేళ్ల రంగు గదమ్మా అది?' అన్నారు మెప్పుగా. నవ్వుకున్నాను.

ఒక హేమంతకాలంలో చలిగాలికి పెదవులు పగిలాయి. ఉస్సురుస్సు రనుకుంటున్నాను. 'లేలేత వేళ్లతో తేనె మైనం పట్టించమ్మాయి. పెదవులను జాగ్రత్తగా పెట్టుకోవాలి. అవి ప్రియతమునికి ఆహ్వానపత్రికలు' అన్నారు. పెదవులు రెండు చేతులతోను కప్పుకొని పక్కకు వెళ్లాను.

ఇంకొకమారు మరీ ఇదయింది. గాలికి స్తనాంశుకం పైకి ఎగిరింది. మెడమీది పంటి నొక్కులు కనిపించాయేమో! 'పంటి నొక్కులంటే మదనుని నిధుల మూటలు

మరి! ఇలాటివి దాచుకోవాలమ్మా. ఇతరుల కంట బడరాదు' అన్నారు ముసిముసి నవ్వులు నవ్వుతూ. సిగ్గుతో తబ్బిబ్బయి పరుగెత్తాను లోపలికి.

ఆయనయితే మరువం మొలక. సర్వాంగసురభి. కోరి వచ్చినదాన్ని కోరి తెచ్చుకొన్నవాడు. అయినా ఎందుకో, ఏమో, ఏవో జరిగిపోతూంటాయి, అలకలు, కులుకులు, పలుకులు, ఎందుకు అలుగుతానో నాకే తెలియదు. ఇంట్లో దేనికి కొరత? వాడ నిండా వెదురు బియ్యం, గాజు కుప్పెల నిండా కమ్మని జుంటి తేనె, చిలక కొయ్యల నిండా ముత్యాల సరాలు. బుట్టల నిండా ఆరమగ్గిన పళ్లు. పెరడు నిండా రంగు రంగుల వాసన పూవులు. అయినా, ఎందుకో అలకలు?

ఒక వసంత కాలారంభం మాట, మామిడిరెమ్మ మోసులెత్తగానే, రాజద్రోహం సంగతి చెప్పుకుంటున్నట్టు అందరూ గుసగుసలు పోతున్నారు. మామిడి చిగుళ్లు కామదేవుని రక్తసిక్త హస్తభల్లాలలాగ కనిపిస్తున్నాయి. మరికొన్నాళ్లకు మామిడి చెట్లు పూచాయి. మామిడి పూతను చిలుకలు ముక్కులతో చిదిమి తింటున్నాయి. చిందిన మామిడిపూత రసంతో వాటి దేహాలు తడిశాయి. రసం వాసనకు తుమ్మెదలు ఝుమ్మని మూగాయి.

ఒకచోట ఏకాంతంగా ఒక మధుకరం మాలతీకలికపై వ్రాలి, కాళ్లతో నొక్కిపట్టి, మకరందపానం చేస్తున్నది. రెక్కలల్లార్చుతున్నది. మాలతీకలిక మధుకరం ధాటికి తట్టుకోలేక వంగి వాలిపోతున్నది.

ఇంతలో పెదవిపై కాటుతో ఆయన కనిపించాడు. తేనెతెట్టె పిండుతుంటే, తేనెటీగ కుట్టిందట పాపం! ఆయనను తప్పుకొని మరొకచెట్టు నీడకు వెళ్లాను. 'భ్రమరమా, మకరందం తొణికిసలాడే తామర పూవును వదలి, వాసనకు మోసపోయి వెలగ పండు వెంటపడ్డావా? బొమ్మలోని లడ్డుకు ఆశ పడడం ఉచితమా?' అని దెప్పి పొడిచాను. ఎంత భ్రమపడ్డాను! భ్రమ అనేది కళ్లకు పొరలు కప్పుతుంది. అపోహలకు దారి తీస్తుంది.

పడమటి దిక్కు ఎర్రబడుతూంది. ఆకాశం అంటే వెదురు వనాల వల్ల ఎప్పుడు పొద్దు మునిగేదీ తెలీదు, పొద్దుపొడిచేదీ తెలీదు. అలసి సొలసి వస్తాడు పాపం! భుజాన పెద్ద విల్లు, అంబుల పొదితో నెమ్మదిగా అంగలు వేస్తూ వస్తాడు. వాకిట్లో వేచి చూస్తాను.

*(గాథాసప్తశతి 4-96, 6-12, 7-69)*

# సవర సత్తి స్వగతం

అమ్మకు ఎంత అభిమానం? ఎవరో చుక్కల ఇఱ్ఱి చర్మాల కోసం వచ్చారట. 'మా వాడు జింకలపై విల్లు వంచేవాడు కాదు. పక్కింటి పొరుగింటి సవరకుఱ్ఱవాళ్లను అడగండయ్యా - కావలసినన్ని ఇఱ్ఱి చర్మాలు దొరుకుతాయి' అని పంపివేసిందట.

ఆమెకేమో నేను వీరగయింద నాయకుని వీరపుత్రుడనిపించుకోవాలనే తహతహ. నిజమేనేమో? ఏనుగును వేటాడలేకపోతున్నాను. మా నాన్న మదగయింద నాయకునికి భయపడినట్టు ఏనుగులు నాకెందుకు భయపడుతాయి? దీనికి కారణం ప్రేమ.

ప్రేమ విషం లాగ విషమమవుతుందంటారు. నిజమేనేమో? ఆ విషం నా ఒళ్లంతా పాకి నాకు మత్తెక్కించింది. నీరసింపజేసింది. ఏనుగు తలలోని ఆణిముత్యాల దండల వంటివేమీ లేక బోసి మెడతో, సిగలో నెమలికన్ను తురుముకొని గర్వంగా తలయెత్తి నిలుచున్న ఆ బందీని ఏ గడియలో చూచానో, ఈ విషం ఒళ్లంతా వ్యాపించింది, దిగడమే లేదు. ఇప్పుడు ఎవరు ఏమంటే ఏమి ప్రయోజనం?

మదనాగ్ని ధూమంలాగ, మన్మథుడనే గారడీవాని చేతి మంత్రాల మోహనపింఛం (నెమలి పురి) లాగ, యౌవన విజయపతాకంలాగ వుంటూ, వాసనలు వెదజల్లే ఆమె తలకట్టూ, మధూక కుసుమమాల వంటి కపోలాలు, ఆ కపోలాల లావణ్యాన్ని వంగి తాగుతున్నట్టున్న కర్ణావతంసాలు, మన్మథుని నిధుల వంటి పాలిండ్లు, సోగలు తీరిన సొగసు కళ్లూ...

కళ్లంటే జ్ఞాపకం వచ్చింది. ఆ నాడు జింకల జంటపై విల్లెక్కుపెట్టాను. పెంటి జింకపోతు జింకను ఆశతో చూచింది, నా చేతిలోని విల్లు జారిపడింది మరొకమారు; అడవికి నిప్పంటుకుంది. అడవంతా ఎఱ్ఱబారింది, మంటల వెలుగుకు అక్కడి జింకలు మోదుగలు పూచాయనుకున్నాయేమో! అక్కడి నుంచి కదలలేదు. ఎంత అమాయికత్వం!

ఇంకొకమారు: నా బాణం పెంటి జింకకు తగిలింది. తన సైదోడు ఎక్కడ కనుమరుగవుతుందో అని అది మోర తిప్పి తిప్పి చూచింది. కటికవాడు లాక్కుపోయే బఱ్ఱె చూపులు గుర్తుకు వచ్చాయి. నా మనసు నీరయింది.

ఇది మరీ వింత. ఒక జింకల జంట కనిపించింది. నన్ను చూడగానే హంతకుడు వచ్చాడనుకొన్నాయి. బాణం తన ప్రియురాలిపై పడరాదని పోతు జింక, తన ప్రియునిపై పడరాదని పెంటి జింక ఒకదానిముందు మరొకటి తారట్లాడసాగాయి. నా కళ్లు చెమర్చాయి. అడవిలో గడ్డీ, గాదం, అడవిలో నీళ్లు ఒకదానిపై మరొక దానికి బాధ్యత ఏమీ లేదు. అయినా, ఎంత ప్రేమ? విల్లు దించేశాను. నేను కదలిపోయేవరకు అవి అలాగే తారట్లాడుతున్నాయి.

వర్షాకాలం వచ్చింది. కారు మబ్బులు ఏనుగు గున్నల్లాగ వింధ్య గిరిచరియలను ఎక్కుతున్నాయి. సూర్యబింబం మరుగయింది. ఆకాశంలో ఎగురుతున్న కొంగల బారు కాలపురుషుడు కాలనిర్ణయం కోసం గీచిన సుద్ద తీగలాగ కనిపిస్తున్నది. ఏ బండనో గుండునో పగ్గాలు కట్టిపైకి లాగడానికి ప్రయత్నిస్తూ శ్రమపడుతున్న కార్మికులు అరుస్తున్నట్టు, మేఘుడు జలధారలనే పగ్గాలతో భూమిని పైకి ఎత్తలేక మూలుగుతున్నట్టు ఉరుములు వినిపిస్తున్నాయి. రావడానికి గిరిపతనం చేసిన వారి జీవాలలాగ కొండలపై నున్న మేఘాలలోని మెరపులు ధుకధుకలాడుతున్నాయి. ఇంద్రధనుస్సు దెబ్బతిన్న మేఘమనే మహిషం కడుపులోంచి వ్రేలాడుతున్న పేగుల్లాగ ఉన్నాయి మెరపులు.

మదగజాలు గోదావరి గట్లను తొండంతో కొట్టి కొమ్ములతో కోరాడుతున్నాయి. ఒకచోట ఒక మగ ఏనుగు బురదలో చిక్కుకున్నది. పెంటి ఏనుగు దానిని పైకి తీయడానికి తొండం అందిస్తున్నది. చుట్టూ తిరుగాడుతున్నది. మరొకచోట ఒక ఏనుగు ఎంతో ఆకలిగొన్నా, తన వల్లభను తలచుకుంటూ మింగబోయిన తామర తూండ్లను తొండంలోనే పెట్టుకొన్నది.

ఇదంతా చూచి నిర్విణ్ణుడినై ఇంటి ముఖం పట్టాను. ఇంటి కంచెపై కాకులు వానకు ముద్దయిపోయి, రెక్కలు వ్రేలాడుతూ, మెడలు కుంచించుకొని శూలమెక్కించిన వాటిలా కనిపించాయి. నన్ను చూచి వర్షాకాలం పూచిన కొండమల్లెలతో వికటాట్టహాసం చేసినట్లనిపించింది.

ఆ నాటి బందీ– నేటి నా ఇల్లాలు సోశుంభ, వీడిన కొప్పుతో వాకిట్లో నిలబడి నిండు చూలాలులా వున్న నింగిని చూస్తున్నది. మేఘాల వైపు చూరాను – ఏమిటి నీ కోరిక అన్నట్టు. నా వైపు కళ్లు తేలవేస్తూ చూచింది.

కంచె ఆవల ఒక ఆడ పంది గుర్రుమంది. 'ఏమిటి దీని ధైర్యం' అని తిరిగి చూచాను. పక్కన దాని మగపిల్ల. దాని వెడల్పాటి మూతి చివరకోర పళ్లు దూసుకొని వచ్చాయి. తన మగబిడ్డడు ప్రయోజకుడయ్యాడు గదా అని ఆ ధైర్యం! 'కొడుకు పుట్టగానే ఎంత పొగరు పొంగుతుంది ఈ ఆడజాతికి?'– అన్నాను నిట్టూర్చి. నవ్వింది సోశుంభ.

ఒకరినొకరం చూచుకున్నాం క్రీగంట. చూపులు కలిశాయి. ఒకే మారు నవ్వులు మొలకెత్తాయి ఇద్దరిలోను. దీపానికి నచ్చిందేమో మా ఇద్దరి నవ్వు! గాలికి రెపరెపలాడుతూ నవ్వింది.

# చలివేంద్ర చిన్నది

అబ్బబ్బబ్బ! ఏమి ఎండలు! ఏమి ఎండలు, ఈ సాతవాహనుల రాజ్యంలో ప్రజలు – చలివేంద్రాలు ఉన్నాయి గనుక బతికాము గాని, లేకపోతే నోరు ఎండి ఏమయ్యేవాళ్లమో!

ఒకింటి అరుగు మీద కూర్చున్నాను, ఎండకు తట్టుకోలేక. కాని ఎంతసేపు కూర్చోను? సేద తీరి బయలుదేరబోతున్నాను. ఇంటావిడ వచ్చింది. వాకిట్లోకి చూస్తే కొంచెం ఇదిగానే ఉంది. 'ఏమిటి, బాటసారీ, అప్పుడే బయలుదేరారేమిటి? మన ఒంటినీడ ఎండకు భయపడి మన ఒంటిని దాటి రావడం లేదు, హాయిగా విశ్రమించకూడదూ?' అని సాకూతంగా అన్నది. అక్కడ ఉండడం ఉచితం కాదని వెంటనే బయలుదేరాను.

దూరంగా ఎండలకు వింధ్యపర్వతంలో అడవులు నిప్పంటుకొని ప్రేలిపోతున్నాయి. ఎర్రటి మంటలు వ్యాపిస్తున్నాయి. ఆ మంటలను చూచి పాపం, ఏమీ తెలియని జింకలు, మోదుగవనాలు పూచాయనుకొని కదలడం లేదు.

మరొకచోట వింధ్య పర్వతంలో నిప్పంటుకుంది. పొగలు పెద్దగా లేచి శిఖరాలను కప్పివేశాయి. ఒక ఇల్లాలి భర్త దూరదేశం వెళ్లాడు. వానకాలానికి తిరిగి వస్తానన్నాడు. వింధ్యశిఖరాలపై పొగలు కమ్మడం చూచిన ఇల్లాలు 'వర్షాకాలం వచ్చింది. ఇంకా ప్రియుడు రాలేదే. ఎవతె వలలోనైనా పడ్డాడేమో' అని కుమిలిపోతూంది. ఆవిడ చెలులు ఆవిడను 'పిచ్చిదానా, అవి మేఘాలు కావే, దావానలధూమరాజికమ్మిన వింధ్య శిఖరాలు. నీ భర్త వచ్చే గడువు ముగియలేదు సుమా!' అంటూ సముదాయిస్తున్నారు. పాపం అనుకుంటూ ముందుకు వెళ్లాను.

దారిలోని బావులు ఎండిపోయాయి. బావుల చుట్టుపట్ల వున్న గుబుర్లు అప్పుడప్పుడే ఆకులు తొడుగుతున్నాయి. బావుల్లో నీరుంటే, పదిమంది వస్తారు. నీళ్లు లేకపోతే అంతా ఏకాంతమే. చీకటి తప్పు వాళ్లకు బాగా సంకేతస్థానంగా

ఉపయోగపడుతున్నాయి. వెలిచవులవారు సౌభాగ్యకషణి పట్ట (సౌభాగ్యానికి గీటురాయి) అని ఎండకాలాన్ని పొగుడుతున్నారు. బాటసారిని - నాకెందుకు వారి ముచ్చట్లు? ముందుకు సాగాను.

కొండలమీది నుంచి దూకే సెలయేళ్లు కూడ వట్టిపోయాయి. సెలయేటి చారలు మాత్రం నల్లగా కనిపిస్తున్నాయి. ఒక చోట తెల్లటి పాము కుబుసం పెద్దది, వేలాడుతున్నది. ఒక అడవి ఏనుగు దానిని సెలయేటి ధార అనుకొని తొండంతో లాగుతూ తలమీద పోసుకుంటూంది. ఈ ఎండకు మృగాలకు విచక్షణజ్ఞానం పోయిందేమిటా అని తిరిగి చూతును గదా, మరీ విచిత్రం!.

అడవి దున్నపోతొకటి కొండ చరియ నుంచి వేలాడుతున్న తెల్లటి పామును సెలయేటి జాలు అనుకొని నాలుకతో నాకుతున్నది. ఆ పామేమో అడవి దున్న నోటి నుంచి కారే చొంగను, నల్ల రాళ్ల దొన నుంచి వచ్చే నీళ్లనుకుని తాగుతూంది. విచక్షణ లేని జంతువులు ఏం చేస్తాయో అని తొందరగా ముందుకు నడిచాను.

చెరువు కనిపించింది. నీళ్లు బాగా అడుగంటాయి. మట్టి బురద, చేపలు, తాబేళ్లు కొట్టుకులాడుతున్నాయి. ఆ దయనీయదృశ్యం చూడలేకపోయాను. కొంతదూరంలో ఒక కపిల బావి కనిపించింది. దానిమీద రహట్టం - కుండల కపిల- ఉంది. నీళ్లున్నాయేమో అని తొంగిచూచాను. ఊహుఁ శ్రీరామరక్ష! కుండల కపిలను చూడగానే దుర్మార్గులు జ్ఞప్తికి వచ్చారు. కుండల కపిల నీళ్లు ముంచుకొని నిక్కి నీల్గుతూ పైకి వస్తుంది. నీళ్లు పోయి వట్టివి కాగానే ముఖం వంచుకొని బావిలోకి దిగుతుంది. దుర్మార్గులు కూడ పని పడినప్పుడు వినయంగా ముందుకు వస్తారు. పని పూర్తి కాగానే విర్రవీగుతూ వెళ్లుతారు.

ఎండ మరీ తీవ్రమయింది. నీడ ఎక్కడా లేదు. మన నీడ మనకు ఏమైనా ఉపయోగపడేనా? నిష్ఫలం! పిసినిగొట్టు కూడ అంతే. ఎంతో కష్టపడి కూడబెడుతాడు. తాను తినడు, అనుభవించడు.

నాలుక పీక్కుపోతూంది. నీళ్లు ! మంచినీళ్లు! అమ్మయ్య! దగ్గరలోనే చలివేంద్ర కనిపించింది. గబగబా అడుగులు వేశాను. చలివేంద్ర పిపాసార్తులతో, జలార్తులతో కిటకిటలాడుతూంది. మూలలలో జంటలు కనిపిస్తున్నాయి గుసగుసలు పోతూ.

ప్రపాపాలికలు (చలివేంద్రంలో నీరు పోసేవారూ, అందించేవారూ) ముగ్గరు నలుగురున్నారు. వాళ్లను చూడగానే సగం దప్పిక తగ్గింది. ఒకరిద్దరు నీళ్లు పోస్తున్నారు. పాంథులు వంగి తాగుతున్నారు. కొందరు పానపాత్రలు అందుకుంటున్నారు, ప్రపాపాలికల చేతుల నుంచి. ప్రపాపాలికలు వయ్యారంగా అందిస్తున్నారు. పాంథులు పానపాత్రలను అందుకొనే మిషతో వాళ్ల సుతారమైన, సుకుమారమైన వేళ్లను అందుకుంటున్నారు. ప్రపాపాలికలు మాత్రం తక్కువ వాళ్లా? వివిధభంగిమలతో పథికులను ఆకర్షిస్తున్నారు. ఎకసక్కెలాడుతున్నారు.

ఒక పథికుడు బాగా పరిచితుడు కాబోలు, 'ఏమిటి చిక్కిపోయేవే?' అనడిగాడు. 'చిక్కిపోయే ఆడవాళ్లంతా నీ కోసమే చిక్కిపోతారనుకున్నావా? కారణమేమిటని నవ్వుతూ అడుగుతున్నావు. ఎండకాలంలో నా శరీరతత్త్వమే అంత' – అంటూ మూతి విరిచింది. సరసం బాగుంది అనుకున్నాను.

మరొక పాంథుడు మరొక ప్రపాపాలికతో మేలమాడుతున్నాడు. 'ఎండ ఇంతగా మండిపోతోందా? చందనం ఎంత పూసుకున్నా తాపం తగ్గడం లేదు. ప్రియురాలిని ఒకమారు కౌగిలించుకుంటే, ఒళ్లు, ఉల్లమూ చల్లగా అవుతాయి. అదేమిటో విచిత్రం!' అంటున్నాడు. 'ఎవరా ప్రియురాలు? వెళ్లవచ్చుగా?' అన్నది ప్రపాపాలిక. ఆమెపై ఒక కొంటె చూపు విసిరాడు.

ఇది మరీ మాంచి శృంగారఘట్టం. ప్రపాపాలిక చెంబుతో నీళ్లు పోస్తూంది. పథికుడు వంగి దోసిలితో నీరు త్రాగుతున్నాడు. పాంథుడు కళ్లు పైకెత్తి ఆ సుందరి ముఖం చూస్తున్నాడు. ఆమె చూచింది. ఇద్దరి చూపులూ కలిశాయి. అతడు దోసిలి సడలించాడు. నీరు కిందికి కారిపోతూంది. ఆమె తను పోస్తున్న నీటిధారను మరీ సన్నదిగా చేసింది. ఎంతసేపుగా నడుస్తూందో ఈ నాటకం! వాళ్లు తన్మయులైపోయి, పరిసరాలను పట్టించుకోవడమే లేదు. నిజానికి అతనికి దప్పి లేదు. ఆమెకు నీళ్లు పోసి ముగిద్దామని లేదు. ఇద్దరూ వివశులై మన్మథలోకంలో విహరిస్తున్నారు. పాపం! విహరించనీండి, వాళ్ల జోలి మనకెందుకు?

ఇంతకూ నాకెందుకు? దప్పి తీరిందా? బయలుదేరామా? దారి పట్టామా? ఇల్లు చేరామా? అంతే.

*(గాథాసప్తశతి 2-61)*

# అమ్మో! ఇక మొగుడొద్దు!

"అమ్మో! ఇక మొగుడొద్దు! ఇలా ఉంటుందని తెలిస్తే పెళ్లే చేసుకునేదాన్ని కాను. భరించలేనమ్మా ఈ బాధను. ఇంత వేదన కలిగితే మగడు ఎందుకు? ఏవో ముద్దు ముద్దుగా సుద్దులు చెప్పాడు. హాయిగా ఉంది. బుద్ధి గడ్డి తినింది. లొంగిపోయాను. జన్మలో ఇక వద్దు. మగని పేరు ఎత్తకండి. ఇక అతని ముఖం చూడను!

"అయ్యో! భరించలేను. నడుము కళుక్కుమనిందమ్మా! గడియ గడియకూ నడుము కళుక్కుమంటూంది. కడుపులో నులిపెడుతూంది. కడుపు కొంచెం నొక్కండి. కడుపులో కల్వరించినట్టవుతూంది. తల తిరిగిపోతూంది. ఇక చూస్తానో లేదో! ఆయనను పిలిపించండి. ఛీ! ఛీ! వద్దు. అతడెందుకూ? ఈ బాధకంతా అతడే కదా మూలం! వదిలివేస్తాను. చూడను. చూడనంటే చూడను!

"మంత్రసానిని పిలిపించండమ్మా త్వరగా. ఓపలేనమ్మా. మంత్రం వేయించండి. మంత్రించిన నీళ్లుంటే ఇవ్వండి. ఒక గుక్క తాగుతాను. పరుగెత్తండి. అబ్బో! ఇక ఉండలేను. పక్కలు నొక్కుకు పోతున్నాయి. భయంతో వణికిపోతున్నాను. పిక్కలు పొక్కిపోతున్నాయి. ఎలాంటి బాధలో చిక్కుకున్నాను తల్లీ! దిక్కెవరూ లేరా?

"కూర్చోలేకపోతున్నానే! చేరబడటానికి కుదురైన పీటన్నా ఆనించండి వెనుక వైపు. అమ్మయ్యో! ఎంత కష్టం? ఎంత కష్టం! తీర్చండమ్మా! మరణవేదన అంటే ఇదేనా? ప్రాణం విసిగిపోయింది. ప్రతి సంతుకూ ఇంతేనా బాధ? అయితే వద్దు. సంతూ వద్దు, మొగుడూ వద్దు. మొగుని ముఖాన మొద్దులు కొట్ట! ఏం మొగుడు? అతని మాటే ఎత్తకండి!...."

"హ్హా! హ్హా! హ్హా! హ్హా!... అమ్మలూ నవ్వుతారెందుకే పాపం! మొదటి కాన్పు కదా! రండి. రండి. లేవదీయండి. జాగు చేయకండి. జావ కాచి పోయండి. చేయిచ్చి ఊత మివ్వండి. దూలానికి తాడు పోయండి. దేవతలకు మొక్కండి. దేవుళ్లకు ముడుపు కట్టండి. నందిని తిప్పితే మంచిదంటారు. సుశ్రుతుడు సుఖప్రసవానికి మంత్రం చెప్పాడు. చ్యవనుడు పఠించిన మంత్రమట అది. దానిని చదవండి –

ఇహో మృతం చ సోమశ్చ
చిత్ర భానుశ్చ భామిని,
ఉచ్చైశ్రవాశ్చ తురగో
మందిరే నివసంతుతే.
ఇద మమృత మపాశం ఉధృతం వై
తవ లఘు గర్భమిమం ప్రముంచతు స్త్రీ,
తదనల పవనార్క వాస వాస్తే
సహ లవణాంబుధరైః దిశంతు శాంతిం
ముక్తాః పాశాః విపాశాశ్చ
ముక్తాః సూర్యేందురశ్మయః
ముక్త స్సర్వోభయాత్ గర్భ
ఏ హ్యేహి మాచిర స్వాహా.

"అమ్మాయీ, నీ ఇంట్లో అమృతం, చంద్రుడు, సూర్యుడు, ఉచ్చైశ్రవమనే గుర్రం శుభం కలిగిస్తూ ఉంటాయి. దేవతలు అమృతాన్ని వెలికి తీసినట్లు నీ గర్భస్థశిశువు ఉదయించనీ. అగ్ని, వాయువు, సూర్యుడు, ఇంద్రుడు, సముద్రం, మేఘాలు నీ నొప్పులు పోగొట్టి శాంతి కలిగించనీ. నీ బంధాలు విడిపోయాయి. సూర్యుడు, చంద్రుడు రాహువు నుంచి విడిపోయి వెలిగిపోతున్నారు. ఓ శిశువా, నీకు భయాలన్నీ తొలిగాయి. ఇక ఉదయించు – అనే మంత్రం పఠించండి.

"ఇది మగువలకు గండం. నొప్పులతో అలసిపోయింది. తలంటి పోసి తుడవండి. ఇష్టమయిన పిండి వంట పెట్టండి. అమ్మాయీ! వద్దనకు. ఎర్రావు పాలు ఇదిగో, ఎర్రగా కాచాము. త్వరత్వరగా జుర్రుకో. సయించదు. నిజమే. కాని తప్పక వేడి వేడి పాలు, వేడి వేడి జావ తాగాలి. నేయి చాలా పోశాము. సుఖంగా కాన్పవుతుంది. వీపును గట్టిగా పట్టుకోండి. అమ్మాయి భయపడకు. గట్టిగా కూర్చో.

"చూచావా? అమ్మాయీ! పండంటి బిడ్డడు. పరవశించిపోతున్నావు. కళ్లు మూతలు పడుతున్నాయి. చిరునవ్వు మొలకెత్తుతూంది. సుఖదుఃఖాలు ఒకదానినొకటి వెన్నంటే ఉంటాయి. అంత వేదన పడ్డావా? ఇప్పుడు ఎంత సంతోషపడుతున్నావో కదూ! ఇదే ప్రపంచధర్మం, ఇప్పుడు చెప్పు మొగుడు కావాలా? వద్దా?"

"అమ్మో. వొద్దు, వొద్దంటే వొద్దు"!

*(గాథాసప్తశతి 2-23)*

# పగటి సిగ్గు

ఏమిటీ ఆశ్చర్యం! తెల్లవారీ తెల్లవారగానే కలువలాగ ముడుచుకుపోతుంది ఎందుకు? నిజానికి రాత్రంతా హాయిగా ఉన్నది గదా! ఆ హాయి అనుభవిస్తూ మంచు పడిన మొల్లలా, సూర్యకిరణం సోకిన తామరపూవులా నిత్యనూతనంగా ఉండవద్దూ? ఉషఃకాలపు చల్లగాలులు పాకిన పగడ పూవులాగ తళతళలాడవద్దూ? వెన్నెల రేక తాకిన మరువంపు మొక్కలాగ నవనవలాడవద్దూ? మరెందుకట ఆ ముభావం?

శుక్రుడు వెన్న ముద్దలాగ వెలిగిపోతూ ఉషోదయానికి ముందు ఆకాశపు మేడను నెమ్మదిగా ఎక్కుతూన్నాడో, లేడో... పక్కన తిరిగి చూద్దును గదా. ఒక్కొక్క కళే దిగిపోతున్నట్టు కనిపిస్తుంది. రాత్రంతా నవ్వులతో, నర్మవాక్యాలతో వెలిగిపోతున్న ముఖం. కనిపిస్తుందేమిటి? – దిగిపోతుంది. చూపుడు వేలు గడ్డానికి సుతారంగా ఆనించి పైకి ఎత్తి తియ్యటి తెల్లవారు జాము ముద్దొకటి అనుభవిద్దాము, ఆరగిద్దాము అంటే, ఆ అదృష్టమేదీ?

ముంచుకు వస్తున్న సిగ్గు, దిగ్గున లేవడం, ఎవరో తరుముకొని వచ్చినట్టు. తల వంచుకోవడం ఎవరో తలమీద వేయి బారువల బరువు మోపినట్టు, పోక ముడి సర్దుకోడం, గభాలున ఎవరో లాగివేయడానికి దూసుకువస్తున్నట్టు. ఎన్ని యుగాలు చూచినా తనివితీరని రేగిన జుట్టును మునిగోళ్లతో దువ్వుకోవడం, ఏ దయ్యమయినా పట్టుకుందేమో అన్నట్టు. వెనుదిరిగైనా చూడకుండా పందిరి మంచం దిగి పరుగు తీయడం, వెనుదిరిగి నా ముఖం చూస్తే ఏం పాపం చుట్టుకుంటుందో అన్నట్టు.

ఏమిటీ మార్పు? ఎందుకీ ద్వంద్వవైఖరి? హఠాత్తుగా ఈ సిగ్గు దొంతరలు ఎలా వస్తాయి? ఎక్కడ నుంచి వస్తాయి? ఎందుకు వస్తాయి? రాత్రులు ఈ సిగ్గులు నిగ్గులు ఏమౌతాయి? శయ్యాగృహంలో అడుగు పెట్టగానే ఎక్కడలేని వయ్యారాలూ వస్తాయి. మంచం ఎక్కగానే ఏదో మత్తవేదండాన్ని ఎక్కినట్టే గాంభీర్యం ఉట్టిపడుతుంది. వంద కాదు, వేయి కాదు, లక్ష ఆజ్ఞలు – అలా చేయి, ఇలా చేయి, చెదవిని ముద్దు

పెట్టుకోడం ఒక కళ. పట్టుకొని నమలడానికి అదేమయినా మామిడి తాండ్రా? నాలుకతో నాలుకను తాటిస్తే ఎంత హాయి! ఔను. పోకముడి విప్పడం తెలీదా; ఇన్ని గ్రంథగ్రంథులు విప్పిన విద్వాంసులకు? ఆలింగనంలో అరవై వేల విధాలున్నాయి. ధృతరాష్ట్రుడు భీముని ఆయన విగ్రహం పట్టుకొని నలిపినట్టు కాదు. మెడమీద ఒక ముద్దు మెడ కింద ఒక ముద్దు. ఎంత ఆనందం! భుజాలపైన, నితంబంమీద నెమ్మదిగా చేయి ఆడిస్తే ఎక్కడికో తేలిపోయినట్టుంటుంది. మన్మథమహారాజు విబ్బులను ఎంత జాగ్రతతో తాకాలి. లడ్డు కట్టడం కాదు కదా! బంగరు రంగుతో నిగనిగలాడే నూగారుపై ఒక ముద్దు, నాభి మండలం చుట్టూ నాలుగు ముద్దులు, జఘనం పై జంట ముద్దులు...

ఈ ముద్దులతోనే తెల్లవారితే ఎలా? ఇది ముష్టాముష్టి, బాహాబాహి యుద్ధమా? అలనాడు కృష్ణుడు చాణూరముష్టికులతోను ఇలా మల్ల చరచి వుండడేమో! ఇక పొర్లితే పందిరి మంచం నుంచి నేల మీదికి పడిపోవటమే. ఈ శలభాసనాలు, సర్వాసనాలూ నేను చేయలేనా? కొప్పు ముడి వీడిపోయి కంబడిలాగ కప్పేసింది. చీకట్లు కమ్మినట్టయింది. ఏది ఎక్కడో తెలియడం లేదు. శ్రోణీభారం శ్రమ పెడుతుందా? తీగకు కాయ బరువా? పక్షుల కలకల వినబడుతూంది. దీనికి అంతేదీ? ఇక చాలు, రాత్రంతా ఎంత విశృంఖలత! ఎన్ని ఆదేశాలు?

మరి తెల్లవారగానే పూర్తిగా రూపాంతరమే. పగలు పెద్దల ఎదుట చూడాలి. మరీ సిగ్గుల మొగ్గ, రాత్రి అంత ప్రచండత చూపిన ప్రమదేనా? ఎదురెత్తులిచ్చి కళ్లు మూతలు పడి రొమ్మున వాలిన ముదితేనా? – అనిపిస్తుంది. ఈమె ఆమె కాదేమో ననిపిస్తుంది. రాత్రి మదనుడు ప్రవేశించి కదనానికి దింపుతాడేమో! లేక రతీదేవి రతి రహస్యాలు ఉపదేశిస్తుందేమో!

ప్చ్! నా వెర్రి గాని. పెద్దల ఎదుట, పట్టపగలు అలా వుండక ఎలా ఉంటుంది? వెకిలిగా ఉంటే, నాకే సిగ్గు చేటు కాదూ? పగలు ఇల్లు చక్కదిద్దుకోవాలి, పెద్దలు అడిగితే తగిన సూచనలివ్వాలి. ఎంత అవసరమో అంతే నాతో మాట్లాడాలి. ఏకాంతంగా ఉన్నప్పుడు లలితకళలలో శిష్యురాలుగా, అవసరాన్ని బట్టి గురువుగా వ్యవహరించాలి. రాత్రి ఏమనుకున్నా అంతా పరస్పరం కిందా మీదా మల్లగుల్లాలు పడవచ్చు. పగలు పెద్దల మర్యాద రక్షించాలి గదా. కొంచెం వెకిలిగా ప్రవర్తించామా, దాసీ కొంప అయిందిరా అంటారు లోకులు. మన విషయమే కావాలి కొందరికి. ఏ చిన్న నలుసు కనిపించినా నగరాజులా చిత్రించి చెబుతారు.

పాపం! ఏం చేస్తుంది! కులవధువు. ఇంటితనం మరువకూడదు. పలు వరుస కనిపించని రీతిగా నవ్వాలి. పళ్లు కనిపించాయా, ఏమిటీ వెకిలి నవ్వు అంటారు. గడప దాటి వెళ్లకూడదు. ఎంత తిరిగినా ఇంట్లోనే. ఇల్లు చిన్నదా ఏమిటి? పెద్దకోట. ఎంత తిరిగినా తిరగవచ్చు. తల ఎత్తకుండా చూడాలి. తలఎత్తి ఎగాదిగా చూచిందా, వీధి మనిషిలాగ చూస్తుంది అంటారు. కులపాలిక జీవితం కత్తి మీద సాము మరి!

అలాంటప్పుడు రాత్రి మనిషేనా పగలు చూస్తున్న మనిషి అని భ్రాంతి పడడం ఉచితం కాదు. నిజానికి రాత్రి అనుభవాలు తలచుకొన్నప్పుడు ఆ భ్రాంతి కలుగుతుంది. ఎందుకు ఈ భ్రాంతులు, ప్రాంతులు! నిన్నటి రాత్రి సుఖాన్ని, సుఖసౌకర్యాన్ని పునశ్చరణ చేసుకుంటూ, ఈ రాత్రి ఏం అదృష్టం పడుతుందో, ఏం కొత్త ఆనతులు వెలువడుతాయో, ఏం కొత్త ఎత్తులు ఒత్తుగా హత్తుకొంటాయో అని ఉవ్విళ్లూరడం ఉత్తమం కదూ?

*(గాథాసప్తశతి 1-28)*

# పిల్లడు కొరికిన రేగు పండు

**చూ**చారా పిల్లడు కొరికిన రేగు పండు? ఎంత ముద్దుగా కొరికాడో! రెండే రెండు గాట్లు పడ్డాయండీ. ముందు పళ్లు రెండూ ముచ్చటగా వచ్చాయి. ఎంత అందంగా వున్నాయో! పాల పళ్లు కదూ. పాల రంగులో వున్నాయి.

పాలు తాగుతూన్నాడు గదా, ఎప్పుడు పుట్టుకు వచ్చాయి పళ్లు వీడికి? రేగుపండు ఎలా దొరికింది? ఎప్పుడు దొరికింది? చేతికి అందిందంతా నోట్లో తురుక్కోడమే. ప్రతిదీ కావాలి. రేగుపండు పొరపాటున గొంతులోకి దిగిపోయి వుంటే, ఏమయ్యేది?

చేత్తో పట్టుకొని ఎంచక్కా కొరికాడో! నాన్నా, చూపరా నాన్నగారికి, బోసినవ్వులు ఒలకబోస్తూ. గాట్లు సరిగా చూడనీరా. ఎలా పట్టుకొన్నావు? రెండు చేతులతోనా? జొల్లు జొల్లు పిడికిలి నిండా జొల్లు! ఏమైతేనేం గాట్లు పెట్టావు. చూడనీ. నాన్నగారిని బాగా చూడనీ.

జీవితరహస్యాలు తెలిసినట్టుందోయ్, మీ అబ్బాయికి. ఆర్నెల్ల వయస్సయిందిగా. ఇక ఏ గొడవా లేదు. బండి గాడిన పడ్డట్టే. ఆర్నెల్లుగా ఎలా ఓపిక పట్టారండీ? పాపం! ఏకశయ్య మీదే విరహం. విరహానికి ఊరూ వాడా విడిచి విదేశాలకు వెళ్లడం కాదుగా కారణం! ఒక ఊళ్లోనే ఉండవచ్చు. ఒక పేటలోనే ఉండవచ్చు; ఒక ఇంట్లో ఉండవచ్చు. ఒక పక్కలోనే విరహంతో వేగిపోవచ్చు. పాపం ఈ ఆర్నెల్లూ ఎలా బాధపడ్డారో!

పిల్లల ఎదుట ఏం చేసినా చిక్కే. వాళ్లకు ఏమీ తెలీదనుకుంటాము గాని, అన్నీ చూస్తూ, ఆకళించుకుంటూనే ఉంటారండీ. వారికి మాటా పలుకూ లేదు గనుక చూచినవి చెప్పలేరు గాని, మనస్సులో ముద్ర పడిపోతుందట అంతా. ఈ సంస్కారం పెద్ద వయస్సు వచ్చిన తర్వాత ఏం అనర్థాలకు దారి తీస్తుందో అని, వద్దు వద్దు. ఓపిక పట్టండి అన్నాను గాని నీళ్లాడిన మూణ్ణెల్లకే నా మేను మునుపటి బిగువును పొందినట్టే. ఆ మూణ్ణెల్లూ మరీ ఇదయ్యారు కదూ?

ఔను. పచ్చి బాలింతలు మరీ ముద్దుగా కనిపిస్తారు మగవారి కంటికి. కన్నార్పకుండా చూస్తారు. ఎక్కడ బడితే అక్కడ కొరికి తినేద్దామా అన్నంత తీవ్రం తలెత్తుతుంది. పనస తొనను చూచి ఊరుకుంటాడా ఎవడైనా? లొట్టలు వేస్తాడు. దొరకాలే గాని, నమిలి మింగేస్తాడు. మరి ఈ పనస తొన వెంటనే తినదగింది కాదు సుమాండీ. ఆర్నెల్లూ ఆగాలి.

ఇంతకూ, మీరు ఓపిక పట్టింది మూడు నెల్లేగా. మొదటి మూణ్నెల్లూ ఎలాగూ పచ్చి ఒళ్లు. నీళ్లలో చేతులాడించినట్టు ఏం బాగుంటుంది గనుక? వెన్న ముద్దలో వేలు పెట్టినట్టు వుండదూ? మరి మూణ్నెల్లూ మహా ఓపిక పట్టారండీ. మీ సుపుత్రుడు రేగుపండు కొరికాడు సమయానికి, అనుమతించాడు. ఇక విరహవేదనే పడుతారో, సంయోగసమాధినే కోరుకుంటారో, మీ ఇష్టం!

మా అమ్మమ్మ చెప్పిందండీ, పిల్లడికి పళ్లు వచ్చే వరకే నట శయ్యాపథ్యం. ఆవిడకు వాళ్లమ్మ చెప్పిందట. వైద్యశాస్త్రంలోను ఉందటండీ. అత్రి అనే ముని చెప్పాడట, ఆర్నెల్ల వరకు గర్భిణిని తాకవద్దు అని. ఈ మునులకు అడవుల్లో ముక్కు మూసుకొని తపస్సు చేసుకోక ప్రతి సంగతీ కావాలి. మగవాళ్లెలా నడుచుకోవాలి, ఆడవాళ్లెలా నడుచుకోవాలి. ముసలి వాళ్లు ఏం చేయాలి, పడుచువాళ్ల పనేమిటి? ఇవి వాళ్ల గొడవలు. ఆలూ, మగలూ ఒకటి. వాళ్లు ఎప్పుడేమి చేసుకుంటే వీళ్లకేమిటి? ఎవడికి వాడు సరిగా ఉంటే ప్రపంచం బాగుపడదూ? ఉహుఁ! అలా ఉండలేరు.

మేం తపస్సమాధిలో ఇది కనిపెట్టాం. ఇది నా కోసమా? మీ కోసం. మీ యోగ క్షేమాల కోసం. లోకసంగ్రహార్థం మేం జీవిస్తున్నాం గాని, మా కోసమా? మాకేం కావాలి. రెండు కందమూలాలు. రెండు పళ్లూ ఫలాలూ, నాలుగు పుడిసెళ్ల మంచి నీళ్లూను. లోకం కోసం కాకపోతే ఈ జీవితం ఎందుకు? అంటారు. ఉపదేశాలతో ప్రారంభిస్తారు: ఆదేశాలతో ముగిస్తారు. మధ్య మధ్య సందేశాలూ, అపదేశాలూ ఎన్నో!

ఆ ఋషుల గోల ఇప్పుడు మనకెందుకూ? ఈ అత్రి ఋషి చెప్పిన మాట మనకు అనుకూలంగానే ఉందండీ. తపస్సుతోనే కనిపెట్టాడో, తపనతోనే తెలుసుకున్నాడో, స్వానుభవంతోనే గ్రహించాడో- బాలింతరాలు ఆర్నెల్లు మగనికి దూరంగా ఉండాలన్నాడు- కాదు, కాదు. మగాడు బాలింతరాలైన భార్యకు ఆర్నెల్లు దూరంగా ఉండాలన్నాడు. పిల్లలకు పళ్లు వచ్చే వరకు వేచి ఉండాలన్నాడు.

మీ అబ్బాయి అత్రి ముని అవతారమో ఏమోనండీ! ఆర్నెల్లు కాగానే రేగు పండు కొరికాడు. మీ బాధ తెలుసుకొనుంటాడు. ఇప్పుడే ఇంతగా తండ్రి మనసెరిగి నడచుకొనేవాడు ముందు ముందు కనకాభిషేకమే చేస్తాడండీ. నిజం! ఈ బోసి నవ్వుల్లో రెండు పళ్లూ ఎలా మెరిసిపోతున్నాయో చూడండి. వీడు చేసిన ఇంత గొప్ప పనికి ఏదైనా బిరుదు ఇద్దామంటారా? ఏమిస్తే బాగుంటుంది? విరహ వేదనావిభంజన అందామా? విరహానలవారుణాస్త్ర అందామా?

పాపం ఆర్నెల్లు వేగిపోయారు విరహంతో. విరహమా, ఇక వైదొలగు! ఎడబాటా! ఇక మడిసి పో!

*(గాథాసప్తశతి 2-100)*

# చలి! చలి!

చలి ఎంత బాధపెడుతున్నదో జనాన్ని! కూచుంటే లేవనివ్వదు; లేస్తే కూచోనివ్వదు. పడుకుందామా అంటే, అదీ కుదరదు. పరుగెత్తితే వేడిపుట్టి కొంచెం హాయిగా ఉంటుంది. నిజమే. ఎలా పరుగెత్తుతాం? ప్రవాసంలో వెంట వస్తువులు. తీరా పరుగెత్తితే, ఏ దొంగో, ముచ్చో అని పట్టుకొని రాజపురుషులకు అప్పగిస్తే, పరిస్థితి మరీ ఘోరం. మనమెవరో నిరూపించుకొనడానికి సాక్ష్యాధారాలు లేక, మన వైపు వాదించే ప్రాడ్వివాకుడు లేక బాధపడాలి. ఛీ! ఇంతకూ ఈ చలి కాలంలో ప్రవాసమేమిటి? హాయిగా వెచ్చని చెలి కౌగిట్లో ఉండక? గ్రహబలమంటే ఇదేనండీ!

అడవుల్లో చలికాలం హాయిగా ఉండేది. తలా ఒక దుంగ లాక్కు వచ్చామా, నెగడు వేశామా, చుట్టూ మూగి కూర్చుని కథలు చెప్పుకుంటూ కాచుకున్నామా... క్షణంలో తెల్లారిపోయేది. పల్లెల్లోనూ గడిపాం కదా, గడ్డి దొరికేది. గడ్డి త్వరగా కాలిపోయినా, కావలసినంత గడ్డి. అడగడమే తరువాయి. వెంట్లు వెంట్లు తెచ్చి పడేసేవారు. ఒక కుగ్రామంలో విడిసిన నాటి సంగతి ఇంకా మరువలేం. నికృష్టమైన కుగ్రామం. వాళ్లకే ఇండ్లలో తగిన వసతి లేదు. మనకు పడుకునేందుకు చోటెవరిస్తారు? ఊరి ముందరి గుడి శరణ్యమయింది. గడ్డి నెగడు వేశాం. అది మండి ఆరిపోయింది. లోపల మాత్రం నిప్పు కణకణలాడుతూంది. మాతో పాటు వచ్చిన పాంథుడొకడు దానిని కర్రతో కెలకడం మొదలుపెట్టాడు. ఆరిపోయిన గడ్డి ఎత్తుగా, నల్లగా, పెద్దపెద్ద రోమాలున్న ఎలుగుబంటి లాగనూ, కర్రతో కెలకడం ఎలుగుబంటి పొట్టను చీల్చడం లాగనూ కనిపించింది. ఎంతో ముచ్చటేసింది. మేము దేవళంలో బస చేయడం ఒకావిడకు నష్టం కలిగించిందట. తెల్లవారగానే తెలిసింది, ఆవిడ ఆ రాత్రి అక్కడికి తన ప్రియుణ్ని రమ్మన్నదట. అతడు వచ్చాడు, కాని మేమున్నాముగా, మరి వ్యవహారం ఎలా సాగుతుంది? మొదలే ఆ పల్లె చిన్నది. అంత చలిలో గుడికెందుకు వెళ్లావని ఎవరైనా నిలదీస్తే? ఆవిడ తెల్లవారగానే పెట్టిన శాపనార్థాలతో మాకు ఆ గుట్టు తెలిసింది.

పల్లెల్లో అలా గడిపాం కాని పట్టణాల్లో నెగళ్లూ లేవు, గడ్డీగాదం దొరకదు. ఈ చలి పాత కసితో మరీ ముమ్మరంగా మీద పడుతున్నట్టుంది. చలికాలంలో రాత్రులు పొడుగు ఈ బాధకు తోడు. ఆc! ఆ పట్టణంలో ఒక మాంచి ముచ్చట. అరుగుమీద కూర్చున్నాము ముడుచుకొని, ఇంట్లో ఒకావిడ భర్త వ్యాపారం కోసం ఎక్కడికో వెళ్లాడట. ఆవిడ మంచి ఇల్లాలు. రాత్రులు భర్తను తలచుకొని జాగరణ చేస్తూ, పగలల్లా నిద్ర పోయేదిట. అలా నిద్ర పోవద్దు. భర్త ఊళ్లో లేడు గదా. పగలు నిద్ర ఎలా పడుతుందని ఊరివారు అనుమానిస్తారు. రాత్రులు ఎవరితోనో తిరుగుతుంది. లేకపోతే పగలు నిద్రేమిటి?- అని అంటారని ఇంట్లో ముసలమ్మ ఒకే సణుగుడు. రాత్రల్లా అతని నామస్మరణమే అవుతున్నది. కన్ను మూతపడదు. పగలు కునికితే తప్పా? అనుకునే వాళ్లు ఏం చేసినా అనుకుంటారు - అని ఆ ఇల్లాలి సమాధానం.

మాఘమాసం ప్రవేశించింది. చలి ముమ్మరంగా ఉంది. దారిలో ఒక పల్లెలో ఆగాం. అక్కడి ఒక కర్షకుడు అతిథిసత్కారప్రియుడు, ఆశ్రయమిచ్చాడు. గడ్డి వెంటు విప్పి అరుగుమీద పరచుకొని, ఒక దుప్పటి దానిమీద వేసుకొని కంబడి ముసుగు బిగించాం. ఇంట్లో ఏవో గుసగుసలు ప్రారంభమై, రుసరుసలకు దిగి, బుసబుసలుగా మారాయి. ఏమిటా అని చెవి ఓరగా పెట్టి విన్నాం. 'మా పుట్టింటి వాళ్లు నీకు ప్రేమతో పెట్టిన దుద్దుకంబడిని ఇచ్చి ఎద్దునెట్లా కొన్నావయ్యా?' అంది గృహిణి. పెటపెటలాడుతున్న మైకట్టు, దానికి తగిన అందం. కర్షకుడూ తగినట్టే ఉన్నాడు. అపురూపమైన దాంపత్యం. ఇద్దరినీ ఇంకా చూద్దామనిపించింది.

'ఊరంతా ఏమంటున్నారో తెలుసా? ఎంత వెర్రిబాగులవాడు ఇతను! కంబడికి మారు ఎద్దును మార్చుకుంటాడా, మాఘమాసపు ఈ పుండంటి చలిలో? అంటున్నారయ్యా' అన్నది ఇల్లాలు. 'నన్ను పామరుడన్నా, పండితుడన్నా నాకేం పోయిందే? పొగలేని కుమ్ముల వంటి నీ రొమ్ములుండగా కంబళ్లెందుకు? శాలువాలెందుకే? వాళ్లకా అదృష్టమేదీ? వట్టి కుళ్లుపోతులు. అంటే అననీలే' అంటూ కర్షకుడు రొమ్ములు వీపులోకి అణిగిపోయేలాగ కౌగలించుకున్నాడు ఇల్లాలిని. ధైర్యమంటే అదీ!

నిజం. అందరికీ ఆ భాగ్యం ఉండాలి కదా. బీదలయితే మరీ బాధ. చినిగిన గుడ్డలు. పిడకల కుంపటి ముందు కూర్చుని కూర్చుని పొగ చూరి నల్లబడి ఉంటాయి. నిప్పు సెగకు నేత చీకిపోయి పోగులు దూరదూరమవుతాయి. పిడకల కంపు కొడుతుంటాయి, దగ్గరికి వస్తే పాపం!

తెల్లవారు జామున కొంతదూరం సులభంగా నడవవచ్చునని బయలు దేరాం. వరికోతలు గదా. పొలాల్లో కోతల తర్వాత మిగిలిన గడ్డి కాళ్లకు, పిక్కలకు, చేతులకు గుచ్చుకుంటూ, గీచుకుపోతూ తెల్లగా చారికలు పడుతున్నాయి గోకినట్లుగా. బావి నుంచి కుండల కపిల తోడగా, పంట కాలువలలో పారుతున్న నీటిని చేత్తో అద్దుకుని గీచుకున్నచోట్ల తుడుచుకుంటూ, రాచుకుంటూ ముందుకు సాగిపోయాం.

త్వరగా ఇల్లు చేరుకోవాలి. ప్రియురాలి వెచ్చని కౌగిలి, వెచ్చని ఊర్పులు, వీపున తారాడే వెచ్చని చేతులూ, పెనవేసుకొనే వెచ్చని ఊరువులూ, చెవిలో రొదచేసే వెచ్చని మాటలూ, వెచ్చని కన్నుమూతలూ... అప్పుడు గాని ఈ చలి రక్కసి వదలదు: వదలదు!

*(గాథాసప్తశతి 1-66, 1-77, 2-9, 3-38, 4-29, 4-30)*

# హాలికుడు

ఇంటికి ఎలా వెళ్లను? ఔను, పొలంలో పనేమీ లేదు. అయినా ఎలా వెళ్లను? నన్ను వొంటరిగాణ్ణి చేసి వెళ్లిపోయింది కదా. ఇంటికి వెళ్లితే ప్రతిక్షణమూ ఏవేవో జ్ఞాపకాలు. ఇల్లంతా పండుగలాగా ఉండేది. ఇద్దరమూ ఇంట్లో ఏ మూలను, ఏ అరుగును, ఏ పూలపందిరిని, ఏ జాలకప్రాంతాన్ని (కిటికీని) వదిలామట? ఇంట్లో ఎటు చూచినా, ఏది చూచినా ప్రతిమాపరిపాటిలాగ (చిత్రపంక్తిలాగ) ఇద్దరం పెనవేసుకొని చేసిన పనులన్నీ గుర్తుకువస్తూంటే, ఎలా ఇంట్లో గడపను?

ఇంటిలో ఇద్దరమే. పెద్దలెవరూ లేరు, కాదనడానికి. మేమాడిందే ఆటగా గడిచింది కాలం. ఋతువులన్నీ చూస్తూ వెళ్లాయి. సూర్యుడు చూచాడు; కోపంతో ఎర్రగా చూచాడు. చంద్రుడు చూచాడు; చిరాకుతో ఒళ్లు వడికించాడు. నక్షత్రాలు చూచి మినుకు మినుకు మంటూ నవ్వాయి. మేమూ నవ్వుకున్నాం. దీపాలు చూచాయి, భగ్గున మండాయి ఆగ్రహంతో; చూచి చూచి ఇక చూడలేక కొండెక్కాయి.

అడుగుపెట్టిన చోటెల్లా నవనిధులున్నట్టు మెరిసిపోయింది. ముద్దులాడిన చోటెల్లా అమృతభాండాలు ఒలికినట్టనిపిస్తుంది. కౌగలించుకొన్న చోటెల్లా కాలపురుషునితో కొట్లాడినట్లనిపిస్తుంది. ఇద్దరం ఒక్కటయిన చోటెల్లా సురలోక మనిపిస్తుంది. ఎలా సహించను? ఎలా వెళ్లను?

ఒక రేయి మాట. మాంచి పట్టులో ఉన్నాం. లోకం తెలియడమే లేదు. కాలాన్ని మేము తోస్తున్నామో, కాలం మమ్ముల్ని తోస్తూందో తెలీని స్థితి. తొట్టిలో పడుకున్న పాపడు కెవ్వుమన్నాడు. ఎంత విసుక్కుందో! "ఈ వేలుగాడికి వేళా పాళా లేదూ! ఎప్పుడు బడితే అప్పుడు పాలంటాడు... ఛీ! ఛీ!..." అంటూ శాపనార్థాలు పెట్టింది. "వాడు కలగన్నాడా; మనకు ఉండాలి గాని బుద్ధి?..." అన్నాను, ఏదో గొప్ప తత్త్వవేత్తలాగ. నిజానికి నాకూ విసుగేసింది. కాని, తేలిపోగూడదనుకున్నాను. అయినా ఈ పిల్లలకు, ముసలి వాళ్లకూ మంచి సమయాలకే పని పడుతుందెందుకో! ఆ విసుగుల బుసబుస- ఇంకా వినబడుతూందే. ఎలా వెళ్లను?

ఒకనాటి ముచ్చట, పొలానికి భోజనం తెమ్మన్నాను. తననే ఎందుకు తెమ్మన్నానో గ్రహించి నవ్వుకుంది. అపరాహ్ణమైనా ఇంటికి వెళ్లనివ్వలేదు. పొద్దు వాటారుతూంది. పడమటి దిక్కు కాలపురుషుడు కోపగించుకుని నిప్పు పెట్టినట్టు ఎర్రబారింది. కొంగలు బారులు కట్టి గగనలక్ష్మికి ముత్యాలదండ అందం తెస్తూ వెళ్లుతున్నాయి. పని తెమల్చుకుని గట్టుమీది చెట్ల గుబురులో కూర్చుని సంజె మంజులతను జుర్రుకుంటున్నాను. పక్షుల కలకలం అణిగింది. ఏ చిన్న చప్పుడైనా వినిపిస్తూంది. ఎండిన ఆకులపై అడుగులు వేస్తే చప్పుడయి నాకు తెలిసిపోతుందని, నాకు తెలీకుండా వెనక చేరి నన్ను విస్తుపోయేట్టు చేయాలని అనుకుందేమో! ముని వేళ్లపై నడుస్తూ దగ్గరికి వస్తూంది. నేను అప్పటమైన హాలికుణ్ని. ఈగ వాలితే కనుక్కోగలను. నా దగ్గరనా ఆటలు? ఆకుల చిరు గరగర విని తిరిగి చూచాను. "అమ్మ దొంగా!" అంటూ పెద్ద అంగలు వేస్తూ నా మీద పడింది. మునివేళ్లపై ఆకుల మీది నడక చూడాలి. ఏ మందం? ఏమందం? నట్టువ కత్తెల నాట్యమా? కాదు. నీటి మీద అంచల నడకా? కాదు. తీగ మీద దొమ్మరి సాని సామా? కాదు. మబ్బుల మీద దేవకన్య విహారమా? ఏమో! పెరటిలోని పొగడ చెట్టుకింద రాలిన ఆకులపై అడుగులు వేసినప్పుడల్లా ఆ చప్పుడే వినిపిస్తుందే! ఎలా వెళ్లను?

ఏటిగట్టు మీది ప్రబ్బలి చెట్లన్నీ మా విహారస్థలాలే. ప్రబ్బలి పూగుత్తుల మీద తుమ్మెదలు జుమ్మంటూ మూగేవి. అవి ఎక్కడ పైన పడతాయో అని తోలడంలో ఏమి వయ్యారం, ఏమి సోయగం? ఆ ప్రబ్బలి పొదలన్నీ, ఆవిడతో పాటే ఎండిపోయాయి. ఎందుకో? ఆవిడ విహరించిన తర్వాత మరొకరు అడుగుపెడితే ఏం బాగుంటుంది? ఎండిపోయి వట్టి మొదళ్లే మిగిలాయి. వాటిని చూస్తూ కూచుంటాను. ఇంటికి వెళ్లను. ఎలా వెళ్లను?

ఒకమారు ఎందుకో పూర్తిగా అలిగింది. ఎంతో బుజ్జగించాను. 'నా ముద్దు కదూ. కోప్పడకు. ఇలా చూడు–" అన్నాను. "ఎవరు కోప్పడ్డారు?" అని ఎదురు ప్రశ్న వేసింది. "అందమైన ఒడలిదానా, నీవే" అన్నాను. "పరాయి వాళ్లపై నాకు కోపమేమిటి?" అని మూతి విరిచింది. నా గుండె పగిలినట్లయింది. "పరాయి వారెవరు?" అని నెమ్మదిగా అడిగాను. "నా ముద్దుల మగడా! నీవే" అన్నది పళ్లు బిగిస్తూ. "పరాయి వాణ్నెలా?" అడిగాను బెరుకు బెరుకుగా. "నా పాపాల బలం వల్ల" అన్నది. నాకు ఆశ్చర్యమయింది. ఇది సాధారణమైన అలక కాదు; కొంచెం లోతుగానే ఉంది అనుకొని తప్పులేమి చేశానా, అని ఆలోచించాను. ఆలోచిస్తూ

ముంగిటిలోని గున్నమామిడి కింద కూర్చున్నాను. ఎంతసేపు కూర్చున్నానో! కళ్లు తెరుద్దును గదా – నా ఒళ్లో పడుకున్నది; పసుపు పూసిన మామిడికాయలలాగ వున్న చెంపల మీద బహుళ పంచమి నెలరాజు ముదురు వెన్నెల పడుతూంది. ఎంత మైమరపు! అనుకున్నాను. వెన్నెల రేడును వినుతిస్తూ ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇప్పుడా గున్నమామిడి నన్ను వెక్కిరిస్తున్నట్టు కనిపిస్తుంది. ఎలా వెళ్లను?

అయినా, ఈ మన్మథాగ్ని స్వభావమేమిటో? సాధారణమైన అగ్గి నీరసాలను, ఎండిన కట్టె కంపను కాల్చుతుంది; సరసాలలో పచ్చివాటిలో చల్లారిపోతుంది. కాని ఈ మదనాగ్ని పూర్తిగా విపరీతం. నీరసుల్లో మండదు; నాలాటి సరసహృదయులను కాల్చుకు తింటుంది. మరి ఈ మండుతున్న కట్టెతో ఇంటికి ఎలా వెళ్లను?

*(గాథాసప్తశతి 2-69; 4-65, 73, 84, 100; 5-22, 90)*

# చెరగు మాసినా...

"ఎందుకు దూరంగా నిలుచున్నావు?" అన్నాను. సిగ్గుపడుతూ తల వంచుకుని కొంగును రెండుసార్లు చుట్టుకుంది పిరుదుల చుట్టూ.

ఎవరు చేశారో ఈ కట్టుదిట్టాలు? ఎంత నచ్చజెప్పినా వినదు. "చెరగు మాసిన వాళ్లను చూడటమే తప్పంటారండీ. లోకం నిందిస్తుంది ఏమిటీ ఆత్రం వీడికి అని. మంగళకరం కూడ కాదటండీ. సంఘమర్యాదకు విరుద్ధమండీ. ఇరుగూ పొరుగుకు తెలిస్తే ఏమైనా ఉందా? నన్ను తలఎత్తుకోనిస్తారా? మూన్నాళ్లే కదా. ఓర్చుకోలేరూ?" అంటుంది సిగ్గులు ఒలకబోస్తూ.

నేను చెప్పాను ఎంతగానో. "ధర్మశాస్త్రాల సంగతి అలా ఉండనీ. మానవుని ఆయుస్సును, ఆరోగ్యాన్ని కోరే వేదమైన ఆయుర్వేదం ఏమంటుందో తెలుసా? సుశ్రుతాచార్యుడు స్పష్టంగా చెప్పాడిలా: "నాయనా, ప్రయోజనం లేకుండా మందమతి కూడా ఏ పనికీ పూనుకోడు. కనుక నిష్ప్రయోజనమైన పనిని ఎవరూ చేయరాదు. ప్రవాహంలో విత్తనాలు చల్లుతావనుకో. విత్తనాలు కొట్టుకుపోతాయి, మొలవవు. పదునైన పొలంలో విత్తనాలు చల్లుతావనుకో. మొలుస్తాయి. కనుక స్త్రీ పుష్పవతిగా ఉన్నప్పుడు గర్భాధానం చేయకు" అన్నాడు. మనం ప్రతీసారి సంతానం కోరే కలుసుకుంటున్నామా? అంతటి అమోఘవీర్యులమా మనం? ఎంత దున్నినా, ఎన్నిసార్లు దున్నినా మొక్కయినా మొలవని ఊషరక్షేత్రాలు ఉండనే ఉన్నాయి. ప్రజల కోసమే- సంతానం కోసమే- గృహస్థులయిన వారం కాము మనం. మనకు సుఖమూ కావాలి, సంతానమూ కావాలి. చెరగు మాసినప్పటి సుఖమూ అనుభవించవద్దూ మనం?" అని బతిమాలాను.

ఊఁహూఁ! వింటే ఒట్టు, రమ్మని మరీ మరీ ప్రాధేయపడ్డాను. "లోకం గింజుకోనీ, ఇక మాట అంటావా. నీతో పాటు నాకూ వస్తుందాయె. ఇద్దరికీ అపకీర్తి వచ్చినప్పుడు ఇద్దరం సమానంగా అనుభవిద్దాం, పెళ్లినాటి ప్రమాణాలు తలచుకుంటూ. నాకూ

నిద్రపట్టదు. నా పక్కలోకి వచ్చేయి" అన్నాను దీనంగా. మొండిఘటాలు. బ్రహ్మ బ్రహ్మాండంలోని మొండితనాన్నంతా ముద్దచేసి ముదితలను మలచాడేమో! వింటేనా? చీర కొంగును మరి రెండుసార్లు పొత్తికడుపుకు చుట్టుకొని తల వంచుకొని నవ్వింది. నవ్వడమెందుకట; నన్ను నవ్వు మరీ రెచ్చగొట్టదాంట? "అధర్మకార్యమండీ. పాపకార్యమండీ" అని మరీ మరీ చెప్పలేక కొంగును మరీ మరీ చుట్టుకోడం, నా ఆత్రం చూచి నవ్వడం అన్నమాట. ధర్మశాస్త్రం వైద్యశాస్త్రం మీదే పుట్టింది" కదా. చెప్పితే వినిపించుకోదేం? అయినా, ఆ మూన్నాళ్లూ ఇంత ఆకర్షణ ఎందుకో?

నా మిత్రుడే అదృష్టవంతుడు. నేను ఇంతగా కోరే అనుభవాన్ని సులభంగా పొందాడట. కాని పిరికివాడు. తాకకు, తాకకు అని గోల పెడుతూ నిలుచున్నాడట, ప్రియురాలి ఎదుటే. ఆవిడ చాల సహృదయ. శృంగారం ఎరిగినట్టిది. అతడు గోల పెడుతున్నా వినిపించుకోక, "వద్దు, వద్దు అంటూ ఎదుట ఎందుకు నిలుచున్నారండీ? చేతులు చుమ చుమ లాడుతున్నాయి. ఇక ఉండలేనండీ. తాకేస్తున్నాను" అంటూ, పైన పడి కావలించుకొన్నదట. సుఖపారవశ్యంతో అతని భుజం మీద తలపెట్టి కళ్లు మూసుకుందట.

ఆ ఛాందసుడు ఏం చేస్తాడు పాపం! అతనికీ హాయిగానే ఉంది. తర్వాత పదిసార్లు అఘమర్షణస్నానాలు ఆచరిద్దాంలే అని అనుకున్నాడో, ప్రియురాలిని తోసిపోతే ఏం నొచ్చుకుంటుందో అనుకున్నాడో, దిగాం, దిగాం, ఊబిలో దిగాం అనుకున్నాడో... అలాగే ఉండిపోయాడట.

కాని ఒక్క చిక్కు వచ్చింది. దొంగ వస్తువుతో పాటు దొంగ పట్టుబడ్డట్టు పట్టుబడ్డాడు. అతనికి మరొక ధర్మపత్ని ఉంది. రజస్వలలు రంగు కలిపిన నేయి గాని, పసుపు కలిపిన నేయి గాని ముఖానికి పూసుకోడం ఆచారం గదా. అలా పసుపు నేయి ముఖానికి పూసుకోడం తాను ఇంటికి వెలుపల ఉన్నానని చెప్పడం, ఆ మూన్నాళ్లూ అనారోగ్యకరమైన క్రిములు, జబ్బులు దరి చేరకపోవడం, మరెన్నో కారణాలు ఉంటాయంటారు పెద్దలు. మనం ఏం చెప్పినా వినరుగా! అలా పూసుకోడం వస్తూనే ఉంది అనుచానంగా. ఆ ముఖానికి పూసుకున్న వర్ణఘృతం (రంగు నేయి), ఆవిడ ముఖాన్ని ముచ్చటగా భుజం మీద పెట్టుకుని ఆనందించినప్పుడు, భుజానికి అంటుకుంది. అది సవతి కంటపడింది. ఆవిడ ఒళ్లు భగ్గుమంది. ఏం చేయగలదు పాపం! ఈర్ష్య, కోపం కన్నీళ్లయి కళ్ల నుంచి పెద్ద పెద్ద ముత్యాలుగా కురిశాయి.

"ఏమి మగవాళ్లో? కొత్త వింత పాత రోత. వీళ్ల స్వభావం పాడుగాను! ఎప్పుడూ ఏడు వారాల నగలతో ఉంటాను. అందమా? నాతో సరి వచ్చేవారు ఈ పల్లెలోనే లేరు. నా ఒంపులూ, సొంపులూ తెలియని వాడు కాదు. కాని అలాటి అధర్మకార్యాలు నాకు పడవు. ఏముంది ఆ సమయంలో ఆనందం నీళ్లలో వేలు కదిపినట్టు కాకపోతే! ఆవిడ కావలసి వచ్చిందా ఇలాటి పనులకు? ఇంతకూ ఆయన అలాటి అనాచారాలు చేయడే? ధర్మశాస్త్ర వచనాల్లో గురి ఉన్న మనిషి. అయితేనేం? ఆవిడ ఉందిగా, కవ్వించి ఉంటుంది. లేకపోతే ఆయనకు అంత ధైర్యమేదీ? చూడడానికి బొటికే కాని, ఇలాటి విద్యలు చాలా వచ్చు" అని బుగ్గలు నొక్కుకుందట, కళ్లు మండుతుండగా.

చెప్పడం మరిచాను. ఆ బొటిక దిగాలు పడి నిలుచున్న భర్తను ఎంచక్కగానో ముద్దు పెట్టుకుందట. పెదవులు ముందుకు చాపిందట. ముక్కుకు ముక్కు తగలకుండా, నొసలుకు నొసలు తగలకుండా ముద్దులు కురిపించిందట. రంగు నెయ్యి ముఖానికి తగ్గల్లేదు గాని, భుజానికి అంటుకుంది.

ఏమైనా, అదృష్టవంతుడు. ఇద్దరిలో ఎవరు ధైర్యం చేసినా, సుఖమే. నేనూ ఉన్నాను. ధైర్యం చేయలేను, మూన్నాళ్లూ గుటకలు మింగుతూ కూర్చోడం తప్ప!

*(గాథాసప్తశతి : 1-22, 3-89, 5-80, 81, 6-3, 19, 28, 29)*

# ఆరని ముద్దులు

ప్ఫ్చ్! ప్ఫ్చ్!! ఏమి ముద్దు? ఏమి ముద్దు? తలుచుకుంటే ఒళ్లు పులకించిపోతుంది. ఎలా వచ్చాడో! ఎప్పుడు వచ్చాడో? వెనుక పాటున వచ్చాడేమో! నేను పరధ్యానంగా చేతులు ఎత్తి మొల్లలు కోస్తున్నాను. ఆణిముత్యాలలాగ మెరిసిపోతున్నాయి మొగ్గలు. చెవిలో రెండు చెక్కుకుందామని, కొప్పులో చేరెడు కట్టుకుందామని అనుకున్నాను, ఏకాంతంలో కొప్పు విడిపోయి మొగ్గలు రాలితే ఎంత హాయి? నీలాల నింగి చుక్కలు చల్లినట్లు.

అలా వెనుక పాటున వచ్చాడేమో! రెండు చేతులూ బాహుమూలాల కిందుగా పోనిచ్చి రెండు బుగ్గలూ నొక్కి పట్టి తనవైపు తిప్పుకున్నాడు ముఖాన్ని. కనురెప్పపాటులో జరిగిపోయింది అంతా. ముఖాన్ని దగ్గరకి లాక్కుని తన పెదవులతో నా పెదవులు అందుకోబోయాడు. నాకు ఇష్టమే కాని, అంత దొంగచాటెందుకూ? అందుకే పెదవిని అందనివ్వలేదు. తల అటూ ఇటూ ఆసులో కండెలా తిప్పాను. ముంగురులు చెదరిపోయి గాలికి, తల తిప్పిన వేగానికి ఎగిరెగిరి పడుతున్నాయి. ఏమో కవిత్వం ఒలకబోశాడు. నా ముఖం అప్పుడే విచ్చి గుమగుమలాడే కమలంలాగ ఉందట. నా ఎగిరే ముంగురులేమో కమలం మీద తేనె కోసం ముసురుకొనే తుమ్మెదల్లాగ ఉన్నాయట. ఈయనగారికి ఇప్పుడే తెలిసిందా ఈ సంగతి? కొత్తలో అయితే ఈలాటి కవిత్వాలకు మోసపోయే దాన్నేమో కాని, ఈయనగారు తుమ్మెద వంటివాడని తెలిసిన తర్వాత మనసు మొద్దు బారింది సుమా!

కొత్త అంటే, జ్ఞాపకం వచ్చింది. వట్టి బేలతనం. చూచీ చూడగానే కరిగి పోయేదాన్ని. నా చెలికత్తెలు నన్ను నానావిధాల వెక్కిరించేవారు. "మనిషి ఎదుటపడగానే అలా తీగలాగ ఊగిసలాడిపోతావేమే మొద్దూ? కొంచెం ఓపిక పట్టు. వస్తాడు, పలకరిస్తాడు. తియ్యటి మాటలు వినిపిస్తాడు. నీవు ఊహూఁ ఊహూఁ అంటు ముడుచుకొని పోతావు లజ్జావతీలతలాగ. కాళ్ల మీద పడుతాడు. నీవు మోకరిల్లిన అతనిని చూస్తూ ఏమరుపాటున ఉంటావు. చటుక్కున లేచి నిన్ను లాక్కుని బలవంతంగా

ముద్దు పెట్టుకుంటాడు. అలాటి ఆనందాన్ని చేజేతులా కోల్పోయావే వెర్రిదానా! కొంచెం బిగుమానం చూపాలి" అనేవాళ్లు. అప్పటికీ ఇప్పటికీ ఎంత తేడా? ఈ హఠాచ్చుంబనాలు, బలాత్కార చుంబనాలు, రభస చుంబనాలు నచ్చడం లేదు ఎందుకనో.

ఎందుకేమిటి? అవన్నీ నావే అయితేనో, మరొకరివి కావని తెలిస్తేనో ఎంతో ఆనందించేదాన్ని. మరీ మరీ కోరేదాన్ని. ఎంత తియ్యగా అనేవాడు. "నీ ముఖం నిజంగా చందమామ. నీ అధరరసం అమృతం. అమృతమంటే ఆ దేవదానవులు పాలకడలిని చిలకగా పుట్టిందటనే ఆ అమృతమే. వాళ్లు అంత శ్రమపడి అమృతం సంపాదించారు. నేను ఏమీ శ్రమపడకుండానే ఆరని అమృతకలశమే సంపాదించాను. ఆ రెండిటికీ పోలికలు కుదిరాయి. మరి కొప్పు పట్టుకొని దగ్గరికి లాక్కుని బలవంతంగా సరభసంగా పెట్టుకునే వెలిగిపోయే ముద్దును దేనితో పోలుద్దాం? దానికి పోలిక లేందే?" అనేవాడు. ఆ వేడి ఏమి వేడి? ఎలాటి వేడి?

ఆఁ? వేడంటే ఆ నాటి సంగతి మనసులో మెదిలి ఒళ్లంతా వేడెక్కిపోతుంది. వద్దన్నాను. పెద్దలకు తెలిస్తే బాగుండదు. ఊరంతా పొక్కితే మరీ తలవంపులు - అని ముడుచుకుని గొంతుకు కూర్చుని మోకాళ్లచుట్టూ చేతులు కట్టుకుని చూస్తున్నాను. మనిషి ఆరాటం చూడాలి. ముద్ద చేసి మింగే చూపులు విసిరాడు. పచ్చి పోక కాయలాగ కనిపించాను. ఎటూ సందు లేదు. ఔను మరి? వేళా పాళా లేదా? స్వయంగానన్నా తెలుసుకోవాలి. ఒకరు చెబితేనన్నా వినాలి. రెండూ లేని వారితో ఎలా వేగడం? కాని...

అప్పటి ఆవేదన చూస్తే జాలి వేసింది. పాపం అని అనిపించింది. ఒక్క ఆంక్ష మాత్రం పెట్టాను. ఒంటి మీద చేయి పడరాదు. వేలు చూపితే చేయంతా మింగే గడుసుతనం మరి! అంటే అంటకుండా ముద్దు పెట్టుకోవాలి. ఇదీ ఆంక్ష. తల ఊపాడు పిల్లాడిలా, సరేనన్నాను.

"అంటకుండా, ముట్టకుండా ఎలా?" అని ఎదురు ప్రశ్న. "నా నిబంధన ఇది. ఇష్టం లేకపోతే వెళ్లవచ్చు" అని ఒక చిరునవ్వు విసిరాను. "తలన్నా పట్టుకోకుండా ముద్దు ఎలాగబ్బా?" అని సందేహం. అలా నెమ్మదిగా ముఖం ముందుకు చాపి, పెదవులు అందించాను. ముఖానికి పసుపు నేయి రాచుకున్నానా? దానిని తాకితే పసుపు నేయి అంటుకుంటుంది. కనుక ముక్కు తగలనీక, నొసలు తగలనీక ముందుకు

బుంగరించిన రెండు పెదవులను తన పెదవులతో గట్టిగా పట్టుకున్నాడు. ఎక్కడ వెనక్కి తగ్గుతానేమోనని భయం. పలువరుసతో నొక్కాడు. నాలుక కొసతో తారట్లాడాడు. కళ్లు మూసుకున్నాడు... నాకు మాత్రం కమ్మగా లేదూ?

అలా ఎంతసేపున్నామో! ఎంత వెచ్చగా ఉన్నాయో బుంగరించిన పెదవులు; పెదవుల నుంచి అటు పైకి మెదడు వరకు, ఇటు గుండెల వరకు ఏదో వేడి వాకలు పారినట్లనిపించింది. మిలమిలలాడే పాదరసం పొర్లినట్లయింది. ఏదో కాంతి నిండినట్లయింది. ముక్కూ ముక్కూ కలిసి, నొసలూ నొసలూ తగిలి, పెదవులు హత్తుకొని ఒత్తుకొని ఒకటయ్యే ముద్దులో, ఏవీ తాకని పెదవులు మాత్రం పొదువుకొనే ముద్దుల రుచి ఏదీ? రంగేది?

కోడి కూత వినబడింది. కళ్లు విప్పి చూద్దుము గదా. అలాగే ప్రతిమల్లాగ, ఒకరిని ఒకరు వెక్కిరిస్తున్న వాళ్లలాగ ఉన్నాం. ఏమయినా చేరీ చేరని ఆ ముద్దులు ఆరని ముద్దులు, కోరికలు తీరని ముద్దులు!

*(గాథాసప్తశతి : 1-22, 78, 3-13, 5-65)*

# ఆ క్షణం...!

ధర్మే చ, అర్థే చ, కామే చ మనమిద్దరం ఒకటి; మనలో అరమరలు ఏమీ లేవు. మరి ఈ మరుగెందుకు? మనం పరస్పరం అంతా అర్పించుకొన్నాం గదా. నీదని, నాదని ఏమీ లేదు గదా - మరి ఈ చాటెందుకు? నేనే నీవు, నీవే నేను, నాదంతా నీది, నీదంతా నాది. నీవు నా అంతటికీ సంరాజ్ఞివని సప్తపది నాడే ప్రతిజ్ఞ చేశాను. మరి ఈ మూసి పెట్టుకోవడాలు, దాచుకోవడాలు ఎందుకు? ఎందుకు?

ఔను. కొంగు పట్టుకున్నాను. ఏకాంతంలో ఉన్నాం గదా! ఒక్కసారి నీ దివ్యమంగళవిగ్రహం చూడనీ, ఎవరు చూస్తారు? సూర్యకిరణం కూడా జొరరాని చోటిది. భగవంతుడు సహస్రాక్షుడు. అతడు మనం చేసే పనులన్నీ చూస్తుంటాడు అంటావు. నిజమే. అతని కనులు గప్పి మనమేమీ చేయలేం. అతడు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో చూస్తూనే ఉంటాడు. కనుక, ఆయన మనను చూడనట్టే భావించాలి.

ఒక్కసారి! ఒక్కసారి!... వద్దు. వద్దు. చేలాంచలాన్ని బలవంతంగా విడిపించుకుని పోవద్దు. అబ్బ! అంత తొందరెందుకు? ఎవరు తరుముకొని వస్తారు? ప్రాకారద్వారం మొదలు పడకటింటి తలుపుల వరకు అన్నీ మూసే ఉన్నాయి. గడియమానులు కొండ చిలువల లాగ అడ్డంగా పడే వున్నాయి, తలుపులకు. మనం ఒక్క పిట్ట కంట కూడ పడం. అయినా, అంత దూకుడెందుకు? చేలాంచలం లాగకు. నెమ్మదిగా నడు. పిడికిలిలో ఇమిడే నడుము జవజవలాడుతున్నది చూచావా? స్తనభారంతో అది మొదలే అలసిపోయింది. తొందరగా నడిచావా విరిగిపోతుందేమో!

మనం గార్హస్థ్యజీవితం ప్రారంభించిన కొత్తలో జరిగిన ముచ్చట... నీవు నా ముఖం వైపు చూడన్నా చూడలేదు. తాకనివ్వవు. మాటా లేదు, పలుకూ లేదు. అయినా ఏదో వినోదంగా, కొత్తగా ఉండేది. ఆ రహస్యమేమిటో! నఖశిఖపర్యంతం చూద్దామనే ఆశ గుండెలో కొట్టుకునేది. కానీ, నీవు తాకనన్నా తాకనివ్వనప్పుడు నా ఆశ ఎలా తీరుతుంది?... ఏమైనా సరే చూడాలనే అనుకున్నాను. దొంగ నిద్ర నటించాను.

కొంత సేపయ్యాక పొర్లాను. అరమోడ్పు కళ్లతో చూద్దును గనా, నీ చేయి వణుకుతూంది. చీరను లాగివేయడానికి వీలులేకుండా తొడలను పెనవేసి పట్టుకున్నావు. చీర కుచ్చెళ్లు తొడల మధ్య బిగుసుకుపోయాయి. వణుకుతున్న చేతితో గట్టిగా పోక ముడి పట్టుకున్నావు. ఏం చేయను? బలవంతంగా లాగాలి. ఏం పని? ఎప్పటికైనా మన సొమ్మే కదా, ఎక్కడికి పోతుంది? అనుకుంటూ గుటకలు మింగి ఊరుకున్నాను.

మరొక మారయితే నేనే సిగ్గు పడిపోయాను. నీవు త్వరగా దయ దలచావు అనుకున్నాను. అదేమిటో అప్పుడు నేను తాకీ తాకగానే కరిగిపోయావు. నీవు కట్టుకున్న పట్టాంబరం జారిపోయింది. అది నాకు ఎలా తెలుస్తుంది? నా చేయి నెమ్మదిగా పోకముడిని వెదకబోయింది. వెదికితే ఏముంది? పోక ముడి తగలకపోగా పట్టాంశుకంలాగ మెత్తని జఘనతలం తగిలింది. నా ప్రయత్నం తప్పిందే అని నాకు సిగ్గు ముంచుకు వచ్చింది. నీవు నా సిగ్గు చూచి, సిగ్గు పడ్డాననే పట్టుదలతో మరేం చేస్తానో అనే ఆశంకతో నవ్వుతూ గట్టిగా కౌగిలించేసుకున్నావు. అప్పుడూ నా కోరిక తీరలేదు. కోరిక అంటే నిన్ను పూర్తిగా చూడాలనే కోరిక.

ఏమైనా సరే, ఈ సారి తప్పదని నిశ్చయించుకున్నాను. ఏకాంతసమయంలో నీవు ఊడ్చి కాళ్ల వద్ద కుప్పగా వేసిన చేలాన్ని కాళ్లతో మంచం మీది నుంచి కిందికి తన్ని వేశాను. ఆ సంగతి నీకు తెలియదు. నీవు చొక్కి సోలి నీ చీర కోసం వెదుక్కున్నావు, కాలితోను, చేతితోను నన్ను కదలనీకుండా, నేను కదిలితే నీ దేహం ఆద్యంతం ఎక్కడ చూసిపోతానోనని సిగ్గు, సంకోచం, భయం, ఆందోళన. చీర అందలేదు. మంచానికి ఆవల దూరంగా కుప్పగా పడి ఉంది. లేచిపోయి తీసుకుంటే, కుల వధువుల మర్యాద కాదు గదా. నేను చూడకూడదు గదా నీ నగ్నసౌందర్యాన్ని! ఏం చేశావు? చప్పున కౌగిలించుకొని కళ్లు మూసేశావు. ఏం చేయను? అంతటితో ఆగావా? ఒక సామ్యం కూడా చెప్పావు, ముద్దుముద్దుగా, గుసగుసగా, నాకు తప్ప మన మధ్యన మసిలే గాలిదేవుడికి కూడ వినిపించనంత రహస్యంగా...

పార్వతీపరమేశ్వరులు ఏకాంతంలో ఉన్నారట. పరమేశ్వరుని సంగతి చెప్పాలా? తను గోచి పాతరాయడు, పార్వతి మేని పైన పట్టుపుట్టాలు తొలగించేశాడట. సిగ్గుతో పార్వతీదేవి తన రెండు చేతులతో శివుని రెండు కళ్లూ మూసివేసిందట. తన నగ్న శరీరసౌందర్యం అతని కంట పడుతుందేమోనని. కాని దానితో సమస్యాపరిష్కారం

కాలేదు. శివునికి మూడవ కన్ను ఉంది కదా. అది ఎక్కడ చూస్తుందోనని, పార్వతీదేవి మహాచతురురాలు, వెంటనే ఆ మూడవ కంటిని ముద్దు పెట్టుకుందట... నగ్న స్త్రీని చూడరాదనే ధర్మశాస్త్రం ప్రకారం, నీవు నన్ను ఆ నాడు ఆ దోషం నుంచి విముక్తం చేశావు. కానీ, ఇక ఆ దోషం నాకు వచ్చినా లెక్కచేయను. దానివల్ల కలిగే పాపమో, దోషమో నేను అనుభవిస్తాను, నీకెందుకు? నీకు నేను చేసిన పాపాలు అంటవుగా ఎలాగూ?

★ ★ ★

ఏమిటేమిటి? ఇప్పటికి నా ప్రయత్నం ఫలించిందా? నా పుణ్యాలన్నీ ఒక్కటయి నాకు యీ అదృష్టం కలిగించాయా? ఆ క్షణం! ఆ ముహూర్తకాలం! కళ్లు జిగేలు మన్నాయి. ఒళ్లు జలదరించింది. మతి మాయమైపోయింది. ఎంత ఆశ్చర్యం! ఎంత అద్భుతం! ఏకాంతప్రదేశంలో పెద్ద నిధి దొరికినట్టయింది. స్వర్గలోకం – స్వర్గలోకం అని పెద్దలు చెబుతారే, ఆ స్వర్గంలో పెద్ద రాజ్యం లభించినట్టయింది. స్వర్గ రాజ్యం ఈ సుఖం ముందు, ఈ ఆనందం ముందు ఏ పాటిది? అంటాను. ఇంతకూ ఆ స్వర్గరాజ్యం సంగతి నాకు తెలీదు. నాకు తెలిసిన రాజ్యం ఇదే! అమృతం తాగినట్టుంది నీ నగ్నసౌందర్యం చూస్తుంటే. స్వర్గంలాగా అమృతం కూడ నాకు తెలీదు. ఇదే అమృతం! ఈ నగ్నసౌందర్యాన్ని చూస్తే వేయి విద్యుల్లతలు మెరిసినట్టయింది ఆ క్షణం. ఏమి అందం! ఏమి చందం! ఏమి సొంపు! ఏమి వంపు! స్వర్గంలో ఇలాటి సౌందర్యం లభించేనా? ఆ క్షణంలో నా శరీరంలో ఎన్ని వేల సౌందర్యదీపాలు వెలిగాయి! ఎన్ని ఆనందవాహినులు పొంగాయి! ఎన్ని అమృతధారలు నన్ను చల్లబరచాయి! అబ్బ! అబ్బబ్బ! ఇక చాలు. అమృతం తాగిన అమరుడిలాగా ఉంటాను. నగ్నసౌందర్యాన్ని ధ్యానిస్తూ యోగినవుతాను, ఆహా! ఆ ఆశ్చర్యముహూర్తం ఎంత ఆనంద తన్మయత్వం కలిగించింది!

ఇంతకాలం నీవు సిగ్గులు ఒలకబోస్తూ వున్నావంటే ఏమోనని అనుకున్నాను. ఇంతటి ఆశ్చర్యాన్ని తట్టుకోవడానికి, ఇంతటి ఆనందాన్ని ఇమిడించుకోడానికి, యింతటి విద్యుదాఘాతాన్ని సహించడానికి నాకు శక్తి వద్దూ మరి! వాటిని కూడగట్టుకొనడానికి ఇంతటి జాప్యం చేశావు కదూ? ఏమిటది? మెరపు తీగలే నీ రూపం దాల్చాయా? లేక నీవే మెరపు తీగలుగా మారావా? నిధులే నీలో ఉన్నాయా? నీవే నిధులయ్యావా?

అమృతపు వాకలే నీ రూపంగా పారాయా? లేక నీవే అమృతతరంగిణివా? ఏమైతేనేమి? నీ నిజస్వరూపం నా కళ్లలో దాచుకొని, మనసులో నిధిలాగ పదిలపరచుకుని, అమృతపానమత్తతతో తుందిలుడనై ఆ ముహూర్తాన్ని ధ్యానిస్తూ యోగిభోగిని, భోగియోగిని అవుతాను, అయ్యాను!

*(గాథాసప్తశతి : 2-25, 60, 4-51, 5-55, 59, 7-45, 46)*

# పాపం! ఇంకా పసివాడేనట!

ఎంత వెర్రి యశోదమ్మకు! వ్రేపల్లెను, పల్లెలోని ప్రతివారినీ ఒక్క కొలికికి తెస్తున్నాడు గదా! ఇంకా పసివాడేనట! చెప్పుకుంటున్నది గొప్పగా. మా వాడు ఇల్లు కదలడమ్మా, కానివారు గిట్టనివారు వచ్చి ఏమిటేమిటో దూర్లు, కొండేలు చెబుతూ వెళ్లుతారు. ఏమని అనను? అందరికీ సమాధానం చెప్పలేక – చస్తున్నాను. ఇల్లు కదలని వాడిపై ఇన్ని మాటలా? ఎప్పుడూ, నా కొంగు పట్టుకొనే తిరుగుతుంటాడే. ఏదో పెద్దగా పెరిగిపోయాడు, వెన్న, మీగడలు, గడ్డపెరుగులూ తిని. ఒడ్డూ పొడుగూ చూచి దొడ్డవాడయి పోయాడంటామా? ఆ చెక్కులు చూడండి. గిల్లితే పాలుకారుతుంది. ఆ మాటలు వినండి. గొంతైనా ఇంకా పగలందే. మరి యీ పల్లె వారంతా ఒక్కటయి ఎందుకు ఆడిపోసుకుంటారో! అంటూ దీర్ఘాలు తీస్తుంది.

★ ★ ★

ఆమె ముద్దులపట్టి చేస్తున్న ఆగడాల సంగతి ఆమెకేమి తెలుసు? నేను వట్టి అమాయికను. ముద్దరాలిని. యమునానది గట్టుమీది కానుగ గుబుర్లలోకి రమ్మన్నాడు. ఎప్పుడూ ఒంటరిగా ఎక్కడికైనా వెళ్లానా? ఏదో భయపడుతూ, దిక్కులు చూస్తూ, ఎవరి కంటా బడకుండా తప్పుకుంటూ వెళ్లాను. ప్రతీక్షిస్తూ కూచున్నాను. ఏ చిన్న అలికిడి అయినా నిక్కి చూస్తూ, త్వరగా రానందుకు విసుక్కుంటూ ఏ మారు మూలనుంచైనా దిగబడుతాడేమోనని చుట్టూ చూస్తూ కూర్చున్నాను. తీరా వస్తాడు. వస్తే, ఏం చేయాలి? ఏమని మాట్లాడాలి? ఏమవుతుంది? ఏం చేస్తాడో; ఏమంటాడో? అన్నీ ప్రశ్నలే. గుండె గువ్వల గంపయింది. ఏమీ తోచదు. ఎంత సాహసం చేశాను? ఎవరినన్నా తోడయినా రమ్మనకపోయానే. ఇది మరీ బాగుంది. చేసేది చెడ్డ పని. దానికి తోడూ, జోడూ కూడానా! ఒళ్లంతా చెమటలు సెలఏళ్లలా... ఎంత బాధ పడ్డాను! ఏమని అనను? అడుగు ముందుకు వేశాం. వెనక్కు తీసుకోడానికి వీలులేదు. అబ్బబ్బ! ఎంత బాధ పెట్టాడు! ఇలా వేపుకు తింటున్నాడు. ఇంకా పిల్లవాడేనంటుంది యశోదమ్మ. కృష్ణుని ముఖం చూస్తూ, నవ్వుకోడం తప్ప మరేం చేయగలం? అదే, ఆ నవ్వు యశోదమ్మకు తెలీకుండాను.

అన్నట్టు అలా ప్రతీక్షిస్తూ కూచున్నానా? పక్షులు రివ్వుమంటూ ఎగురుతూ వెళ్లాయి, రెక్కలు కొట్టుకుంటూ. ఆ రెక్కల చప్పుడు సాధారణమైందే. ఎప్పుడూ విన్నదే, వింటున్నదే. కాని, ఆనాడు మాత్రం ఏమిటోగా వినిపించింది. నా తొలి సాహసం, నా తొలి శీల ఖండనం చూచి పక్షులూ సిగ్గుపడి రెక్కలు కొట్టుకుంటూ ఎగిరిపోయి నట్లనిపించింది. నా సిగ్గును దోచగా లేని బాధ, పక్షుల రెక్కల చప్పుళ్లకు ఎందుకు?

ఔనూ! నాకు తెలీక అడుగుతాను. ఈ దొంగచాటు పనిలో ఎందుకింత ఆనందం? ఈ దొంగ తిరుగుళ్లు వద్దు. నా పరువు తీయకు. ఇప్పటికే ప్రేపల్లెంతా పొక్కి ఉంటుంది. తలెత్తలేని స్థితి కలిగించకు – అని బతిమాలాను. వింటే కదా! అయినా తప్పు నాదే కదా. నేనెందుకు అంతగా లోబడిపోవాలి? అతడు ధూర్తుడు. ఛేకుడు. మంచితనం, స్నేహం పొంగుతూ పలకరిస్తాడు. ఆ పలకరింపులు మత్తు మందు చిలకరించినట్టుంటాయి. ఏం చేయను? గుట్టా, పుట్టా పొదరిల్లూ, కొండ గుహలూ అన్నీ తిరిగాను ఆ ధూర్తునితో. కారు చీకట్లలో వెతుక్కుంటూ వెళ్లాను. నా అనుంగు నెచ్చెలి నాతో రహస్యంగా చెప్పింది. వాడితో దొంగ చవులు మరిగావు. పుట్టా, గట్టా అనక చీకట్లలో కలిసి తిరుగుతున్నావు. వాడంటే నల్లని వాడు చీకటిలో కలిసిపోతాడు. నీవు దీపశిఖలాగ వున్నావు. అందరి కంటా పడుతావు వద్దు. వద్దు – అన్నది. శతవిధాలా పోరింది. నా బుద్ధి ఏమైంది? వాడి మాయమాటలు అలాటివి.

ఇంతకూ వాడిని అనడమెందుకు? నన్ను వెంట పడమన్నాడా? పొదల్లో ప్రతీక్షించమన్నాడా? ఏమీ అనడు. ఆ చూపుల్లోనూ, ఆ మాటల్లోను ఉంది మాయ మంత్రమంతా.

నీ వెంట తిరగను అని భీష్మించుక్కూచున్నాను ఒకమారు. ఇంటికే వస్తానన్నాడు. ముచ్చెమటలు పోశాయి. కాని, వాడిలోని ఆకర్షణ వద్దనలేక పోయింది. ఆ రాత్రి అనుభవం మరీ దొడ్డది. వచ్చీరాగానే చేత్తో ఆర్పితే ఆలస్య మవుతుందేమోనని, నోటితో ఊదేశాడు దీపాన్ని. చిమ్మ చీకటి. ఇల్లు ఎంత విశాలమైనా, మేము కలుసుకొన్నది మారుమూల గదే అయినా, అలికిడి ఎవరైనా వింటారేమోనని, ఊపిరి బిగబట్టాం. ఊపిరే తీసుకోనప్పుడు, మాటలేవీ? పెదవి దాటితే పృథివి దాటుతుందన్నట్టు, ఒక్క మాటా, ఒక్క ముచ్చటా లేదు. పెదవి కొరకబోయాడు. చురచురా చూచాను. చూపులతోను, చేతలతోను ఒట్లు వేసుకొన్నాను. వేలు, లక్షలు – వద్దు, వద్దు అని. ఆ ఉద్రేకంలో, ఆ ఆవేశంలో ఆ ఉత్కంఠలో పెదవి కొరికితే, ఏమైనా ఉందా? అందరికీ

తెలిసిపోదూ? ప్రతి నాపసానీ అడుగుతుంది, ఏమే, ఏమిటే ఈ గాటు? ఎవరు కొరికారే? చిలుక కొట్టిందా? తుమ్మెద కాటా? ఇవీ ప్రశ్నలు. ఉక్కిరి బిక్కిరి అయిపోయి, ఊపిరాడక, స్వేదాల ఎత్తిపోతలతో... ఏమిటోగా ఉంది. అదొక హాయి! అదొక పారవశ్యం! అదొక ఆనందమయలోకం!

ఇంత జరుగుతుండగా, ఇంకా పిల్లవాడేనట పాపం! యశోదమ్మ అమాయికత్వానికి ఏమందాం? ఇప్పుడు మరీ ఇదవుతూంది ఆవిడ. మధుమథనుడు ఎదుగుతున్నాడు. పెళ్లీడు వచ్చింది తల్లి చూపులో, సంబంధాలు వస్తున్నాయి. మా పిల్లను చూసుకోండి అంటే మా పిల్లను అని ముందుకు వస్తున్నారు పిల్లల తల్లిదండ్రులు. సంబంధమూ కుదిరింది. ఇప్పుడు యశోదమ్మకు పట్టుకుంది భయం. గోపికలతో పూర్వసంబంధాలు పెళ్లివారికి తెలిస్తే పెళ్లి సంబంధం ఎక్కడ చెడిపోతుందో అని దిగులు పట్టుకుంది. ఇంతవరకు పిల్లడు ఏమీ ఎరుగని వాడు, నోట్లో వేలుపెడితే కొరకని వాడు అని అంటున్నావిడ కాస్తా, గోపికలను బతిమాలుతూంది, అల్లర్లు చెప్పకండే, ఏవో జరిగిపోయాయి . పెళ్లివారు ఏమనుకుంటారో. వింటే బెడిసికొడుతుందేమో! అని.

దీన్నే తనదాక వస్తే గాని తెలీదంటారు. ఇంతవరకు మమ్మల్ని అల్లరి పెట్టిందంతా ఏమైంది? నిన్నటి పిల్లడు - ఇప్పుడు అమాంతం పెద్దవాడైపోయాడా యశోదమ్మా? పాపం! ఇంకా పిల్లడేగా! ఎప్పుడు ఎదిగిపోయాడు?

*(గాథాసప్తశతి : 2-12, 87, 3-18, 74, 4-33, 5-15, 7-55)*

# నీలాటి రేవులో...

**క**వి పవణరాయడు ఎంత బాగా చెప్పాడు. చీటికి మాటికి మూతి ముడుచుకొని మూలకు నక్కేవాళ్లకు! ఈ వయస్సు నదీ ప్రవాహం వంటిదట. పగళ్లు వెళ్లిపోయేవట. రాత్రులు తిరిగి రాలేవట. అందువల్ల బింకాలు, బెట్లూ మాని అనుభవించాలట. నిజమే వెల్లువ వస్తుంది! త్వరలో దిగిపోతుంది. మళ్లీ రాదు. మన కోసం ఆగదు. పగలూ అంతే, రాత్రీ అంతే. వెళ్లిపోతుంటాయి; మన వయస్సు గడిచిపోయిందని తెల్లగీతలు, నల్లగీతలు పెట్టుకుంటూ.

గోదావరి నీలాటి రేవుకు వెళ్లినపుడంతా, దాని గద్గదనదత్ప్రవాహం చూస్తున్నప్పుడల్లా పవణరాయని గాథే జ్ఞాపకం వస్తుంది. ప్రవాహం సంగతి అలా వుండనీ గాని; నీలాటి రేవు దృశ్యాలు చూస్తుంటే మాత్రం కోపాలు, తాపాలు కుప్పగా కూలిపోతాయి; ప్రియతములనూ, ప్రియతమలను ఎన్నటికీ విడనాడరాదనే నిశ్చయం కలుగుతుంది.

ఆ వగలాడి ఎవరో, ఎంతో సుకుమారంగా ఉంది. తాకితే కందిపోతుందేమో నన్నంత సోయగం. కాని, ఎందుకో ఎవరో వదలిపెట్టి పోయిన నేరేడు పట్ట కషాయంతో ఒళ్లు రుద్దుకుంటూంది. నేరేడు పట్ట పొడి, దాని కషాయం మోటుగా వుండే వాళ్లకేగాని ఇలాటి సుకుమారులకు కాదు. ఐనా, ప్రేమ అలాంటిది. అతని అంగరాగం కోరుతున్నది కాబోలు! ఆమె లోకంలో ఉండనివ్వండి ఆమెను.

ఆవిడను చూడండి. అక్కడ సుడిలో పడి తిరిగి తిరిగి కొట్టుకొని వస్తున్నది. కడిమిపూల గుత్తి, పూవుల కేసరాలు, రేకులు విరిగిపోతున్నాయి. అలల తాకిడికి, ప్రవాహవేగానికి మునుగుతూ, తేలుతూ వస్తున్నది. అయినా తుమ్మెదలు ఆ గుత్తిని వదలడం లేదు. ఆవిడ ఆ గుత్తిని తదేకదృష్టితో చూస్తున్నది. ఏ మధురభావనలు తుమ్మెదలలాగ ముసురుకున్నాయో పాపం!

అటు దూరంగా చూడండి, ఏదో శృంగారభాణంలోని అంకం జరుగుతోంది. పాపం, ఎవరో ధార్మికుడు పూవుల కోసం నది గట్టు ఎక్కాడు. ఒక జవరాలు

వెంటబడింది. అందువల్లనే పెద్దలు చెబుతారు, అబ్బాయీ, అర్ఘ్యంతోనే దేవతలు తృప్తిపడతారు. పూవుల కోసం గోదావరి గట్లకు వెళ్లకు. ఆగట్లు శీలంగట్లను కూల్చి వేస్తాయి సుమా - అని. ఒకసారి గోదావరి గట్టు మరిగాకా, ఇక పూజలూ లేవు, పునస్కారాలూ లేవు.

ఎంత వినోదమో చూచారా? పెద్దకాపు కొడుకు నది గట్టున తారట్లాడుతున్నాడు. మరొక కాపు కోడలు చూసింది. మధ్యన పెద్ద మెట్ట. ఎంతకాలంగా కలుసుకుందా మనుకుందో! గబగబా మెట్టదిగి వెళ్లసాగింది. మెట్ట దారి సరిగా లేదు. అయినా, చీరకుచ్చెళ్లు ఎడమచేత్తో పట్టుకుని, పడకుండా కుడిచేతిని సమతూకంగా ఎత్తుతూ దిగిపోతున్నది. త్వరగా వెళ్లనివ్వండి. గృహపతి (పెద్దకాపు) కొడుకును కలుసుకొనడానికి ఇంతకన్నా మంచి సంకేతస్థలం లేదేమో ఆవిడకు?

ఆ దృశ్యం మరీ బాగుంది. ఇద్దరూ దొంగలే. ఆ వగలాడేమో దిగడానికి సరైన దారిలేక ఎగుడుదిగుడు దారి నుంచి దిగుతూ కావాలనే పడిపోతున్నట్టు తూలింది. అలాటి అవకాశం కోసమే ఎదురుచూస్తున్న ప్రియుడు, దయతో ఆమె పడకుండా ఆపినట్టు ఆపి, గట్టిగా రొమ్ముకు హత్తుకున్నాడు. ఎవరు ఏమనడానికీ లేదు. మానవసేవ!

అబ్బుబ్బు! ఆ దృశ్యం చూడలేమండీ. గట్టు మీద చెట్టు కూలి ప్రవాహంలో పడింది. చెట్టు మీద కాకి గూడు కొట్టుకుపోతూంది. గూటిలోని పిల్లలను కాపాడుకుందామనే ఆత్రంతో తల్లికాకి తాను పడిపోతాననే భయం ఎంతమాత్రమూ లేక, ప్రవాహం వెంటనే ఎగురుతూ పోతూంది. తల్లి కడుపంటే అదే మరి!

ఆవిడ నీటిలో మూడు మునకలు వేసి లేచి గట్టెక్కింది. ముడి వీడిన కేశపాశం ఆమె శ్రోణీమండలం చుట్టూ కమ్ముకుంది; దాని స్పర్శ సుఖంతో అంటుకుని పోయింది. కేశపాశం కొసల నుంచి కారుతున్న నీటిబొట్లను చూస్తూ వుంటే మళ్లీ తనకు ఈ స్పర్శసుఖం లేకుండా కట్టి ముడివేస్తారే అనే భయంతో కేశపాశం ఏడుస్తున్నట్టు ఉంది. ఏడవనీండి. కొందరు ఎప్పుడూ ఏడుస్తూనే ఉంటారు.

అదిగో! వాళ్లను చూడండి. పులకించిన చెంపలకు రెండు చేతులూ నొక్కుకుని, ఏదో ఆలోచిస్తున్నట్టు, ఏదో చూస్తున్నట్టు కదలని, రెప్పవేయని కళ్లతో నాగకన్యలలాగ నీటిలో గొంతు వరకు నిలబడి వున్నారు. ఏమిటో రహస్యం! నీళ్లలోనే వాళ్ల ప్రియులు వాళ్ల సుందరదేహాలను కౌగిలించుకుంటారు సుమా! లేకపోతే, అంత పారవశ్య మెందుకట!

సన్నని ఉల్లిపొరలాంటి వలువలు కట్టుకొని స్నానం చేశారు. గట్టున నిలుచున్నారు. తడిసిన వలువలు ఒంటికి అంటుకొని పోయాయి. పొంకమైన చనుకట్టు, కటిపశ్చాద్భాగ పురోభాగాలు, కల్యాణకదళుల లాంటి ఊరువులు తడిసిన వలువల నుంచి దోబూచులాడుతున్నాయి. మన్మథుడు తన బాణాలకు మారు ఇలాటి వారిని ప్రయోగిస్తే చాలు, అందరూ చల్లబడవలసిందే!

ఆ పాయ చూడండి. పచ్చగా, పసుపుతో పొంగులు వారుతూంది. ఆ ప్రేమ భక్తుడెవరో ఆ పసుపు నీటినే తాగేస్తున్నాడు, కొంచెం ఎగువగా ఒకావిడ పసుపు కొమ్ము అరగదీసి రుద్దుకొని స్నానం చేస్తున్నది. ఆమె హృదయాన్ని తాగినట్టు తాగేస్తున్నాడు ప్రేమోపాసకుడు.

దూరంగా గట్టును కొట్టి కోరాడుతున్న గజరాజును చూస్తే భార్యలను బాధించే ముష్కరులు గుర్తుకు వస్తారు. తొండంతో తెగ బాదినా, కొమ్ములతో కుమ్మినా, కాళ్లతో నొక్కినా, ఎంతగా సహిస్తూందో గోదావరి తల్లి?

ఆ ఆడ కప్పను చూడండి. ముందు కాళ్లు గట్టున ఆనించింది. అలలకు దాని దేహం పశ్చాద్భాగం కదలాడుతూంది. నీటిలో దాని ప్రతిబింబం కూడ ఊగిసలాడుతున్నది. దానిని చూస్తే (కామశాస్త్రకారులు చెప్పిన) మగపొదిమికి ఆడకప్ప ఉపక్రమించినట్టు విచిత్రభావం కలుగుతూంది. దాని పని దానిని చేసుకోనివ్వండి.

ఇది మాఘమాసం కదూ! సవతులందరూ మాఘస్నానాలు చేసి, కొత్త చీరెలు కట్టుకుని, నగా, నట్రా ధరించి, దేవకులాలకు బయలుదేరుతూంటే, ఆవిడ గట్టు మీద నిర్లక్ష్యంగా కూర్చుని నదీజలాలను చూస్తూంది చూచారా? ఎంత గాంభీర్యం? మెచ్చిన మగడు సిరిసంపదలు ఉంటే అంతే. ఎలాగయినా వుండగలరు, ఏమైనా చేయగలరు.

*(గాథాసప్తశతి : 1-37, 45, 79, 2-7, 87, 93, 3-46, 4-55, 91, 5-73, 6-48, 55, 58, 76)*

# వసంతవిలాసం

ఏమిటిది! మామిళ్లు పూచలేదు; మలయపవనం వీచలేదు. అయినా ఏమిటో మనస్సు మనస్సులో ఉండడం లేదు. వసంతం వచ్చింది, వచ్చింది అని చెబుతోంది మనస్సు. హృదయం ఉత్కంఠితమైతే, ప్రకృతిలో కూడ ఏమో జరుగుతూన్నట్టే కదా... అరెరె! ఎంత పొరపడ్డాను! మామిడి చిగురు తొడిగింది. ఎర్రగా ఎలా ఉందో! విరహులను కొట్టగా, వారి నెత్తురు ఒడుస్తున్న మన్మథుని చేతి బల్లెంలాగ ఉంది ఆ మామిడిచిగురు. అది తలుచుకుంటేనే గుండె అవిసిపోతుంది.

నాలాగే మరికొందరు పాంథులూ ఉన్నారు. వసంతకాలం లోపుగానే ఇల్లు చేరుకుందామనుకున్నారు. సాధ్యం కాలేదు. దారిలోనే వసంతకాలం ముంచుకొని వచ్చింది. వాళ్లూ చూచారు. మోసులెత్తిన మామిళ్లను, చిగుళ్లను చుట్టూతా చూచి, ఏదో రాజద్రోహవిషయం చెబుతున్నట్టు సందేహిస్తూ, సందేహిస్తూ, నీళ్ల నములుతూ ఒకళ్ల కొకళ్లు చెప్పుకుంటున్నారు - మామిళ్లు చిగిర్చాయి సుమా, ఇక ఉండలేం అని గుసగుసగా.

మాధవసహితమైన (మధుమాస హితమైన) భయంకరమైన దక్షిణపవనం తాకితేచాలు మాధవసహితుడైన భీముడు దుర్యోధనుణ్ణి కుడికాలితో తన్నినంత బాధ కలుగుతూంది. భరించలేక అడుగులు ముందుకు వేయాలి.

ఈ మధుమాసంలో ప్రియురాలు విరహంతో ఎలా వేగిపోతోందో! మామిళ్లు ఎర్రగా చిగుళ్లు తొడిగి మండుతున్న మంటలు లాగ కనిపిస్తున్నాయి. వాటి చుట్టూ తుమ్మెదలు తిరుగుతున్నాయి నిప్పు పొగలాగ. ఈ మంటలకు, పొగ సెగలకు ఎలా తట్టుకుంటూందో పాపం!

అరెరె! పొట్టి సయ్యగారా? మీకూ ప్రవాసమేనా? ఓహో ఈ ఊరేనా? బాగుంది. ఎంత కాలానికి కనిపించారో! క్షేమమేనా? ఏమి క్షేమం? ఇంటిముందు గున్నమామిడుంటే క్షేమమెక్కడిది? దాని తల నుంచి ఎర్రగా అనర్థం బాబోయ్! -

అంటారా? నిజమే. ఈ వసంతం అడుగు పెట్టీ పెట్టగానే మామిడిచెట్టు చివుళ్ల బాకులతో పొడిచి చంపుతూంది. ఒళ్లు తూట్లు పడుతున్నాయి. పాపం! మీకూ ఆ బాధేనా పక్కన ప్రియురాలుండగా? ఔనులేండి. విరహమనేది విదేశంలో వుంటేనే కాదు; ఒకే గ్రామంలో, ఒకే ఇంట, ఒకే కక్ష్యలో, ఒకే శయ్యపైనా కలుగవచ్చు. వారి వారి కర్మఫలం!

★ ★ ★

బాగుంది. ఈ ఊరివారు మదనోత్సవం చేసుకుంటున్నారు. ఐదు బాణాలూ సంధించిన వింటితో మన్మథుడు మరీ కసిగా ఉన్నట్టు కనిపిస్తున్నాడు శిల్పంలో. నిరాభరణసుందరులైన గ్రామవనితలు. మద్యసుగంధమైన ముఖాలు. ప్రియుని చేతి తాకిడికి ముడివీడి, జలపాతంలాగ పడిన కేశపాశాలు. ఎంత సహజంగా ఉన్నారు! కొందరు సుందరాంగులు కుసుమ పూవురంగు పైఠణీ రైకలతో తెగ బరువుగా కనిపించే చనుకట్టుతో మరీ మత్తెక్కిస్తున్నారు. సహజసుందరులకు నగలతో పనేమిటి?

వీరిని చూసి ఇల్లు, ఇల్లాలూ గుర్తుకు వస్తాయి ఏ ప్రవాసికైనా. ఆ ప్రవాసిని చూడండి. ఉండలేకపోతున్నాడు. దిక్కులు చూస్తాడు. ఊపిరి దీర్ఘంగా పీల్చుతాడు. ఆవలిస్తాడు. ఏదో పాట మొదలుపెడతాడు. నిర్వేదంతో ఏడుస్తాడు. ప్రియాదత్తచిత్తుడు కావడం వల్ల మూర్ఛపోతాడు. తేరుకొని తూలి పడిపోతాడు. ఎగుడుదిగుడుగా అడుగులు వేస్తాడు. ఎలా ఇంటికి చేర్చాలో, ఏమో!

కనుల విందైన కొలను. ఇలాటి కొలనులను తవ్వించిన వారు పుణ్యాత్ములే. కాని, ఒక విధంగా పాంథులకు, విరహులకు హాని కూడా చేస్తున్నారు. కొలను అనగానే, కమలాలు, కలువలు పూస్తాయా? పగలూ, రాత్రీ కమలాలు విరగబడి పూచాయి. వాటిలో మకరందం తొణికిసలాడుతూంది. దానిని తాగి మత్తెక్కి తిరుగుతున్న తుమ్మెదలబారు, మధుమాస – లక్ష్మి – వసంతలక్ష్మి ఇంద్రనీలాల మొలనూలులాగ మిరుమిట్లు గొలుపుతూంటే ఎలా భరించగలం?

భూమి మీద ఇలా ఉందా? ఆకాశశోభ చెప్పనక్కరలేదు. చిలుకలు బారుకట్టి వెళ్లుతున్నాయి. వాటి ఆకుపచ్చని ఒళ్లు, ఎర్రటి ముక్కులు వరుసగా వుండడం చూస్తే గరుడపచ్చలు, పద్మరాగాలు పొదిగిన గగనలక్ష్మి మెడలోని కంటె జారిపడుతున్నదా అన్నట్టుంది. చిలుకల బారు అందం చూచి ఎవరైనా, విస్తుపోవలసిందే. అటువైపు చూడకూడదు. పచ్చల పద్మరాగాల కంటె తెమ్మంటే ఎక్కడ తేగలం?

ఈ శుభసమయంలో ఎవరో చేను కాపరి చిన్నది గొంతెత్తి ఝూమ్మని పాడేస్తూంది. ఆమె పాటకు శ్రుతిగా వసంతపవనాలకు చెలరేగిన తుమ్మెదలు ఝుంకారం చేస్తున్నాయి. పాటనిండా విరహమే. ఇక విరహి పాంథుల గుండెలు జల్లుమనక ఏం చేస్తాయి? ఆమె పాట వింటూన్నవాడు ఇక ఆగలేడు. పరుగులు తీస్తూ తన ఇంటి ముంగిట్లో పడాల్సిందే!

దారిన ఉండే ఈ ఊళ్లో అడుగుపెట్టీ పెట్టంగానే ఏమిటీ ఏడ్పు, అపశకునంగా. ఎవరో ప్రవాసానికి వెళ్లాడేమో, అతని ఇల్లాలు కాబోలు! ఎవరో ఊరడిస్తున్నారు - "అమ్మాయ్! ఏడవకు. ప్రయాణం శుభంగా జరగడానికి పెట్టే ప్రస్థానకలశంలో పైన పెట్టాను, తొలిమామిడి పూలగుత్తితో పాటు మామిడి చిగుళ్ల రెమ్మను. దానిని వెళ్లేప్పుడు నీ ప్రియుడు ఎలాగూ చూస్తాడు. చూచాడో ఇక పోలేడు; కాలు కదపలేడు. మామిడి చిగుళ్లు, పూలగుత్తి అతని కాళ్లకు బంధాలవుతాయి" అని... అయితే ప్రవాసానికి వెళ్లలేదన్నమాట. బయలుదేరేప్పటి గొడవన్న మాట ఇదంతా!

ఈ దృశ్యం మరీ బాగుందే! ప్రవాసం నుంచి ఇప్పుడిప్పుడే తిరిగి వచ్చాడేమో! వట్టి సందేహాల పుట్టలాగ కనిపిస్తున్నాడు. అంత దూరం నుంచి వసంతమాసంలో వచ్చినవాడు, మూతి ముడుచుకొని ఎలా కూర్చోగలుగుతున్నాడో! మేనత్తో, పినతల్లో నచ్చజెప్తుతూంది - "అబ్బాయీ, నిజం, పచ్చి నిజం! వసంత ఋతువు చేయనిదంటూ ఏమీలేదు. ఎర్రగోరింటలు పూచి గుప్పుమన్నా, అమ్మాయి, మనసులో ఒక్క చెడ్డ తలపన్నా రానీయలేదు సుమా! ఇంతకాలం వెళ్లావు గదా! మరొకర్తైతే వసంతాల దెబ్బకు శీలాన్ని ముక్కలు ముక్కలు చేసుకొనే వారే. అమ్మాయి మాంచి గుండె దిటవు గలది. ఓర్చుకొంది. శీలం కాపాడుకుంది"... వెర్రివాడు... ఆ ఇల్లాలిని చూస్తే తెలీదూ? నిష్కపటమైన ముఖం, నిష్కల్మషమైన కళ్లూను...!

ఇక ఆగరాదు. త్వరగా పయనం కొనసాగించాలి. ఇంట్లో వాలాలి...!

*(గాథాసప్తశతి : 1-15, 2-28, 43; 3-19, 4-96, 5-43, 79; 6-42, 43, 44, 45, 75, 85)*

# ఫాల్గునోత్సవం

**ఫా**ల్గునోత్సవం (హోలీ) అంటే, నా ఒళ్లు పొంగిపోతుంది. పాత సహచరులను కలుసుకోవచ్చు. ఎవరి హంగూ లేకుండా కలిసి తిరగవచ్చు. పాత ముచ్చట్లు చెప్పుకుని మురిసిపోవచ్చు...

వచ్చింది. వచ్చివేసింది ఫాల్గునోత్సవం. నగారాలు, ఢక్కాలు, తప్పెట్లు కొడుతున్నారు. వాటి ధ్వనికి చెవులు చిల్లులు పడుతున్నాయి. జనం హడావిడిగా అడ్డదిడ్డంగా పరుగెత్తుతున్నారు. ఎక్కడి చూచినా ఆనందకోలాహలమే!

ఈ పండుగలో ప్రకృతి జనానికి కింకరిలా అయిపోతుంది. పూవులు, మొగ్గలు, చివుళ్లు, తలల్లో, చెవుల్లో తురుముకొని మగా ఆడా గంతులు వేస్తున్నారు. కొందరు కొమ్మల కొప్పునిండా పూలు, కొప్పులు పూవులను ఉమ్మి వేస్తున్నట్లు ఉంది. నల్ల కలువలు, నేరేడు చివుళ్లు, పాద్రి పూగుత్తులు, విరజాజులు, మరువం, ఊడుగు చివుళ్లు, రెల్లు పూలు, చివరకు వెదురాకులు కూడా చెవులలో ఇరికించుకున్నారు- కర్ణావతంసాలుగా.

వసంతాలు, రంగులు, చివరకు బురదనీళ్లు కూడ ఒకరిపై ఒకరు చల్లుకుంటున్నారు. పాపం! ఆ అమ్మాయిని చూచారూ? కొత్తకాపురం కాబోలు! కర్పూరం, కుంకుమ మొదలయిన సుగంధద్రవ్యాల చూర్ణం చేత్తో తీసుకుంది ప్రియునిపై విసరుదామని. మొదట్లో ఉత్సాహంతోనే ఉంది. కాని, ప్రియుణ్ని చూడగానే ఒళ్లు చెమర్చింది. కంపం పుట్టుకు వచ్చింది. చేత్తో పట్టుకున్న సుగంధచూర్ణం చెమటకు సుగంధజలమయింది. ప్రియుడు దిగాలు పడి చూస్తున్నాడు.

ఆ యువతిని చూడండి. చెవిలో కలువ చెక్కుకుందా; కలువకు, ఆమె కంటికీ ఏమీ తేడా లేదు. ఆవిడ ప్రియుణ్ని ఉత్సవజనంలో చూచి సంతోషపారవశ్యంతో, కన్నులు మూసుకుంది. అప్పుడు తెలిసింది చూచే వారికి, అవి కళ్లు, ఇవి కలువలూ అని.

ఈ ఫాల్గునోత్సవంలో ఎవరు ఎవరినైనా ఏమైనా అనవచ్చు, తాకవచ్చు. పైన ఏమైనా చల్లవచ్చునన్నాను గదా! ఎవరో ఆ జవరాలిపై బురదచల్లారు. పండుగ గనుక తప్పు లేదుగా. ఆ బురద స్తనకలశాలపై అంటుకుంది. కాని స్తనకలశాల నుంచి జారిపడే చెమట ఆ బురదను కడిగి వేసింది. అయినా, ఎందుకో, ఆవిడ మరీ మరీ కడిగి వేసుకుంటూంది.

అటు చూడండి. ఆ కర్షకకుమారుడు చెవిలో నేరేడు రెమ్మ చెక్కుకుని అటూ ఇటూ పచారు చేస్తున్నాడు. అతనిని వంకర చూపులతో చూస్తున్న ఆ వన్నెలాడి ముఖం ఎందుకో నల్లగా అయింది. నేరేడు పొదలో ఇద్దరూ కలుసుకొని వుంటారు. నేరేడురెమ్మను ఎవరైనా చూచి సందేహపడుతారనేమో! ఇదిగో అమ్మాయి, ఈ పండుగ సంబరంలో ఎవరి గొడవలు వారివి సుమా!

ఇటు చూద్దురూ. మరీ వింత. ప్రియురాలు అలిగింది. ప్రియుడు అలక తీర్చడానికి కొప్పు పట్టుకుని ప్రియురాలి ముఖం పైకెత్తి, తన నోట్లోని మదిరను అందిస్తున్నాడు. ఆ మానిని తన రోషాన్ని మింగుతున్నట్టుగా మదిరను చేదుమందు లాగ గుటకలు వేసి మింగుతూంది.

ఆ కర్షకుని కోడలు చూచారూ. ఈ పండుగకు కొత్త చీర వస్తుందనుకోలేదేమో! కొత్త బట్టలు కట్టుకుంటే, వసంతంతో, రంగు నీళ్లతో పాడయిపోవూ! అయినా ఆ కోడలు కొత్తరంగు చీర కట్టుకుని, తనతో సమానమెవరూ లేరని తెగ తిరుగుతున్నది వీథులన్నీ. తన కోసమే వీథులన్నీ ఉన్నట్టు ఏమిటా తిరుగుడు?

ఆ అమ్మాయి బుగ్గలు చూడండి. ఎంత అందంగా ఉన్నాయో! వయస్సు బుగ్గలకు మరింత అందం తెచ్చింది. పండుగ ఉత్సాహం మెరుగులు దిద్దింది. చెవిలో చెక్కుకున్న పూలగుత్తి వంగి ఆమె కపోలాల లావణ్యమంతా తాగివేస్తున్నట్టుంది. దాని అదృష్టమది!

ఆ పల్లెటూరి యువకుణ్ని చూడండి. తలలో అప్పుడే గోళ్లతో గిల్లిన కొత్త మామిడి పూగుత్తిని తురుముకొని వచ్చాడు. ఎవరో తమ ప్రియురాలిని బందీగా పట్టుకొని వెళ్లుతుంటే, విడిపించుకొని వెళ్లడానికి వస్తున్నవారిలా గండు తుమ్మెదలు తరుముకొని వస్తున్నాయి, జుమ్మంటూ.

ఇది మరీ విచిత్రమండీ! ఆ సుందరి ఇంద్రనీలాల కమ్మలు పెట్టుకుంది. వాటి కాంతి, నేటి పున్నమచంద్రుని కాంతీ ఆవిడ చెంపలమీద మిలమిలలాడుతున్నాయి.

ప్రియుడు వట్టి వెర్రిబాగులవాడు. ప్రియురాలు కన్నీళ్లు పెట్టుకుంటున్నదనే భ్రాంతితో చేత్తో తుడుస్తున్నాడు చూడండి.

ఆ శ్రీమంతురాలిని చూడండి. నల్లటి పలుచని రైక బిగించింది పొంగి పొర్లి పోతున్న రొమ్ములకు. రైక బిగింపుతో రొమ్ముల పైభాగం మరీ ఉబ్బి- చూపరులను తబ్బిబ్బు చేస్తూంది. ఎలా వుందంటారు? నీళ్లు నిండి, ఇప్పుడో అప్పుడో కురవబోతున్న నల్లమబ్బులలో నుంచి తొంగిచూస్తున్న చంద్రబింబంలా లేదూ?

ఆ తరుణిని తిలకించండి. ఎండిపోయిన, వాసనలేని పూలదండ మెడలో వేసుకొని ఉద్వాసన చేసిన నగరదేవతలాగ దర్శనమిస్తూంది. జాతరంతా తిరుగుతూంది. ప్రియునికోసం అన్వేషణ కాబోలు! ఎంత ప్రేమ లేకపోతే ఆ వాడి ఎండిన పూలదండ వేసుకొని తిరుగుతుంది చెప్పండి!

ఇంతకూ, మనవాడేడీ? కనుచూపు మేరలో కానరాడే! అతడు లేకపోతే ఏం తోస్తుంది? ఎంత ఆశ పెట్టాడు? ఎన్ని వాగ్దానాలు చేశాడు? వాటిని నిలుపుకోవద్దూ? అతడు లేకపోతే ఈ తూర్యనాదాలూ, పలు హోరవాలు, ఈ పరుగులు, ఈ కలకలం–అమ్మో, గ్రామంలో నిప్పంటుకున్నప్పుడు కూడ జనం అడ్డదిడ్డంగా పరుగులు తీస్తారు. గోల చేస్తారు. డప్పులు కొడతారు సమయానికి రండర్రో అని. మరి ఎందుకీ పాడు ఉత్సవం ప్రియతముడు లేంది? ప్రవాసం పాడుగాను! సమయానికి రాకపోతే మనస్సు ఎంత పాడవుతుందో తెలీందా? ఛీ, ఛీ! పాడు గోల! ఏం తప్పెట్లు! ఏం పరుగులు! ఇంతకన్నా ఊరు కాలిపోతే నయం!

(*గాథా సప్తశతి*: 4–12, 23, 69; 6–35)

# లావణ్య నిధులు

**నా** కోసం వేయి కలువ కళ్లతో ఎదురు చూస్తూంటుంది. అటూ ఇటూ చూస్తున్న చూపులతో వీధిలో కలువపూలు పరుస్తూ వుంటుంది. గుమ్మంలో నిలబడి చూస్తుంటుందా! ఎత్తయిన ఆ పయోధరాలు నా స్వాగతం కోసం పెట్టిన మంగళ కలశాలులాగ వుంటాయి. అందమైన ముఖం మంగళకలశంలో పెట్టిన అమూల్యమైన కమలం లాగ కళ కళ లాడుతూ వుంటుంది.

ఏమిటో వాటి గమ్మత్తు! రేగు పళ్లలాగ మొదట కన్పిస్తాయి; ఉసిరికలవుతాయి; నారింజలూ; దానిమ్మలు అవుతాయి. చాలు చాలు! తాళఫలాలయితే చూడలేను. వాటి పరిణామం చూస్తుంటే వామనుడు త్రివిక్రమావతారం ఎత్తిన కథ జ్ఞాపకం వస్తుంది.

నానాటికి అందం ఇనుమడించి దీపశిఖలాగ రూపొందుతున్నదని కుళ్లి ఛస్తున్నారు ఇరుగు పొరుగూ! వారి కోపం, అక్కసూ రెండు ముద్దలుగా మారాయేమో! లావణ్యానికి విడుదులుగా, మదనుని గజం కుంభస్థలాలుగా వుంటున్నప్పుడు ప్రతివారూ తనవయితే బాగుండుననుకొంటారు గదా. మరి పక్కింటి అమ్మలక్కల కళ్లు కుడుతాయంటే తప్పా?

ముంగిట్లో వున్న ఆముదపు చెట్టు ఆకొకటి కంచె సందు నుంచి వెలుపలికి పొడుచుకొని వెళ్లింది ఆ మధ్య. కంచె లోపల దగ్గరగా వున్న ఏ చెట్టు కొమ్మయినా, సందు వుంటే దూరి ఆవలికి పోతుంది. అలాగే ఆముదపు చెట్టు ఆకూనూ. అబ్బబ్బ! దానికి వీధిలోని వారు చేసిన రభస తలచుకొంటే కోపమూ, నవ్వూ వస్తాయి. ఆముదపు ఆకు చాచిన అరచేయిలాగ వుంటుంది గదా! ఈ ఇంట్లోని వయ్యారి పాలిండ్లు ఇంతలేసి వున్నాయి సుమా అని ఆముదపాకు చూపుతున్నదని గుసగుసలాడుకుంటున్నారట. ఎందుకా గుసగుసలూ, అక్కసులూ? శుష్కస్తనలు అంతకన్నా ఏం చేస్తారు?

వారి మాటలకు భయపడిందేమో! ఒకనాడు ఏకాంతంలో అన్నది కదా, "ఈ పాడు పాలిండ్లు గున్న ఏనుగు కుంభస్థలం లాగ సందు లేకుండా మరీ బలిసిపోయి

ఎత్తుకు ఎదిగిపోతే, ఊపిరి తీసుకోడమే కష్టమయిపోతే, ఎక్కడికయినా వినోదంగా వెళ్లడమే పడదేమోనండీ!" అని.

"ఛీ! ఏమిటా మాటలు? పొంగి పైకి ఎగబాకుతున్న నీ రొమ్ములు చూచి చెంపలు నొక్కుకొనిపోగా ఎలా నిట్టూర్పులు విడుస్తున్నారో చూడు, ఆ ఆడవాళ్లంతా! ఊరూ వాడా ఏమనుకుంటున్నారో తెలుసా? నీ రొమ్ములు పొంగుతున్నకొద్దీ నీ నడుమూ, నేనూ, నా కోదండమూ, ఊరిలోని యువకులూ, నీవంటే పడని పడతులూ చిక్కిపోతున్నారూ అని".

ఆ మాటలు విని "ఇక చాలు లేండి" అని నా వైపునకు సగం పొర్లింది. నా నోరు మూసివేసింది కుచమండలం.

"నీవు నా దానివి కాక ముందు ముచ్చట. మన్మథనిధి కలశాల లాగ వున్న నీ పయోధరమండలం పైన ఏ భాగ్యశాలి చేయి, ఏ బహుపుణ్య ఫలతరువు చిగురు వంటి చేయి పడుతుందో అని గుటకలు మింగేవాడిని. నీ అన్నదమ్ములు తండ్రి, పెద్దలు బలవంతులు. వారి రక్షణలో నీవున్నావు. నాగుబాము కాపాడే నిధులను దొంగలు ఆశతోను, భయంతోనూ చూసేటట్లు నీ రొమ్ముల వైపు దొంగ చూపులు చూచేవాడిని–" అన్నాను.

"ఓహో! చిన్ననాటి నుంచే ఉందన్న మాట దొంగచూపులు చూడడం!" అని నవ్వు విసిరింది.

"నీ రెండు పాలిండ్లూ రెండు మహాకావ్యాలు సుమా!" అన్నాను ఒకమారు.

"ఎలాగండి కవిగారూ?" అని ప్రశ్నించింది.

"మహాకావ్యాల్ని తడిమి చూస్తూండాలి. తడిమిన కొద్దీ విశేషార్థాలు స్ఫురిస్థాయి. మరి వీటినీ తడుముతూ ఉండాలి. సుఖస్పర్శతో కొత్త కొత్త ఆనందం కలుగుతూ ఉంటుంది. కావ్యాలు అర్థంతో బరువైనట్టివి. ఇవీ బరువైనవే. వాటిలో ఆక్షేపించడానికి సందు దొరకదు. వీటిలోనూ సందు లేదు. ఒకటికొకటి రాచుకుంటూ ఉక్కిరిబిక్కిరి అవుతుంటాయి. వాటికి లక్షణాలూ, అలంకారాలూ ఉంటాయి. వీటికీ ఉంటాయి. మరి హృదయానికి హత్తుకోవడంలో రెండూ సమానమే" అన్నాను.

"ఇదిగో కనకాభిషేకం" అంటూ కళ్లెత్తి చూచింది.

ఒకమారు ఏదో పని పడి ప్రవాసం వెళ్లవలసి వచ్చింది. నాకు వెళ్లాలని లేదు. ఇల్లాలి ఎత్తయిన రొమ్ముల ఒత్తిడి సుఖంలో పడ్డాను. ఛా! ఈ వేళ శకునం బాగాలేదు.

ఈ వేళ మంగళవారం. దినశూల. ఈ వేళ మరొకటి అంటూ గడిపివేశాను. ఎంత సుఖమైన కాలమది!

సీమంతినుల స్వభావం విచిత్రంగా వుంటుంది. ముత్యాలహారం కావాలంటే, మత్తగయింద నాయకుణ్ని కోరి, ఆణిముత్యాల దండే తెచ్చాను ఏకంగా. ఒక రాత్రి ఆత్రంగా కౌగిలించుకొన్నాను, రొమ్ములు అణిగిపోయేట్టు. ఆణిముత్యాల దండ మధ్యన నలిగింది. "ఛీ! ఇదొకటి అడ్డం–" అంటూ పట్టి లాగింది. దారం తెగి ముత్యాలు కన్నీళ్లు కురిపిస్తున్నట్టుగా దొర్లిపోయాయి. అప్పుడు గౌరవం పొందిన ఎంత గుణవంతుడైనా కాలం మారితే చులకనయిపోతాడు గదా– అనుకున్నాను.

ఒకమారు ఉత్సాహం పట్టలేక అన్నాను– "చాచావా? పండిన బిల్వఫలాలలాగ వున్న నీ రొమ్ములు, మంచి వారి మనోరథాల లాగ హృదయంలో ఇమడక ముందు ముందుకే వస్తున్నాయి–" అని.

విసురుగా ఒక్క చూపు విసిరింది. "అయ్యో! ఎంత వ్యామోహమండీ మీకు? ఇప్పుడు వయస్సులో వున్నాను. బిగువూ బింకం, పొగరూ పొంకం కనిపిస్తాయి. వయస్సు మళ్లిందో, స్థానభ్రష్టమవుతుంది. బలుపూ తగ్గిపోతుంది, ఉన్నతీ మన్నవుతుంది. పొట్టమీదికి వాలిపోతాయి. అంత ఎత్తు నుంచి ఇంత కిందికి పడిపోయామే అనే చింతతో వాటి ముఖాలు నల్లగా అయిపోతాయి. అప్పుడు మీరే అంటారు – సహజ సుందరంగా, సహజగురువుగా వున్న రొమ్ములు పడిపోయాయే, మహిళల హృదయంలో ఎవరూ చాలకాలం స్థిరంగా వుండరేమో...."

ఇక వినలేకపోయాను. నోటికి అడ్డంగా పెదవులు పెట్టాను. కొంతసేపు ఆగాను. "ఎంత ఘోరం! ఎంత ఘోరం! ఎలాంటి మాటలు అంటున్నావు? అలా జరగదు. అలాటి దానిని ఊహించనైనా ఊహించలేను. దురదృష్టవశాన అలాటిది జరిగింది అనుకో... వీరభటులను – సైనికులను చూచావు గదా. వారు స్వామిభక్తిలో వున్నతులు. వేలెత్తి చూపడానికి సందివ్వరు. యుద్ధాల్లో తిన్న దెబ్బలతో మరీ అందంగా, నూత్నశోభతో వుంటారు. తమ స్వామి కార్యం నిర్వర్తించి పడిపోతారు. వారి జన్మ సార్థక మవుతుంది. ఇవి కూడా ఉన్నతమైనవి. సందు లేక ఒత్తుగా ఒత్తుగా పెరిగినట్టివి. గోళ్ల గిచ్చులు, పంటి గాట్లూ పడి మరీ అందంగా వున్నట్టివి. పని తీరిన తర్వాత వయసు మళ్లి పడిపోతాయనుకో. అయినా రమణీయంగానే వుంటాయి–" అన్నాను.

లేచి పిల్లడిని లాక్కుని, నాకూ, పిల్లడికీ మధ్యన కూర్చుంది. ఒక పయోధరం పాలు చేపింది, మరొకటి పులకరించింది. విస్తుపోయి చూస్తూ కూచున్నాను.

వర్షర్తువు వచ్చి పడుతూంది. త్వరగా ఇల్లు చేరుకోవాలి. వింధ్యగిరిరాజు వర్షర్తులక్ష్మి పయోధరాల స్పర్శకు పులకిస్తున్నాడు. పచ్చగా మొలకలెత్తుతున్న పచ్చికే ఆ పులకరింపు!

(*గాథాసప్తశతి*: 1-83, 2-40, 3-56, 57, 58, 60, 61, 68, 4-82, 95, 5-9, 25, 27, 28, 29, 6-75, 76, 77, 79, 97, 7-52)

# ఆలింగనమా... నీకు శుభం!

ఏమి చేయను? ఏమి చేయను? అతని సంగతి చెవిని పడగానే ఒళ్లు పులకించి పోతుంది. అతని మాటలు వినగానే అలక ఆమడ దూరానికి పరుగులు తీస్తుంది. అతడు ఎదుటబడితే ఒడలు గడగడలాడుతుంది సంతోష ఔత్సుకాలతో. మరి కౌగిలించుకుంటే, ఏం చెప్పను, ఏమైపోతానో! ఎవరికి చెప్పను ఈ బాధ? చెలులకు చెబుదామా, అంటే– "నీవెప్పుడూ ఇంతేలే, మా మాట విన్నావా, పెట్టావా? అట్లా ఏడిపించుకు తినే వారికి బుద్ధి చెప్పాలి, మన చుట్టూ తిరిగేట్టు చేసుకోవాలి, అని శతవిధాల పోరినా నీడ చూడగానే నీరైపోతావు–" అని దెప్పిపొడుస్తారు.

ఏమి చేయను? వాళ్లు చెప్పినంతా అయింది. నా అశక్తత చూచి, నా అంగాలూ నా మాట వినడం లేదు. రానే వచ్చాడు. ఏమిటేమిటో ముచ్చట్లాడి గట్టిగా కావలించేసుకున్నాడు. వాటికేమి పోయే కాలమో, నా చేతులు రెండూ అతని విశాలమైన వీపుమీద తారట్లాడాయి కొంతసేపు. క్రమంగా, బిగుసుకొనిపోతున్నాయి. నా మాట వినకపోగా, విరుద్ధంగానూ, ప్రతికూలంగానూ పనిచేసున్నాయి. వాటికి మొదటే చెప్పాను, నా వశంలో ఉండాలని, ఉండకపోతే తిండీతిప్పలూ పెట్టక బక్కచెక్కలయ్యేట్టు చేస్తానని. కాని నా మాట వింటేనా? ఈ పాడు చేతులు అతని రాకకోసం, అతని తాకిడికోసం వేచి వున్నట్టు త్రుళ్లి త్రుళ్లి పడ్డాయి; చివరకు వీపు మీద బిగుసుకు పోయాయి.

నాకు నిజమైన అలకలేదని, అంతా నటన అనీ చెప్పకనే చెప్పాయి గదా చేతులు! ఇక నా మాట ఏమి దక్కినట్టు? నిజానికి నాది నటన కాదు. దొంగ అలక కాదు. దృఢమైన కోపం పొంగుతూనే ఉంది. ఏమి చేయను, నా దేహమే నా మాట వినందే?

ఛీ! ఈ చేతులను తిట్టాలి! నేను వద్దన్న పని ఎందుకు చేయాలట! ఊరికే తామర తూళ్లలాగ వ్రేలాడుతూ ఉంటే సరిపోయేదికదా!

మరి ఈ ముఖమో! దానికేమయిందట! ఏడుపెందుకు? కోపంతో గంభ్రగా ఉండు. పలకరిస్తే నోరు తెరవకు. తాకితే చెమర్చకు; ఎఱ్ఱబడకు, ముద్దు పెట్టుకుంటే ఉప్పరం అందుకున్నట్టు ఉబ్బకు - అని ఎన్నోసార్లు చెప్పాను. ఊహూఁ! వింటేనా? ఏమీ చేయలేక ఏడుపు.

ఇది కాదు పద్ధతి. నా మాట వినని వాటిపై కసి తీర్చుకోవద్దూ? వాటికి మంచి శిక్ష పడాలి. గట్టిగా, విడదీయరానంత గట్టిగా అతని వీపుమీద చేతులు బిగించాను- చేతులు పెటపెటమన్నాయి. అయినా పట్టు సడలించలేదు. వాటికి అంతే కావాలి. నా మాట విన్నాయా మరి?

అతడు సంతోషంతో, ఆనందంతో, ఆశాబంధంతో ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. వీపు మీదనేమో నాగబంధంలాగ నా చేతుల బిగింపు, ఎదుట రొమ్ముమీదనేమో కోట తలుపులను ఇనుప గుబ్బల లాగ నా గుబ్బల పెనుబిత్తడి! నిధులను పాతి పెట్టినట్టు నా రెండు మన్మథనిధులను అతని రొమ్ములో లోతుకు, మరీ లోతుకు పాతేశాను.

ఆ ఉద్రేకంలో, ఆ ఉద్వేగంలో, ఆ ఉత్సాహంలో చూడాలి అతని ముఖం! కళ్లు మూతలు పడుతున్నాయి. ముఖం క్షణక్షణానికి రంగులు మారుతున్నది. పెదవులు కంపిస్తున్నాయి. గట్టిగా, తొందరగా విడిపించరాని రీతిగా వేసిన ముడిని విడిపించినట్టు, ఎంతో పోరాడి నా బాహుబంధాన్ని విడిపించుకున్నాడు. నేనూ భూమిలో పాతిన నిధులను అతికష్టం మీద పైకిలాగినట్టు నా గబ్బిగుబ్బలను, అతని రొమ్ములో నాటుకుపోయిన గబ్బిగుబ్బలను, పైకిలాగాను. బాగా అయింది శాస్తి వాటికి, నా కసి తీరింది. కోపం చల్లారింది.

పానకంలో పుడకలాగ ఇదేమిటీ మధ్య, ఈ ముత్యాల హారం? ప్రతిదానికీ అడ్డు వస్తూంటుంది. దేనికైనా వేళా పాళా, మంచీ మర్యాదా ఉండాలి. స్తనమండలానికి శోభ కలిగిస్తుంది కదా అని మెళ్లో వేసుకుంటే, ప్రియుణ్ని కౌగిలించుకుందామంటే, అడ్డు వచ్చి రసభంగం చేస్తే ఎలా? ఎంత గుణవంతులైనా, హృదయంలో మెలిగే వారైనా ఉచితానుచితాలు తెలుసుకోకపోతే దూరంగా ఉంచాలి. అలాగే ఈ ముత్యాలదండనూ తీసి దూరంగా ఉంచాలి. అయినా, తెలియక అడుగుతాను. నా దేహమే నా మాట విననప్పుడు, అంటీ అంటనట్టు మెడలో వ్రేలాడుతూ కదలినప్పుడల్లా అటూ ఇటూ ఊగులాడే ముత్యాలదండ నా మాట వినక అడ్డుపడితే కోపం ఎందుకట? పాపం! అదీ నలిగిపోయింది పయోధరాలతో పాటు.

సరే, నా కోపం మరీ బాగుంది. హృదయాన్ని అతని హృదయంలో పెట్టివేశాను. చూపునేమో అతని ముఖంలో చిత్రం గీచినట్టు అతికించి వేశాను. వాటిని ఏమీ అనలేక, నిజానికి అతని స్పర్శే లేక చిక్కి శల్యమవుతున్న బాహువుల మీదా, తక్కిన అంగాల మీదనా నా కోపం? దీనినే అత్తమీది కోపం దుత్తమీద అంటారు.

ఇకనేం? అలక అణగారిపోయిందిగా. గజరాజు నర్మదను కొట్టి కోరాడినట్లు పోరు ప్రారంభమయింది. చేతులతో అడపా దడపా అదుముకోడం ఏమిటి, మర్దించడమేమిటి, గిచ్చుకోడాలు, కొరుక్కోడాలు ఏమిటి - గజరాజు పనులు అన్నీ నర్మదానది సహించినట్టు సహించాను. ఆ హాయి వేరు!

తర్వాత ఒకనాడు అన్నాడు గదా- "అంతయినా, ఆ నాడు నీవు ముఖం తిప్పి, నాకు వీపు చేసి పడుకున్నావు. అలక అలలు తగ్గుతూ వచ్చాయి. దొంగ నిద్ర నటిస్తున్నావని నాకూ తెలిసింది. ఏదో సాకుతో నా వైపు తిరగాలి. కాని ఇంకా తగ్గని బింకం అడ్డు పడుతూంది. అటువైపు నుంచి ఇటువైపు పొర్లే సాకుతో నా రొమ్ముకు నీ పాలిండ్లు తాకించావు. ఆ అప్రయత్న స్పర్శసుఖాన్ని ఎప్పుడూ మరువను!"

నదులలో జలకాలాడేటప్పుడు నీళ్లలో కౌగిలింతలు ఆనందానికే గిలిగింతలు సుమా! గొంతు వరకు నీళ్లలో మునిగి వుంటామా. ప్రియుడు చేపలాగ పాకుతూ వచ్చి రొమ్ము చుట్టేసుకొని కౌగిలించుకొంటూంటే, చెంపలు పులకరించి ఉబ్బిపోతాయి. ఆనందతన్మయత్వంలో కళ్లు పెద్దవై నిశ్చయంగా నిలిచిపోతాయి. ఈ సాత్త్వికభావాలు ఎవరైనా గట్టుమీది వారు అట్టే పసిగడతారేమో! అయినా ఇంతటి ఆలింగన సుఖం అనుభవిస్తున్నప్పుడు, ఎవరు పసిగడితే ఏం? పసిగట్టి ముసిముసి నవ్వులు ఒలికిస్తే ఏం?

ఓ ఆలింగనమా, నీవు క్షేమంగా వుండు; భద్రంగా వుండు; నీవు అలక అనే పెద్దమానులను కూల్చి వేసే పెనుగాలివి. దేహంలోని ప్రతి అంగానికి సంతృప్తి కలిగిస్తావు. ఉడికిపోతున్న అంగాలన్నీ నీ వల్ల చల్లబడుతాయి. మరి నీ ముఖ్యమైన స్వరూపం చెప్పడం మరిచాను. నీవు రతినాటకానికి పూర్వరంగానివి. ఓ రతి నాటకపూర్వరంగమా! ఆలింగనమా... నీకు శుభమగు గాక!

(*గాథాసప్తశతి*: 3-76, 4-44, 54, 68, 5-29, 85; 6-48, 58; 7-58)

# అలిగిన మనసు - అలిసిన సొగసు

ప్రేమగతి విచిత్రం! ఎలా పుడుతుందో, ఎలా పెరుగుతుందో ఎలా కూలిపోతుందో ఎవరూ చెప్పలేరు. ప్రియులు పరస్పరం- చూచుకొనకపోతే ప్రేమ పోతుంది. పెక్కుసార్లు చూచినా పోతుంది. ధూర్తులు చెప్పే కొండేల వల్ల పోతుంది. కారణం లేక ఉత్తుత్తినే పోతుంది. కొందరు అనడం ఏమిటంటే, మహిళల ప్రేమ ప్రియుడు తరచూ చూడకపోతే పోతుంది అని. నీచుడి ప్రేమ తరచూ చూడడం వల్ల పోతుంది. తరచూ చూడడం వల్ల వాడికి ఉపేక్ష కలుగుతుంది. దానితో ప్రేమ సడలిపోతుంది. మూర్ఖులు చెప్పుడు మాటలు విని కోల్పోతారు. వారికి స్వయంగా వివేకం వుండదు. కనుక వాళ్ల, వీళ్ల మాటలు విని ప్రేమ కోల్పోతారు. ఇక దుష్టుల సంగతి చెప్పనక్కరలేదు. నిష్కారణంగానే వారి ప్రేమ పోతుంది.

కనుక ప్రేమను జాగ్రత్తగా కాపాడుకోవాలి సుమా! సింగారంలోనే కాలం వృథా చేయకు. ఉత్కంఠ తగ్గిపోతే నిన్ను ప్రియుడు చూడడు. తమకం తగ్గరాదు. అదీ ప్రేమను కాపాడుకోవడానికి మొదటి వ్యూహం. ప్రియుడు ఎంతో వేగిపోతున్నాడు నీ కోసం. ఇంకా బింకం చూపకు. బింకం చూపిన కొద్దీ బెడిసి కొడుతుంది. వీణను బిగించిన కొద్దీ తీగలు సరిగా పలుకడం అటుండగా తెగిపోతాయి. ఔత్సుక్యం తగ్గిందా మనసులో నీ బొమ్మ చెరిగిపోతుంది; నీకు స్థానం లేకపోతుంది.

ఏమి అనుభవించాలన్నా, అనుభవింపజేయాలన్నా యవ్వనం ముఖ్యం. ఆ యవ్వనం నదీప్రవాహం వంటిది. బుస్సున పొంగుకు వస్తుంది; త్వరలోనే చల్లారుతుంది; మళ్లీ తిరిగి రాదు. పగలూ, రాత్రీ ఒకదానితో ఒకటి స్పర్ధతో వున్నట్టు వెళ్లిపోతుంటాయి. మరి ఎందుకీ పాడు అలక? ఎందుకీ తగలబడిన బింకం? దీని వల్ల ఏమన్నా అయ్యేనా, నీవే చెప్పు.

నీ ప్రియుడు బహువల్లభుడు. ఈ సంగతి నీకు తెలుసు. నీవు ఎక్కువగా అలిగి కూర్చున్నావా, నీ సవతులు ఈ అవకాశం ఉపయోగించుకుంటారు. కనుక వాళ్లు

నవ్వేట్టు చేయకు. నీ ప్రియుడేమో నీ కోసం ఎదురు చూస్తున్నాడు. ఎప్పుడెప్పుడు వస్తావా, ఎప్పుడెప్పుడు అనుగ్రహిస్తావా, ఎప్పుడు ప్రేమ వర్షం కురిపిస్తావా అని వేయికళ్లతో చూస్తున్నాడు. నీ మానం (అలక) మరీ ఎక్కువయితే, నీకే చేటు. నీవు కృశించిపోతావు. అలకా, కోపం, బిగుమానం మరీ పెరిగి పోయాయా, శరీరాన్ని వేడెక్కిస్తాయి. ఉద్రిక్తత పెరుగుతుంది; తిండి సయించదు! శరీరం కృశించిపోతుంది. ఎలాగో తెలుసా? నీవు పెద్ద ధాన్యరాశి వనుకో, ఏదో పెద్ద మానంతో (కొలమానంతో) కొలుస్తూ మరొక చోట సర్దుతామనుకో. పెద్ద రాశి తరిగిపోదూ? అలాగే అభిమానం–బింకం వల్ల నీ అంగాలూ తరిగిపోతాయి.

"ఏం చేయను? ఎన్ని తప్పులని మన్నించను? చేసిన తప్పులను చూడనా? చేస్తున్న తప్పులను చూడనా? చేయబోయే తప్పులను ఊహించినా, సిగ్గు లేని వాడు. ఎప్పుడూ తప్పులే, ఎప్పుడూ క్షమాపణలే. ఎప్పుడూ చేతులు నలుపుకుంటూ విన్నపాలే. పొగరు సుమా ప్రేమించే వాళ్లు ఎక్కువవుతున్నారు అని! మరి తప్పులు చేయక ఏమవుతుంది? ఒకరిని సంతోష పెట్టడమంటే మరొకరు దానిని కోల్పోయారనే గదా?" అంటావు కదూ!

నిజం. స్త్రీ సహనశీల. అన్నిటినీ సహించడానికే మనం వున్నాం. నీవేమో ప్రియుడు అలా వుండాలి, ఇలా వుండాలి అనుకుంటావు. అధికారం చూపరాదు. వాస్తవంలో భర్తకు లేని అధికారం ఏముంటుంది? భార్య సర్వస్వం తనదే కదా. సర్వాధికారాలూ చలాయించవచ్చు. కాని ప్రేమ గల వారు అధికారం చూపరు. పల్లెత్తు మాట అనరు. ప్రియురాలు అలిగితే, సేవకునిలాగ వినయంగా, గోముగా ప్రవర్తిస్తారు. అలక పోగొట్టడానికి శతవిధాలుగా ప్రయత్నిస్తారు. దానిలోనే ప్రేమ సాఫల్యం, అలాటి వాళ్లే ప్రియులు. అలాటి గుణాలు లేని వాళ్లు మొగుళ్లు మాత్రమే. ఎప్పుడూ తమ పెత్తనం చూపడానికే ప్రయత్నిస్తారు. మంచిమాట పలకడానికి మగసిరి అడ్డువస్తుంది. అలాటివాడు కాకూడదు ప్రియుడు–అంటావు.

అలాటివి చాలా అదృష్టవంతురాండ్రకు తల్లీ! అత్యాశలు కూడదు. ఆశ మన అదృష్టాన్ని బట్టి, ఎదుటివాడి హృదయాన్ని బట్టి తీరుతుంది.

★ ★ ★

ఎంత మంచిమాట, ఎంత చల్లని మాట, ఎంత మంచి కాలంలో, ఎంతమంచి పద్ధతిలో చెప్పావో! అయినా, నాకోపం చల్లారలేదు. దగ్గరికి వచ్చి కౌగిలించుకో బోయాడు. కోపంతో రెండు చేతులతోనూ రొమ్మును చరిచాను. అతని మనస్సూ మారినట్టుంది. కొడుతూన్న నా చేతిని పుచ్చుకొని సుతారంగా నిమురుతూ, పాపం నొప్పయిందా అంటూ నోటితో ఊదడం ప్రారంభించాడు ఉఫ్ ఉఫ్ అంటూ. నాకు నవ్వు ఆగలేదు. రెండో చేతిని వీపు మీద పోనిస్తూ మెడ వంచి రొమ్ముకు హత్తుకున్నాను. ఇల్లాలి అలక ఆలింగనంతో-సరి!

(*గాథాసప్తశతి*: 1-21, 45, 81, 82, 86, 90; 2-25.)

# వెక్కిరిస్తున్న రెల్లు పువ్వులు

వర్షాకాలం గడిచిపోయినా, కొండమల్లెలను తలుచుకుంటేనే నా గుండె కొట్టుకుంటుంది. "ఓయి, అరసికుడా, మగువల మనసు తెలియని మూర్ఖుడా, వర్షాకాలంలో నీ ప్రవాసమేమిటిరా? వర్షాకాలంలో ప్రియురాలి వెచ్చని కౌగిలిలో పడి వుండే అదృష్టానిక్కూడా నోచుకోవాలోయ్ వెర్రివాడా! వెలుపల చిటపట చినుకులు పడుతూంటే పందిరి పట్టెమంచం మీద బూరుగుదూది పరుపుపై ప్రియురాలి పొగలేని కుమ్ములవంటి పయోధరాలపై చెంపలు, రొమ్ము ఆనించి పడుకునే భాగ్యం కూడానా నీకు! ఎప్పుడూ వ్యాపారం! వ్యాపారం! పరదేశవాసం! ప్రవాసం! అహ్హాహ్హా!–" అంటూ వర్షాకాలంలో విరగబూచే కొండమల్లెలు నన్ను చూసి వికటాట్టహాసం చేసినట్టు ఉంటుంది. మరేం చేయను? పని పూర్తి కావాలి కదా! వర్షాకాలం లోపల పని తెమలదు, తెమలినా, వర్షాకాలంలో ప్రయాణం ప్రమాదకరం. శరత్కాలంలో గాని ఇల్లు చేరలేకపోతున్నాను.

ఈ శరత్కాలం – అబ్బబ్బ! మహాఘోరం, ఉన్నత పయోధరాలున్న యౌవనంలాగ వర్షాకాలం గడచిపోగా, వయస్సు మళ్లగా భూదేవి నరసిన కురులలాగ కనిపించే తెల్లటి రెల్లుపూలు నా హృదయాన్ని పిండేస్తాయి. నీ ప్రియురాలి యౌవనం వృథా చేస్తున్నావు – అని రెల్లుపూలు నన్ను వెక్కిరిస్తున్నట్టు బాధ పడుతున్నాను– ఇంటిదారి పడుతూ.

ఏమిటి ప్రకృతి నా పైన కక్షకట్టిందా? కొలకులని కలువపూలు ముకుళించాయి. వాటి కొనలపై మదించిన తుమ్మెదలు కదలక మెదలక వాలివున్నాయి. చంద్రుడు తరిమి తరిమి నాశనం చేయగా మిగిలిపోయిన చీకటి ముళ్లలాగ కనిపించాయి అవి. వానలు ఆగగానే అంతవరకు ముడుచుకు దాగివున్న చెట్ల తొర్రల నుంచి విసురుగా వెలుపలికి వస్తున్న చిలుకలబారు, ఋతువు మారగానే జ్వరం తగిలిన పెద్దపెద్ద మానులు వాంతి చేసుకుంటున్నట్టు కనిపించింది. పాపం! ఊళ్లో నా ప్రియురాలి ఆరోగ్యం ఎలా వుందో!

అదిగో! నాలాగే ఆ కొంగ కూడ ఒంటరిగా చెరువులోని తామరాకుపై ముడుచుకుపడి వుంది. నిశ్చలంగా, నిశ్శబ్దంగా, నిర్మలంగా- తళతళలాడే మరకతపు పళ్లెంపై పెట్టిన శంఖంలాగ కనిపిస్తూంది. దానికెందుకో విరహం?

ఆహా! ఎంత నిశ్చలంగా వుంది ఈ వూరి చెరువు! ఎవరో ఆకాశాన్ని లాగి చెరువులోకి విసరివేసినట్టుంది! అంతగా విసరి వేసినా, ఒక కమలమూ నలగలేదు. ఒక్క హంస ఎగిరిపోలేదు. ఆకాశంలోని గ్రహనక్షత్రాలు చెరువులోని తామరలూ, హంసలు అయ్యాయా? ఆశ్చర్యమే!

వానలు వెలిసి శరత్కాలపు ఎండ పొడ పడగానే పైనుంచి ఎండకోసం సాలీడు కిందికి జారుతూంది వెల్లకిలగా. కాళ్ల కదలిక కనిపిస్తూంది కాని, అది జారి వచ్చే దారం కనపడడం లేదు. కనిపించని దారంతో గుచ్చిన పగడ పూవులాగ ఎంత అందంగా వుందో! వెల్లకిలగా జారుతూ కాళ్లు కదలిస్తున్న దృశ్యం నాకు ఒకనాటి ప్రియురాలు లతావేష్టితకం కాళ్లూ చేతులూ కదిలిస్తూ దిసమొలగా నా ఒంటికి అల్లుకు పోవడం - గుర్తుకు తెస్తూంది.

చెరువులోని నీళ్లు చేతులు పెట్టగానే లోపల చల్లగాను, వెలుపల వెచ్చగాను వున్నాయి. సత్పురుషుల హృదయాలు కోపం వచ్చినప్పుడు పైకి వేడిగా వున్నా, లోపల చల్లగా వుంటాయంటారు. అలా వున్నాయి. నాకేమో నా ప్రియురాలి కౌగిలింతల్లాగ, ముద్దుల్లాగ వున్నాయి. కౌగిలింతలూ, ముద్దులూ పైకి వెచ్చగా వుంటాయి. కాని కొద్ది క్షణాల్లోనే ఒంటిపైన అమృతం చిలకరిస్తున్నట్టుంటాయి.

కొంచెం దూరంలో కనిపిస్తున్న వింధ్యపర్వతం చుట్టూ దావాగ్ని పొగలు కమ్ముకున్నాయి. పైన ఏమో తెల్లటి మేఘాలు ముసురుకున్నాయి. దాన్ని చూడగా, పాలకడలిని చిలుకుతున్నప్పుడు పాల తరకలు పడిన మథుమథనుడులా కనిపిస్తుంది. ప్రియురాలు వింధ్యపర్వతం చుట్టూ ముసురుకున్న తెల్లటి మేఘాలు చూచి నా రాకను ఎదురు చూస్తూంటుంది. చెలులు సమాధాన పరుస్తుంటారు-వానలు వెలిశాయి గదా. చూచావా ఆ తెల్లటి మేఘాలు. ఇక భయపడకు దారిలో వుంటాడు. త్వరలో వస్తాడు- అని. ఏం చేయను? త్వరపడుతూనే వున్నాను కదా!

ఎటు చూచినా సైంధవలవణ పర్వతాల లాగ ఉతికి ఆరవేసిన దూదిపింజల్లాంటి మేఘాలు, వీటిని చూచి ప్రియురాలు ఊరట పొందకుండా వుంటుందా?

ఈ ప్రకృతికి అంతటికి దారిలోని ఈ పొలం రైతన్న ఒక్కడే హాయిగా వుంటున్నట్టున్నాడు. వరి పంట బాగా పండింది. అప్పుడే దంచిన కొత్త బియ్యంలాగ వున్న వెన్నెల. రాత్రిళ్లలో హాయిగా గొంతెత్తి పాడేస్తున్నాడు. ఏమిటోయ్! ఇంతటి మంచి రాత్రిని వృథా చేస్తున్నావే? ఇల్లాలు ఎలా సహిస్తుందో!

శరత్కాలంలో దోస తీగ ఏపుగా పెరిగి చుట్టుపట్టున్న ఏ ముసలి మానునైనా, ఏ పొట్టిమోదు నైనా అల్లుకుంటుంది. నల్లకలువల పరిమళాలు దిగంతాలకు వ్యాపిస్తున్న సరఅం (శరత్కాల) ప్రభావమది. అలాగే నల్లకలువ వాసనలతో గుమగుమలాడే సరఅం (చెరకు సారాయి) సేవించిన ఆ నవ యువతిని చూచారా? ఆ ముసలి గూని వగ్గును పెనవేసుకుంటున్నది? అది ఆ యువతి తప్పు కాదు. ఆ సరఅం ప్రభావం!

★ ★ ★

ఇక మరింత త్వరపడాలి. అక్కడ నా ప్రియురాలు సరఅం సేవిస్తే ఏ స్థితికి వస్తుందో! ఆలస్యాదమృతం విషమన్నారు పెద్దలు!

(*గాథాసప్తశతి* 1-4, 63; 2-10, 17, 86;
5-34, 6-34, 61, 62; 7-79, 89)

# కొండమల్లెల అట్టహాసం

అబ్బ! ఈ వర్షర్తువు ఎందుకు వస్తుందో అని అనిపిస్తుంది. కొత్తగా, నల్లగా ముసురుకొని వస్తున్న మేఘాల గర్జనం, ప్రియురాలు దగ్గర లేనందున, ఉరితీయడానికి తీసుకొని వెళ్లేవారు వాయించే తప్పెట మోతలాగ వినిపిస్తుంది. పాపం! ఆ మధ్య ఒక ఇల్లాలు పిచ్చిగా తిరిగేది వర్షాకాలం రాగానే, దయ్యం పట్టిందేమోనని అనుకునే వాడిని. అదేమీ కాదట. భర్త ప్రవాసంలో వున్నాడు. ఇంతలో వర్షాకాలం వచ్చింది. మొదలే విరహిణి, మేఘగర్జనకు వెంటనే పిచ్చిదైపోయింది! నాకూ అలాగే పిచ్చిపడుతుందేమో ననిపిస్తుంది.

ఇదిగో! మేఘరాజా! నీ బలమంతా ఉపయోగించి, నాపై గట్టిగా గర్జించు. నా ప్రియురాలు దూరంగా ఉంది. ఏమీ తెలియని అమాయిక. నీ ఉరుములతో మెరపులతో భయపెట్టకు. నాకు తెలుసు ఆవిడ నల్లటి ముంగురులు చూసిన నువ్వు మండిపడుతావని. అయినా ఆవిడను చంపక! ఎందుకంటావా? ఒక వర్షాకాలంలో నేను దగ్గర లేను. నీ వేమో నల్లగా భయం కొలుపుతూ ఆకాశాన్ని కప్పివేశావు. ఇక జీవించనని నిరాశ చేసుకుంది. కాని, పిల్లడు ఉన్నాడు. తాను ప్రాణాలు వదిలితే వాడిని చూచే వారెవరూ? అందుకని ఎలాగో ప్రాణాలు నిలుపుకొంది. కనుక కరుణించవయ్యా!

ఈ కొండమల్లెలను చూస్తే ఒళ్లు మండుతుంది. పని పూర్తి కాలేదు. అయినా వర్షాకాలం గదా, ఒంటరిగా ఎలా గడపడం అని త్వర త్వరగా ఇంటికి పోదామని బయలుదేరుతున్న నన్ను చూచి ఈ కొండమల్లెలు విరగబడి నవ్వినట్లనిపిస్తుంది.

కడిమి పూవులూ అంతే. తక్కిన పూల సంగతి చెప్పలేను గాని వర్షాకాలంలో మన్మథుడు తన ఐదు బాణాలూ వదలి కడిమి పూవులతో ఉండేలు దెబ్బలు కొడుతున్నాడనిపిస్తుంది. ఒకవైపు బాధగా వున్నా, కొండవాగుల సుడులలో కడిమి పూవులు గుత్తులు గుత్తులుగా పడి మునుగుతూ, తేలుతూ వస్తూవుంటే, జీవిత సుఖదుఃఖాలు చెబుతున్న వేదాంతుల గుంపులా అనిపిస్తుంది.

కడిమిపూలంటే, పాత ముచ్చట ఒకటి. ఎందుకో అలిగింది నా మీద. నన్ను చూడగానే రెండు కళ్లూ మూసుకుంది. ఉత్తుత్తి అలకేగా మరి! ఒళ్లు కడిమిచెట్టులా పులకించిందట. కళ్లయితే కప్పుకుంది చేతులతో కాని ఒళ్లంతా ఎలా కప్పుకుంటుంది? విరగబడి నవ్వాను. అలక అంతటితో సరి.

ఈ పాడు వర్షాకాలంలో ఈ బాధ ఇలా వుండగా, మరొక బాధ– బాటసారులకు తలదాచుకోడం కష్టం కావడం. పాపం! ఆ ఇల్లాలూ ఒంటరిగా వుంది. ప్రియుడు ప్రవాసితుడు. జడివానా, గాలీ ఎడా పెడా కొట్టాయి. పూరికప్పు అక్కడక్కడ ఎగిరిపోయింది. ఏడుస్తూ ఏమీ చేయలేక నిస్సహాయంగా కూర్చున్న ఇల్లాలిని మెరపులు బయటివారికి పట్టి చూపుతున్నట్టు అనిపించింది. చూతును గదా, ఆవిడ గోడమీద రెండు చేతులూ ఆనించి దేనినో కప్పుతున్నట్టు అనిపించింది. ఆమె భర్త తన రాక గడువు దినాలు గోడమీద వ్రాసి పెట్టాడట. అవి కారుతున్న నీళ్లు పడి తడిసి మాసిపోతాయేమోనని చేతులతో కప్పుతూ కూచుంది. ప్రేమ ముదిరినా, మరేది ముదిరినా కష్టమే!

అంచెలు అంచెలుగా ఊరు చేరదామని బయలుదేరాను. వీథిలో ఎలా రమణీయ దృశ్యాలు చూచి ఆనందించానో, కరుణ దృశ్యాలు చూచి అలా ఆవేదన పడ్డాను. ఒక చోట వర్షానికి వరద వచ్చి, చెట్టు మీద చెట్టు కూలింది. చెట్టు కూలడంతో చెట్టు మీద కాకిగూళ్లు వరదలో కొట్టుకుపోతున్నాయి. కాకులు కావు కావుమంటూ, తమ ప్రాణాలకు కూడ తెగించి తమ పిల్లలను రక్షించుకుందామని వరదతోనే కొట్టుకొని పోసాగాయి.

మరొకచోట, వర్షం పడింది గదా అని కర్షకుడు పొలం చదునుచేయడం ప్రారంభించాడు. నాగలి బురదలో బాగా కూరుకుపోయింది. దానిని లాగలేక లాగలేక చివరకు పైకి లాగి, అలసి సొలసి ఇంటికి వచ్చి, పడుకున్నాడు ఉసూరుమంటూ. భార్య మనసు కుత కుత లాడింది. వర్షాకాలం గదా! ఏవేవో ఆశలు అల్లుకుంది ఇంట్లో పగలంతా. భర్త అలసివచ్చి, ముసుగు తన్నగానే, వర్షాకాలాన్ని తిట్టసాగింది.

పచ్చనిగడ్డి మరకతపు సూదుల లాగ, వాటి కొసల్లో పడిన నీటి బిందువులు ముత్యాలలాగ మెరిసి పోతున్నాయి. వాటిని నెమళ్లు నీలాల మెడలు పొడిగించి ఏరుకొని మింగుతున్నాయి. ఎంత అందంగా వుందో!

ముసురు వల్ల సూర్యుడు కనిపించడం లేదు! చంద్రుడూ, తారకలూ కనిపించడం లేదు. కొంగలు బారులు కట్టి సాగిపోతున్నాయి. దానిని చూస్తే కాలుడు ఆకాశమనే పలకపై గ్రహనక్షత్రాల లెక్కలు కడుతున్నాడేమో అనిపించింది.

ఉరుములకు వెర్రెత్తిపోయిన నెమళ్లు పురివిప్పి నాట్యం చేస్తున్నాయి ఒకవైపు. దోమలు గుంపులు గుంపులుగా దున్నలపై మూగాయి. దున్నలు కొమ్ములు ఆడిస్తూ తోలుతుంటే, దోమల సంగీతం వీణానాదం లాగ వినిపించింది. కాకులు తప్పతడిసి పోయాయి పైన కురుస్తున్న వానకు. వాటి రెక్కలు కిందికి వాలిపోయాయి. మెడలను లోపలికి కుంచించుకొని పొలాల కంచెల మీద కూర్చున్నాయి. వాటిని చూస్తే కొరతలో పడ్డాయా అనిపించింది.

ఒకచోట ఒక పాంథుడు ఇక ఇల్లు చేరుకోలేను, ప్రియ ముఖం చూడలేను అనే నిరాశతో కడిమి పూవులను దోసిలి నిండా తీసుకొని, వాసన చూస్తూ, కన్నీళ్లు కురిపిస్తూ వున్నాడు. వెళ్లి వీపు తట్టి భయపడవద్దని సమాశ్వాస పరిచాను. నేనే ఆ స్థితిలోనే వున్నాను. అంతకన్నా ఏమి చేయగలను?

మరొక చోట మాకు ఆశ్రయమిచ్చిన మరొక ఇల్లాలి పరిస్థితి మరీ దయనీయం. కప్పు కారుతూంది. ఆవిడ పిల్లడిని ఎత్తుకొని, తలపై ముసుగు కప్పుకుంది. కాని, ఏమి ప్రయోజనం? తన కన్నీళ్లు ఆ కుర్రవాణ్ని తడిపి వేస్తున్నాయి. దానిని ఆవిడ చూడడం లేదు.

వర్షం విపరీతంగా పడింది. మిట్టా, పల్లం అంతా ఒక్కటైంది వరదలకు. జనం రాకపోకలు తగ్గాయి. మనసులోని కోరికలలాగే దారులను దాటడానికి సాధ్యం కావడం లేదు. తప్పదు. వేచి వుండకతప్పదు. కాని, ఎటు చూచినా, కొండ మల్లెలు! గుండెలను పిండి చేస్తూ నవ్వే కొండమల్లెలు!

(గాథాసప్తశతి: 1-29, 37, 2-2, 70, 77, 4-14, 15,
24, 36, 94, 5-35, 36, 6-37, 38, 59,
60,63, 65, 80, 83, 84, 7-21, 73.)

# ఆ నాటి సాహసం

**క**ళ్లు మూసుకుంటే, ఆ నాటి సాహసాలు స్ఫురణకు వస్తాయి. ఇప్పుడు అలాటివి చేయగలమా? చేయడం అవసరమూ లేదు. అంత సాహసం చేసి పొందిన ప్రియుడు జీవిత సహచరుడయ్యాడు గదా!

సాహసానికి కారణం అతడి సౌభాగ్యగుణాలే. కారుచీకటి. హోరున వర్షం కురుస్తూంది. గోదావరి నిండుగా, ప్రచండంగా పారుతూంది. ఉండలేకపోయాను. నిలువలేకపోయాను. ఎటు చూచినా దిక్పాలకుల లాగ అతని రూపే. కలుసుకోవాలి. సంకేతస్థానానికి వచ్చి వుంటాడు. తప్పదు మాట. నేను జాగు చేస్తే ఎలా? వెళ్లాలి. ఆడదానికి ఇంత సాహసమా? ఎక్కడా లేదే? లేదు. నిజం. స్త్రీ సహజం కాని సాహసం నేను చేశాను. నల్లటి అవకుంఠనమూ నా ఒడలి పసిమిని, మిసిమినీ కప్పలేకపోయింది. కానున్నది కాక మానదు. తెగించాను, బయలుదేరాను. భయంకరంగా ఉరుములు, మెరపులు, పిడుగులు! కుండపోతగా వర్షం. గోదావరి గట్టు చేరాను. ఎలా నీటిలో దూకానో, ఎలా ఈదానో, ఎలా ఆవలిగట్టు చేరానో, ఆ ప్రేమ సమ్రాట్టుకే తెలుసు. నీటిలో పడడ మొకటే నాకు గుర్తు. కళ్లు తెరిచాను. ప్రియుని బాహుబంధంలో వున్నాను. అమ్మయ్యా! అంతటి వానలోను, అంతటి గోదావరివరదలోను చల్లారని వేడి చల్లారింది. జీవితం ధన్యమనిపించింది. ఆనందంతో కళ్లు మూసుకున్నాను. కొన్ని దశాబ్దాలు గడిచాయి.

కాని, ఆ నాటి చెలులు నేడు లేరు. ప్రియునితో విచ్చలవిడిగా విహరించిన ఆ నాటి గోదావరిగట్టు మీద పొదరిళ్లూ లేవు. వాటి ఎండిన మోడులు మాత్రం మిగిలాయి. వయస్సూ మళ్లింది. ప్రేమించిన వాడూ లేడు. ప్రేమను పెల్లగించుకు పోయాడు సమూలంగా. ఆ నాడు ప్రియుడు ముద్దుల వర్షాలు కురిపించిన పయోధరాలు, జఘనం, నితంబం, పెదవులూ నేడు వాడిపోయి మన్మథుని సౌధశిథిలాల మూలబంధాలుగా కనిపిస్తున్నాయి.

గోదావరీతీరం నుంచి తపతీనదీతీరానికి కాపురం వచ్చానా? జీవితమంతా ప్రేమమయంగా, సుఖమయంగా గడిపానా! కాని, నిజం చెబుతున్నాను. మరణానికి సిద్ధంగా వున్నాను. ఆ సత్యం చెప్పనక్కరలేదు. ఇంకా నాకు ఆ నాటి గోదావరీతీర నికుంజాల పైనే మనస్సు పారాడుతున్నది. ఇంకా ఆశ తీరలేదు. తపతీనదీ పుణ్యతటంలో వున్నా మనస్సు మారలేదు. అంత బలమైంది అతని ప్రేమ. అంత శక్తిమంతమైనవి అతని గుణాలు.

ఆ మధ్యన పాతనేస్తం ఒకతె వచ్చింది. చూచి విస్తుపోయింది. "ఏమిటే ఇలా అయిపోయావు! ఎంత అందంగా వుండేదానివి! వంపుసొంపులతో ఎంత కనుల పండువుగా వుండేదానివి? ఇప్పుడెలా వున్నావో తెలుసా, పాత వారంతా వలసపోయి పాడుపడిన గ్రామాలున్న జన్మభూమిలాగ వున్నావు" అన్నది.

నా పేగులు కదలిపోయాయి. అన్నాను గదా! అంతా క్షణభంగురం. ఆయనా పోయాడు. ప్రేమా పోయింది. స్వప్నంలో నిధి దొరికినట్టు గడచిపోయిందంతా. అతడు లేనిది ఏ ఉత్సవమూ, ఏ పండగా అందంగా వుండదు. జీవితం తెల్లవారిన తర్వాత వున్న పున్నమి చంద్రుడిలాగ వెలవెలబారి పోయింది. ఏమీ బహుమతి ఇవ్వని సంతోషంలాగ, అంత విరసమైన కామంలాగ విరసమై పోయింది...

ఆ నాడు–చిన్నతనాన అతనిని కలుసుకోవాలని తహతహలాడాను. ప్రేమ విషం లాగ ఒళ్లంతా వ్యాపించింది. ఏడిచేదాన్ని. దుఃఖ పడేదాన్ని. కోపం చేసుకొనేదాన్ని అందరినీ. ఎవరూ నన్ను అడ్డుపెట్టేవారు కారు. నా ప్రేమ అంత బలమైంది...

మొదట్లో అందరూ ప్రోత్సహించిన వారే పరోక్షంగా. నా సాహసాలు చూచి, విని భయపడ్డారు. ఏదో అనడం ప్రారంభించారు. మొదట ఎందుకు నోరు మూసుకుని మూగల్లాగ వున్నారట? తర్వాత ఇరుగూ పొరుగూ అంటారని భయపడి నన్ను తప్పించాలని చూచారు. ఇదివరకే చెప్పానుగా, విషంలాగ వ్యాపించింది ఒళ్లంతా ప్రేమ అని. మరి ఇక అది ఆగదు. మెదడుకు ఎక్కింది. మనస్సును మార్చింది...

అతనికోసం ఎంతో మారాను. ప్రవాసానికి వెళ్లినప్పుడల్లా చాల బాధ పడేదాన్ని. ఒక్కొక్కప్పుడు అనుకొనేదాన్ని – నేను సహధర్మచారిణిని కావడానికి ముందు సాహసాలెన్నో చేసి మురిపించాను గదా! ప్రవాసం నుంచి త్వరగా పని ముగించుకొని రారాదూ? తాగి తలకుపోసుకొనేంత సంపద ఉండగా, వ్యాపారమెందుకు? వ్యాపారం కోసం ప్రవాసమెందుకు? కాని, పురుషుడు ఉద్యోగిగా–పరిశ్రమశీలుడుగా వుండాలని సమాధానం.... ఏమనను?

అతడు తప్పులు చేయకపోలేదు. తప్పులు చేసినా అతడు లేనిదే బతకలేను. అలాటి అనుబంధం మాది. నా జీవితం, సాహసం, సర్వమూ మీదు కట్టాను గదా! అలాటివాడిని ఎలా వదులుకుంటాము? నెమ్మదిగా, అనునయంతో తిప్పుకోవాలి. అనురాగంతోనే ఆత్మీయుణ్ని చేసుకోవాలి. నిప్పు చెడ్డదే. అంతా బుగ్గి చేస్తుంది. ఊరు ఊరే కాల్చి పారేస్తుంది అంటుకుంటే. అలా అని నిప్పును వదులుకుంటామా? నిప్పులాగే ప్రియుడూ అపరిత్యాజ్యుడు గదా....

సరే, అవి గతకాలగాథలు. ఇప్పుడు వ్యథ మాత్రమే మిగిలింది.

(గాథాసప్తశతి: 1-68, 2-63, 3-31, 32, 33, 39, 4-40, 5-23, 6-16, 7-96)

# ఇంతలో ఎంత మార్పు!

ఆహా! కాలం ఎంత విపరీతమైంది? మార్పు దాని లక్షణమా? మనుషుల మనస్సు లక్షణమా? కాలం ఏం చేస్తుంది ఇంతకూ? అదే సూర్యుడు, అదే చంద్రుడు, అవే ఋతువులు, అవే సంవత్సరాలు! అవి తిరుగుతూనే వున్నాయి ఎప్పటిలాగే. మారుతున్నది మనుషుల బుద్ధులే.

ఔను! ఆ కాలం వేరు. నీవు నేనంటే పడి చచ్చేవాడివి. నా ముఖం చూస్తూ, నా కళ్లు చూస్తూ వుండేవాడివి. ఏవేవో కవిత్వాలు పుట్టుకువచ్చేవి. నా కపోలాలు అంటే నీకు మరీ ఇష్టం. అలా వేళ్లతో సున్నితంగా తడుముతూ ఆనందించే వాడివి, అలా చూస్తూనే కాలం గడిపేవాడివి. నీ వెచ్చని చూపులు నా బుగ్గల మీద నాట్యం చేస్తున్నట్టు నేను పొంగి పోయే దానిని... మరి ఇప్పుడేమిటి? నేను కానా? అప్పటి దానినే కదా! అప్పటి బుగ్గలే కదా! మరి ఆ చూపు ఏదీ? ఆ వెచ్చని చూపులు మరి ఏ సౌభాగ్యవతి చెక్కులపై చెక్కు చెదరకుండా నిలిచాయో!

ఓ అందగాడా, ఎన్నెన్ని మాటలు చెప్పేవాడివి? నా మాటల్లో, చేతల్లో, భావాల్లో-సర్వంలో నీకు గుణాలే కనిపించేవి. ప్రతిదీ అద్భుతమే. ప్రతిదీ గొప్పే. ప్రతిదీ మహా మనోహరమే. క్షణం ఆలస్యమైతే, లిప్తకాలం కనిపించకపోతే ఎంత తహతహలాడే వాడివి? ఎంత ఊగిపోయే వాడివి, వేగిపోయే వాడివి? ఏదో ప్రళయం ముంచుకు వచ్చినట్టు, మిన్ను విరిగి మీదపడినట్టు, గుండె ఆగిపోయినట్టు, మెదడు మరిగిపోయినట్టూ వుండేది నీకు. ఇక రహస్యక్రీడలలో నంటావా, అంతా గుమగుమే. ఏమి గుసగుసలు. ఏమి రుసరుసలు, ఏమి పసదనాలు, ఏమి కసురులు? అవన్నీ చివరికి ఇలా అయ్యాయి. ఏమయ్యాయి? గాలిలో కలిసిపోయాయి. ధూళిలో దూరిపోయాయి. ప్రేమ! ప్రేమ! ప్ప్రేమ్మ!

నేను కపటకోపం చూపేదానిని. ఉత్తుత్తినే అలిగి కూర్చునే దానిని. ఏదో తప్పు చేసినట్టు, ఏదో కానిది జరిగినట్టు, ఏదో ముంచుకు వచ్చినట్టు చుట్టూ ప్రదక్షిణాలు

చేసేవాడివి. చేతులు నలుపుకుంటూ, వినయం ముఖంలో, కళ్లల్లో, మాటల్లో ఉట్టిపడుతూ అనునయించేవాడివి. ఆ దినాలు, ఆ రాత్రులు తలుచుకుంటే గుండె మండిపోతుంది. ఎండిపోతుంది. కోప్పడనా? కోపం చేసుకొనేంత ఓపిక వుందా వొంట్లో! ఏడుస్తున్నాను. ఏడుపునకు ఓపిక అక్కరలేదు. అది అవశత్వంలో, వివశత్వంలో దానంతట అదే వస్తుంది వెలుపలికి.

బాగుంది! నీ తప్పున్నావా? నాదే తప్పు. తప్పంతా నాదే. నా వైపు చూస్తావు. చూడక పోవడమంటూ లేదు. చూస్తావు. కాని, ఆ చూపులు రెప్పవాలనీయవు. ఎవరినో చూచినట్టు, ఎటో చూచినట్టు, ఎందుకో చూచినట్టు, ఏమో చూచినట్టు వుంటాయి ఆ చూపులు. మాట్లాడవా? మాట్లాడకేం? చక్కని తియ్యని, మెత్తని మాటలు! విన్నవారికి ఎంత మంచివాడు, ఎంత పెద్దమనిషి, ఎంతటి ప్రేమ పరిపూర్ణుడు అని అనిపించే మాటలు! కాని, నేను అడిగితే, జవాబు చెప్పవు. ముఖం చూచి జవాబు కాదు, వీపుకు జవాబులు, ఇదంతా నీ తప్పు కాదు! నాది, నా హృదయంది, నా పాపిష్ఠి హృదయంది. దాన్ని అనాలి. కొంచెం సహృదయత చూపితే చాలు, తగులుకుంటుంది, రేగుకంపకు తగిలినట్టు. ముందూ, వెనకా చూచిందా? అనాలోచితంగా, దూరదృష్టి లేకుండా పనులు చేస్తే యిలాగే వుంటుంది ముగింపు. హృదయం సరే. బుద్ధికి ఏమి వచ్చిందట! హెచ్చరికలు చేయవచ్చుగదా! అదీ అంతే వక్రం.

వెళ్లు. ఈ ఏడ్పులు, అంగలార్పులు నాకు ఒక్కతెకే వుండనీ. నీవెందుకు బాధపడడం? నీవు సుఖంగా వుండాలి. బాధపడరాదు. నువ్వు వేయిండ్ల పూజారివని ఇటీవలేగా తెలిసింది. వాళ్లకూ ఈ బాధలెందుకూ? ఆ బాధలన్నీ నాకే వుండనీ. వాళ్లన్నా సుఖపడనీ. వాళ్ల మనస్సూ నొచ్చి, నీవూ నొప్పిపడి-నేనేమి జుర్రుకున్నట్టు, వెళ్లు. సుఖంగా వెళ్లు. వెళ్లమంటున్నానుగా. నచ్చచెప్పడాలు, ఇచ్చకాలు వద్దు.

ఇక వెళ్లు. చూడలేను. సిగ్గు లేకపోతే సరి! ఎగ్గులెన్నయితేనేం? నన్ను కాదన్నావుగదా! అంత ఘనంగా, ముప్పేటగా పేనుకున్న ప్రేమను చప్పున కత్తిరించేశావు. ఈ దిశ చూడడం మానావు. చూచినా, ఏ శవాన్ని చూచినట్టో చూస్తావు. ఔను. ఆ కాలం-ఏదీ? నా పాదాల ఎత్తుక నీకు తిలకమయ్యేది. నా కన్నుల కాటుక నీకు కస్తూరిరేఖ అయ్యేది. నా మాట వేదవాక్య మయ్యేది- కాదు మన్మథవేదమయ్యేది. ఆ స్థితి పోయిన తర్వాత, చూడడమెందుకు? కలవడమెందుకు? లోకం కోసమా? లోకానికి పట్టిందా మన సంగతి? బాగుంటే కళ్లు సన్నగా చేస్తుంది లోకం. బాగు లేకపోతే కళ్లు చికిలిస్తుంది. పళ్లూ ఇకిలిస్తుంది. లోకం చూసే నీ వలలో పడ్డానా?

అంతా నా కర్మ. పూర్వజన్మ కర్మగాదు, ఈ జన్మకర్మే. పాతవి తలచుకోకు, ఎలా తలచుకుంటావులే. అవన్నీ మనసులో ఎక్కడో అణిగి అంతరించిపోయి వుంటాయి.

ఎందుకనుకున్నావు? ఆ పాత ముచ్చటల మీద నీ కొత్త ప్రియురాళ్లు, ఘన జఘనోరు పయోధర సుందరీమణులు కూర్చున్నారు. అంత బరువుండగా అవి ఎలా పైకి వస్తాయి - అణగారిపోకుండా? నీ మనస్సులోనే కాదు, నీ కళ్లల్లో, మాటల్లో, చేతల్లో వాళ్లే కూర్చున్నారు. ఇక మాబోటి వాళ్లకు చోటేదీ? వాళ్ల పక్కన ఏదో ఒక మూలలో నిలుచుందామన్నా కుదరదు. అన్నీ బరువులే.

ఎంత పొరపాటు చేశాను? ఇలా అవుతుందనుకోలేదు. ఆ మాటలు, ఆ చూపులు, ఆ సౌఖ్యాలు, ఆ ఆనందక్రీడలు ఇలా పరిణమిస్తాయనుకోలేదు. నీవేమీ మోసం చేయలేదు సుమా! నీవు అప్పటి వాడివే. అదే సుందరరూపం, అదే ఆకర్షణ. నాదే తప్పు. సూదంటురాయికి ఇనుప ముక్క లాగ అతుక్కున్నాను. సూదంటురాయి అతుక్కో అతుక్కో అని అడిగిందా దానిని? ఇనుపముక్కను అడగాలి. ఎందుకు అతుక్కుందిట? ఎందుకు చుట్టూ గిరగిరా తిరిగిందట? ఓ బహువల్లభుడా, నీ దశ అది. నా దుర్దశ ఇది. నిన్ను అంటే వచ్చేదేముంది గనుక? నేను జాగ్రత్తపడాలి.

ఆ ఇప్పుడందరూ నన్ను దెప్పేవాళ్లే, గడచినన్ని నాళ్లూ తెగ పొగిడారు రాధాకృష్ణులని, గౌరీశంకరులని. కొంచెం పొరపొచ్చేలు వచ్చాయా, ఇక తీస్కో-దెప్పుళ్లు చెప్పుళ్లు. ఇంతకూ తోక పామై కరిస్తే ఏం చేయను? ఇంతటి వినీతుడు, ఇంతటి స్వాధీనుడు ఇలా మారుతాడని కలలోనైనా భావించానా? ఇదే తోక పామై కరిచిందనడం కాదా?

జాగ్రత్త జాగ్రత్త అంటారు. ఏం జాగ్రత్త? మనం బాగ లేనప్పుడు అన్ని జాగ్రత్తలూ అంతంతే. అదేనా ప్రేమ, ప్ప్రేమ, ప్ప్రేమ!!

(*గాథాసప్తశతి*: 933-942)

# ఎంత అమాయికవో!

ఎంత అమాయికురాలివి? వీపు కొంచెం చూసుకో. ఏమిటవి? వీపు నిండా ఊడుగు ఆకులు అంటుకున్నాయే? ఎవరన్నా చూస్తే నవ్విపోతారు. అవ్వ! పట్టపగలు! పెరట్లో! ఊడుగు చెట్టు కిందనా? నీ ఇల్లు, నీ పెరడు, నీ భర్త. అంతా నీదే. కాని, మనం ఇరుగూ పొరుగును కూడా చూడాలి కదా. వాళ్లు మన సంగతేమీ పట్టించుకోరనే అనుకుందాం. అయినా మనకూ కొంచెం సిగ్గూ, బిడియమూ వుండాలి కదా! పదుగురి నోళ్లలో పడడమెందుకు? మనస్సు చంచలం. ఎంత పరిశ్రమించినా అదుపులోకి రాదు. అందునా, పెద్దలెవరూ లేనప్పుడు మరీ స్వేచ్ఛ. ఇంట్లోని ప్రతి స్థలాన్నీ ఉపయోగించుకుందాం. ఈ అనుభవం ఎలాంటిదో - అనే అనిపిస్తుంది. అలా అని మనం మరీ బరితెగిస్తే ఎలా? అంటుకున్న ఆకులు తుడుచుకొని రాలేకపోయావా? నా కంట పడేదానివి కావు. నా కంటపడినంత మాత్రాన ప్రమాదం లేదులే. ఇంకెవరి కంటో పడుతావనుకో! చిలవలు పలవలు! పాకిపోదూ ఊరంతా?

నీ అమాయికత్వం చూస్తుంటే నీలాంటి వారు మరికొందరూ గుర్తుకు వస్తున్నారు. మరీ ముద్దు కట్టిన అమాయికత్వం! వట్టి కుర్రతనం! రాత్రి ప్రియుడు ఉద్రేకం పట్టలేక బుగ్గ కొరికాడు. ముప్పై రెండు పళ్ల గుర్తులూ గుండ్రంగా పడ్డాయి. ఆ వెర్రిబాగులది అదేదో అప్పగించిన డబ్బు ముల్లె లాగ, రత్నాల లంకె బిందెలాగ కాపాడుకుంటూ వుండేది చాలాకాలం చెంపమీద చేయి ఆనించి. ఏమిటిది అనడిగాను ఒకమారు. చెప్పింది. వెర్రిదానా, నీ అమాయికత్వం అడుగంటిపోనూ. నీ సంతోషపారవశ్యంతో పడకటింటి పండగలన్నీ వీధి కెక్కుతున్నాయే? ప్రియుణ్ని లేనిపోని మాటలు పడేట్టు చేస్తున్నావే? అన్నాను. చేతిని చెంపకు ఆనించుకొనే నవ్వింది. ఏమనను?

అంతటితో ఊరుకోక, మరో సంగతి చెప్పింది. ఇదేనేమిటి? ఇంకా ఎన్నో వున్నాయి మనస్సులో. నా మనస్సనే రత్నాకరంలో ఆ రత్నభాండాగారాలన్నిటినీ దాచుకొన్నాను. చెప్పనా? ఎలాటి రసికుడనుకున్నావు నా ప్రియుడు? మన్మథారాధన తర్వాత అలసి సొలసి పోతామా! నాకు మరీ అలసట ఎక్కువ. అలాగే ముడుచుకొని

పడి వుంటాను, కళ్లు మూసుకొని ఎంతోసేపు. కళ్లు తెరుద్దును గదా, అలాగే నా వైపు చూస్తున్నాడు, ప్రతి రమణీయమైన చోటా రామణీయకాన్ని ఆస్వాదిస్తున్నట్టుగా. పరవశించి పోయాననుకో. ఎంత రసికత! సౌందర్యాన్ని చూసి ఆస్వాదించి, ఆనందించే అభిరుచి వుండాలి సుమా! అయిపోగానే దులుపుకొని పోవడం కాదు. ఎంత మురిసిపోయాననుకున్నావో! అన్నది. నీ ఇల్లు బంగారంకానూ. ఇవన్నీ చాటించేవు డప్పు వాయిస్తూ? అన్నాను విసుగ్గా. ప్చ్! అంటూ నవ్వేసింది.

మరొకతె మరీ ముద్దరాలు. ప్రియుడు, పాలిండ్లను గిల్లాడు, గాటు పడింది. కొంచెం ఎరుపెక్కింది. అదేదో రంగు అంటుకుందని మరీమరీ కడుగుతున్నది, మరీ తుడుస్తున్నది, చూసుకుంటున్నది. చూసుకుంటున్నప్పుడు కలువ కన్నులు ఎత్తయిన చనుకట్టుపై ప్రతిబింబించాయి. దాన్ని చూస్తే కలువలతో దానిని పూజిస్తున్నట్టు అనిపించింది.

ఆ అమాయికురాలు మరీ మరీ కడిగి అలసిపోయింది. ఇంతలో చెలులు వచ్చి చుట్టుముట్టారు. చప్పున కొంగు భుజాల మీద కప్పుకుంది. కుసుమ పూవులు అంటుకున్నాయేమో! ఎందుకు బాధ పడతావు? దాచుకోడం ఎందుకు? అని విరగబడి నవ్వడం ప్రారంభించారు. ఆ ముద్దరాలు మరీ ముడుచుకొని పోయింది సిగ్గుతో.

మరీ అమాయిక సంగతి చెప్పనా? ప్రియుడి కోసం ఎదురు చూస్తూంది. రాలేదు. అద్దాల వంటి బుగ్గల మీద చంద్రుడు ప్రతిఫలించాడు. చంద్రునితో తక్కిన భాగం పాలల్లో పాలలాగ కలిసిపోయింది గాని, కళంకం మాత్రం కొట్టవచ్చినట్టు కనిపింపసాగింది. ప్రియుడు రాలేదని కళ్ల నుంచి కురుస్తున్న బాష్పాలు ఆ కళంకాన్ని కడిగివేస్తున్నాయి. అయినా అది పోవడం లేదు. తుడుచుకుంటూంది ఇంకా. ఎంత ముగ్ధత్వం?

పాపం! కర్షకుడు పగలంతా మడి దున్ని ఇంటికి వచ్చేవాడు. అలసి సొలసిన భర్తకు ఉపచారం చేసేది భార్య. అదీ మరీ అమాయిక. వర్షాకాలం వచ్చింది. మేఘాలు ముమ్మరంగా ఆకాశాన్ని ముసురుకున్నాయి. వర్షాకాలంలో ప్రకృతే పులకిస్తుంది కదా! ఇక వయసులో వున్నదీ, ఆరోగ్యంతో మిసమిస లాడుతున్నదీ అయిన కర్షకాంగన పులకించక పోవడం అన్నది వుండదు కదా! వర్షాకాలంలో మళ్ల పనులు ఎక్కువగా వుంటాయి కదా! కృషికుడు పగలంతా దున్నాడు. నాగలి కర్రు మడి బురదల్లో ఇరుక్కు పోయింది. దానిని బలం కొద్దీ లాగాడు. రాలేదు. మరీ లాగాడు. ఎంతో లాగగా

వచ్చింది. అలసిపోయాడు. ఇంటికి వచ్చాడు. భోజనం కాగానే నిద్ర పట్టింది. భార్య – కర్షకయువతి ఏం చేస్తుంది! ఉసూరుమంటూ పక్కపై దొర్లడం ప్రారంభించింది.

వర్షాకాలం గడిచిపోతూంది. పామరికి మండిపోయింది. ఛీ పాడు వర్షాకాలం! ఎందుకు వస్తుందో! నా బోటి వాళ్ల ప్రాణాలు కొరకడానికి కాక మరెందుకట? భర్తను ఏమని అంటుంది? అలసి నిద్రలో మునిగాడు. శృంగారం ఉభయత్రా వుండాలి గాని, ఏకత్రా వుంటే రసాభాసం కదా! నిద్ర పోతున్న వాడి నెత్తి మీద పడినా ప్రయోజనమేముంది? మరీ వెర్రెత్తిపోయి వానకారును మరీమరీ తిట్టిపోసింది. ఏమంటాం ఆ అమాయికత్వాన్ని!

మరీ అతివిచిత్రమైన అమాయికత్వం ఒక నవవధువుది. దానిని వింటే నీవు కూడా నవ్విపోతావు. మరీ ముగుద. ఏ సంగతీ తెలీదు. పల్లెటూరి వారు ఆ విషయంలో ఆరితేరి వుంటారు చాలామంది. అలాటిది కాదు. శీలవంతురాలు. చిలుక కొట్టిన పండు కాదు. ఇరుగూ పొరుగూ కూడా మంచివాళ్లు కనుక అడ్డదార్లు, పెడదార్లు, గోదావరి గట్టెక్కి జారిపడడం, ప్రబ్బలి పొదరిళ్లు దూరడం లాంటివేమీ తెలీదు. తెలిసి వుంటే ఆ సంగతీ పూర్తిగా తెలిసేదే. పతిదేవునికి తొలిరాత్రే మదనోత్సవరహస్యాలు ఉపదేశించేదే. అలాంటిది కాదుగా మరీ!

భర్తతో గడిపిన తొలిరాత్రి నిజంగా తొలిరాత్రే. కనుక తొలిసారిగా రుచి చూచింది కామోపభోగసుఖాన్ని. ఏది ఆరంభమో, ఏది అంతమో తెలీదు. మొదటి నుంచి చివరి వరకు మహానందంగా వుంది. ఇంతలో పతి పరిశ్రాంతుడయ్యాడు. చండ వేగుడు కాస్తా మందవేగుడై ముక్తవేగుడయ్యాడు. పాపం! ఆ పల్లెటూరి కొత్త కోడలికి ఇదేమి తెలుసు, ఇంకా ఏమయినా వుందేమోనని అలాగే కళ్లు మూసుకుని కాచుకుపడి వుందట. పతిదేవుడికి భయం పట్టుకుంది. తొలి రాత్రే అసంతృప్తి కలిగించానా! అని. ఇంకేమీ లేదని ఎలా చెప్పడం? భయమూ, సిగ్గునూ. ఏం చేస్తాడు? అలాగే భార్య పారవశ్యం కరిగి పోయేవరకు వేచి వున్నాట్ట! ఈ అమాయికత్వాన్ని ఏమంటావు?

నవవధువు కళ్లు తెరిచింది. తదేకంగా తన్ను చూస్తున్న భర్తను చూసి సిగ్గు ముంచుకొని వచ్చింది. దిగ్గున లేచి వేరే పక్క మీద పడుకుంది. తెల్లవారగానే భర్త ముఖం చూడడానికి మరీ సిగ్గయింది! అతనికేమో సిగ్గు దొంతరలు పేరుకుపోతున్న భార్య ముఖం చూస్తుంటే వెనకటి రాత్రి ఆనందం చప్పనగా తోచింది. వెనుకటి

రాత్రి సంగతులన్నీ ప్రతిమా పరిపాటి (రీల్) లాగ కళ్ల ముందు తిరిగాయి కాబోలు! కళ్లు సగం మూసుకున్నాయి. చెక్కిళ్లు ఎరుపెక్కాయి. గొంతు బొంగురుపోయింది. కాళ్లు తడబడిపోయి, ఎగుడు దిగుడుగా పడుతున్నాయి. ఇవన్నీ భర్తకు మహానందం కలిగిస్తున్నాయి. అదీ ఆ ముగ్ధవధువు ముచ్చట!

అలాటి అమాయికత్వం వద్దు, ప్రమాదకరం! ఇక మీద పెరట్లోనైనా, కోటలోనైనా... తర్వాత జాగ్రత్తపడు. ఆకు, అలము, గడ్డీ, గాదం వీపునకు అంటుకొని నవ్వులపాలు కావద్దు. ఎవరైనా నవ్వితే కడవెడుపాలలో ఒక ఉప్పురాయి పడ్డట్టవుతుంది.

(*గాథాసప్తశతి*: 1-96, 2-45, 50, 55, 3-9, 80, 4-13, 24, 52, 5-13, 33)

# ప్రేమ పాఠాలు

వెర్రి కుదిరింది రోకలి తలకు చుట్టండి అన్నాడట వెనుకటికి ఎవడో. అలా వుంది నీ వ్యవహారం. ప్రేమకూ, కోపానికీ భేదం తెలియకపోతే ఎలాగోయ్? ఆ కోపాన్ని చూసి ప్రేమ లేదనుకుంటున్నావు కదూ! వెర్రి! వెర్రి! పూర్తిగా వెర్రి! హఠాత్తుగా కోపంతో విరుచుకు పడడం, అంతలో అనుగ్రహం చూపడం, అబద్ధాలు అల్లడం, మత్సరంతో ఉసూరు మనడం- ఇవన్నీ ప్రేమ చూపే పద్ధతులోయ్!

రాత్రంతా మేల్కోవడాలు- ఇదిగో వచ్చాడు, అదిగో వచ్చాడు అనే లేకపోతే, అసూయ లేకపోతే, విచారపడడమూ లేకపోతే, మంచి మనసుతో తియ్యగా మాట్లాడడమూ లేకపోతే ఇక ప్రేమ ఏమిటి? నా మొహం!

ఇలాంటి సమయాల్లో నీవు తగ్గాలి. ఒక మెట్టేమిటి, ఎన్ని మెట్లయినా దిగాలి, అనునయించాలి. సమయం వస్తే కాళ్ల మీద పడాలి. దీనిని ప్రేమతత్త్వవేత్తలు పాదపతనోత్సవం అన్నారు. కోపంతో ముఖం ముడుచుకొనివున్నా, సరభసంగా లాక్కుని ముద్దు పెట్టుకోవాలి ముచ్చటగా. ఇలాటివి ఇంకా చాలా వున్నాయి ప్రక్రియలు, కోపం కూల్చి ప్రేమను పెంచడానికి.

ప్రేమ లేదనుకునేవు? బాగా పరిశీలించు. అలక వుందనుకో. ఆ అలకే ప్రేమ విపరీతరూపం. నీవు ఏమైనా చెప్పావనుకో, మాట్లాడకుండా పని చేస్తుంది. నీవు ఎటో చూస్తావనుకో, నిన్నే దొంగతనంగా చూస్తుంది. ఏకాంతంలో విచారంతో నిట్టూర్పులు విడుస్తుంది. ఇది విచిత్రమైన ప్రేమ. తెలుసుకో.

నీకు ప్రేమ కావాలా? అయితే కొన్ని అగచాట్లు పడాలి. చూపుతో బెదిరిస్తుందనుకో, దగ్గరికి రావద్దు అని. భయపడకు. దగ్గరికి వెళ్లు. విదిలించి కొడుతుందీ, పైట కొన పట్టుకో. రెండు దెబ్బలు వీపు మీద పడతాయనుకో అనుకోకుండా. నన్ను కాదు అనుకుంటూ గుండ్రంగా తిరిగి ముద్దుపెట్టుకోడమే. ఇంత సిగ్గు లేనివాడి మీద కోపమేమిటని విసుగెత్తి పోతారు ప్రియురాళ్లు.

ఇంకో చిన్న రహస్యం చెబుతాను. నీవు తప్పులు చేశావు. లెస్సగా అబద్ధాల పుట్టే పగులగొట్టావు అనుకుందాం. అనునయించాలి. బాగా బుజ్జగించాలి. నా తప్పులు ఏమీ లేవు, నీదే తప్పంతా సుమా అన్నట్టుగా బుజ్జగించాలి. దాంతో రంగమే తారుమారవుతుంది.

మరొక రహస్యమూ వుంది. శ్రద్ధగా విను. నీ వెనుక ఎన్నో మాట్లాడుతారు, అదట, ఇదట అని వెయ్యి నేరాలను గురించి. నీవు ధైర్యంగా ఎదురుపడ్డావనుకో. ఏమీ అనలేరు. అన్నీ మరచిపోతారు. ఏమీ తోచదు. నీ ధైర్యంలో వుంది అంతా. గుండె నిబ్బరమంటే కదనరంగంలో కదం తొక్కడం కాదు, కోపగించుకున్న కలికి ముందు నిలబడడం.

ప్రియురాలి కళ్లు మూతలు పడుతుంటాయి నిద్రతో. అరమోడ్పు కన్నులతోనే "ఇక నిద్రపోనీండి. కళ్లు మూత పడుతున్నాయి. మీరు నిద్రపోరు. మీ ఇష్టం వచ్చింది మాట్లాడవచ్చు పగలంతా–" అనేట్టు చేయాలి. ఏ మాత్రం అవకాశం ఇవ్వకుండా ముచ్చట్లతో ఉక్కిరిబిక్కిరి చేయాలి. దానితో నీ తప్పులన్నీ తప్పుకుపోతాయి. మాటల్లో మాత్రం వ్యత్యాసం రానీకు, జాగ్రత్త!

వ్యత్యాసమంటే జ్ఞాపకం వచ్చింది అబ్బాయి! మారుపేర్లతో పిలవడం మానుకో. అలాటి తప్పులు చేయకు. పరధ్యానంతో ఎవరి పేరుతోనైనా పిలిచావా, చిక్కుల్లో పడతావు. ఏది పరిహాసమో, ఏది నీ మనస్సులో మాటో ఎదుటివారికి తెలీదనుకోవద్దు సుమా! ఒకావిడ ముచ్చట. ఎంతో కాలానికి ప్రియుడు వచ్చి పొరపాటున మారుపేరుతో పిలిచాడట. ఆవిడకు పాపం అతడు ఇంటికి వచ్చిందే పదివేలు. "ఇదిగో ప్రియతమా, పిలు, పిలు. ఆ పేరుతోనే పిలు. అదే నా పేరు. అదే నా పేరూ. సిగ్గుపడతా వెందుకు? నీకు నా పేరు నచ్చకపోతే, నాకూ నచ్చదు. ఇంతకూ పేరు ఏదైతేనేం? పేరులో ఏముంది?" అన్నదట. మరొక ఇల్లాలు ప్రియునితో అన్నదట– "నీకు ఏది తోస్తే అది చెప్పు. అన్నిటినీ సహిస్తాను. నీవు నా ప్రియుడివి. నీ మాటలు, చేతలు సహించాలి. సహించక పోవడం, జీవించడం రెండూ కుదరవు కదా!" కనుక అలాటి పొరపాటు చేయకు.

అనునయించడం అన్నానే. అది బాగా నేర్చుకో. నీ తప్పులు విన్నప్పుడు ఏమోలే, ఎన్నో వదంతులు వింటుంటాం. ఏవి నిజమో, ఏవి కావో ఎవరికి తెలుసు అనుకొని ప్రియురాలు ఊరుకుంటుంది. దుఃఖపడదు. కాని, నీవు కనిపించి, కొంచెం అనునయించావా, కోపం చల్లారుతుంది కాని, ఆ కోపమంతా ఏడ్పు, కన్నీరుగా మారి చల్లబడుతుంది.

నిజంగా కోపం వచ్చిందనుకో. నీవు జాగ్రత్త పడడం మంచిది. నీవు ఏదైనా పానీయం చషకంలో (పానపాత్ర) పోసి ఇస్తావనుకో. దానిని అలా చూడనైనా చూడకుండా తన చెలికత్తెకు అందిస్తుందనుకో ప్రియురాలు. పూర్తిగా కోపం వుందన్నమాట. చేతలతో చూపింది కోపం, మాటలతో కాకుండా.

కోపం, అలక తెలుసుకోవడం చాలా కష్టం. కొందరి కోపాలు నివురుగప్పిన నిప్పులా వుంటాయి. ముఖం చిట్లించుకోడమనేది వుండదు. కఠినంగా ఒక్క పూటయినా పలుకదు. ముద్దుపెట్టుకున్నా పెదవి తుడుచుకోదు. పెదవి కదపదు. కౌగిలించుకున్నా ఏడవదు. 'సరిగా మాట్లాడవేం? చెప్పింది చెప్పినట్లుగా చేస్తున్నావు. నీ వినయం చూస్తే మనస్సు కోపంతో కుతకుతలాడుతున్నట్టు తోస్తున్నది' అంటావనుకో. కోపం మరీ ఎక్కువయి ఏ ప్రశ్న వేసినా జవాబు చెప్పదు. ముద్దు పెట్టుకోబోతే, ముఖం బలవంతంగా పక్కకు తిప్పుకుంటుంది. పరిహాసంగా ఏదైనా అందామా అంటే, వినిపించుకోదు, కళ్లు పెద్దవి చేసి చూస్తుంది.

చేయి పట్టుకుంటే గాజులు గలగల లాడిస్తూ లాక్కుంటుంది. ముఖం తిప్పుకొని కన్నీళ్లు కురిపిస్తుంది. నిట్టూర్పు రాకుండా బిగపడుతుంది. ఇలాంటివారి విషయంలో ఒక కిటుకు వుంది.

బాగా ఉబ్బేయాలి. వారి అంగాంగాలూ వర్ణించాలి. పీనస్తనీ, తరలాక్షీ, చంద్రవదనా, తనుమధ్యా అంటూ కవిత ఒలకపోయాలి. ఈ యౌవనం అస్థిరం కనుక అలక తగదు అని చెప్పాలి. చలికాలపు రాత్రులు చాలా పొడవైనవి సుమా అనాలి. నీవు సుందరివి. అంగసౌభాగ్యం గొప్పది. తారుణ్యం నవనవలాడుతున్నది. ఒక్కటే లోపం - అలక. ఎలా వుందో సామ్యం చెప్పమంటావా? చందనపు చెట్టుకొమ్మను పాము చుట్టుకున్నట్టు వుంది సుమా! నీ వాలకం అని కబుర్లు వల్లించాలి.

ఇలా అనునయించి, గాఢంగా ఆలింగనం చేసుకో. తానెక్కడ నలిగిపోతానో అనే భయంతో అలక చల్లగా జారుకుంటుంది. అప్పుడు "నీ ప్రేమ నిరంతరం పొందాలని నాకు చాలా ఆశ. దానిని ఎలా పొందాలో తెలియడం లేదు. ప్రియుడా, నీకు నేను ఎలా ప్రియురాలు కాగలనో నీవే నాకు శిక్షణ ప్రశిక్షణలిద్దూ!" అంటూ నీ శిష్యరికం కోరుతుంది ప్రేయసి.

ప్రేమ స్వరూపం తెలియడం సులభం కాదు. దానికి ధ్యాన నిధిధ్యాసనాలు చాలా కావాలి. అటుపిమ్మట సమాధిస్థితి ఏర్పడుతుంది. అలక అనే మాయ తొలగగానే ప్రేమికులైన జీవాత్మపరమాత్మలు కలుసుకోడం సులభం. ఇవి ప్రేమపాఠాలు.

(గాథాసప్తశతి: 7-75, 8-23, 9-22)

# సాకులు! కుంటి సాకులు!!

అత్తయ్యా, చూశావా? ఎంత అన్యాయం జరిగిపోయింది! నేను తెలతెలవారగానే పాలకోసం గొల్ల బలభద్రయ్య ఇంటికి వెళ్లానా? అతడు ఎంతకైనా తగును! "చేటపెయ్యలో కుక్కిన దూదిని దొంగిలించావు-" అంటూ పేచీ పెట్టాడు. "నాకెందుకయ్యా నీ దూది? మా దొడ్డి నిండా పత్తిచెట్లే కదా!" అన్నాను. 'అదేం కాదు. నీవు పత్తి తీసుకున్నావు, దాచుకున్నావు' అని ఆరోపణ ప్రారంభించాడు. నాకు ఒళ్లు మండింది. "ఎక్కడుంది నీ పత్తి? చూపించు-" అంటూ పైట కొంగు, చీరకుచ్చెళ్లూ విదిలించాను. "అమ్మో! బలేగా దాచావే? ఎవ్వరికీ సందేహం కలుగకుండా, కుబుసంలో (రైకలో) దాచుకున్నావు-" అంటూ నా రొమ్ములకు యేం గతి పట్టించాడో చూడు.

వీధి వీధంతా వుంది.ఏం ప్రయోజనం? అందరూ కుక్కిన పేలలాగ వున్నారు. "పత్తి ఏమిటి? ఎవరైనా అక్కడ దాచుకుంటారా? అయినా ఎవరైనా ఆడవాళ్లకు చెప్పి పరీక్షించాలి గాని, నీవు దురుసుగా ఇలా ప్రవర్తిస్తావా?" అని పల్లెత్తు మాట అన్న పెద్ద మనిషి లేడు. ఇక నేను జన్మలో ఆ గొల్లడి కొంపకు పాల కోసం పోను!

పొలంలోనూ ఇదే పోరే. పొలానికి పోదామంటే దిగులుగా వుంటూంది. పొలానికి కూడా పోను. చిలుకలు, పిట్టలు, గింజలు తెగ తిని పోనీ. చిలుకల బెడదకన్నా బాటసారుల బెడద మరీ ఇదిగా వుంది. ఆ బాటలో వాళ్లు వెయ్యిసార్లు నడిచివుంటారు. అయినా నన్ను చూడగానే ఏం పుడుతుందో! "ఈ దారి ఎటుపోతుంది? ఆ ఊరికేనా?" "మరి ఇటుపోతేనో, ఆ వూరు రాదా?" అని అడిగిన ప్రశ్నే మరీ మరీ అడిగి విసిగిస్తారు. జవాబు చెప్పినంతసేపే కాదు, తర్వాత కూడా ఏవో వంకర చూపులు! ఏవేవో కోతిచేష్టలు! కొత్త వింత వస్తువును చూడడానికి వచ్చినట్టు తీసుకొని రావడాలు. వాళ్ల ప్రశ్నలకు సమాధానం చెప్పకపోయానా, 'చూచావా! ఎంత పొగరు కలమగోపికి-పొలం కాచే పిల్లకు?' అని వ్యాఖ్యానాలు. పొలం కాపలాకు పోకపోయామా, ఇంట్లో అత్తగారి పోరు!

ఈ ధూర్తులు ఎలా కాచుకుంటారో? ఎలా కనుక్కుంటారో! పొలం కాపలాలో వున్నానా. పెద్ద గాలి వీచింది. కర్ణావతంసంగా పెట్టుకున్న కలువపూవు పుప్పొడి కళ్లల్లో పడింది. కొన్ని క్షణాలు చిమ్మ చీకటయి పోయింది లోకమంతా. కళ్లు తెరవడానికి వీలు కాలేదు. సంతతధారగా కన్నీళ్లు. కళ్లు నలుపుకుందామంటే ఏమవుతుందోనని భయం. పిలిచి వూదించుకుందామా అంటే, దగ్గరలో ఎవరూ లేరు.

ఎక్కడి నుంచి వచ్చాడో ధూర్తాగ్రేసరుడు, 'ఏదీ, బాలికామణీ, కళ్లల్లో దుమ్ము పడిందా? కలువ పుప్పొడి లాగ వుందే? పుప్పొడే. సందేహం లేదు. ఏదీ? ఇలా తిప్పు ముఖారవిందం. ఒక్కసారి వూదానా, అంతా పడిపోతుంది. కళ్లు తేలికపడుతాయి. నలపకేం?' అంటూ గడ్డం పట్టుకొని పుప్పొడి వూదడం ప్రారంభించాడు. పుప్పొడి వూదుతున్నాడా, పెదవులు ముద్దు పెట్టుకుంటున్నాడా? అని కొన్ని క్షణాల వరకూ నాకే అర్థం కాలేదు. కళ్లు తేలికయినాక బాగా తెరిచి చూశాను. ఇంకా చుబుకాన్ని పట్టుకొనే వున్నాడు. ఒక్కసారి విదిలించి కొట్టాను. నేనిలా చేస్తానని ఎదురుచూచి వుండడు. తూలిపడ్డాడు! వెనక్కు సిగ్గులేని వాడు "అమ్మాయి, అంత కోపమెందుకు? ఏదో ఆపదలో వున్నావని వచ్చాను. వద్దంటే పోతా" అంటూ నసిగాడు.

మొన్న యేటి నుంచి నీళ్లు తెస్తున్నాను. కడవ పెద్దది, కడవతోపాటు తలవాకిలిలో అడుగుపెట్టాను. చంకలో కడవ, ఆ బరువుకు మరొక చేయి బిరుసుగా ఎత్తవలసి వచ్చింది. ఆ పాళంగా ద్వారం దాటడం కష్టం. పక్కకు తిరిగి, ఓ మూలగా వెళ్లితే బాగుండేదేమో! ద్వారబంధానికి కడవ తగిలి, భళ్లున పగిలి కిందపడింది. దానితో రోజంతా రాచి రంపాన పెట్టింది అత్తగారు. ఏదో పెద్దది, "కడవ పగిలినందుకు నష్టం అయిందే!" అంటూ పలవరించింది. అదీ సహించాను.

ఆడబిడ్డ చురచురా చూసింది. "నీవు పనిగట్టుకునే పగుల గొట్టావు" అంటూ సాగదీసింది. "నీవు ఏదో గాభరాగా వున్నావు. చూపులన్నీ ఎక్కడో దిక్కుల్లో వున్నాయి. నీ వైఖరికి భయపడి పోయిన కడవ తానే ద్వారానికి తాకి కింద పడి పగిలింది" అంటూ వ్యాఖ్యానించింది, నా కోసం ఎవరో ఏటి గట్టున కాచుక్కూచున్నట్టు. మొదట్లో మాట్లాడే అవకాశం లేక నేను ఇంటి వరకు వచ్చి, కడవ పగులగొట్టినట్టా ఇతరులకు అపార్థం కలిగేలా ఏటు పోటు మాటలు. నన్ను చేపట్టినవాడు ప్రాణం నా కోసం ధారపోస్తాడు గదా! నాకెందుకు ఆవిడలాగ తిరుగుళ్లు? తన అన్నయ్య నన్ను అంతగా ప్రేమిస్తున్నందుకు కన్ను కుట్టి చస్తూంది! దానికేం చేస్తాం? పుణ్యం కొద్దీ పురుషుడు అన్నారు. తను తిరుగుళ్లు మాని, భర్తను బాగా చూసుకోరాదూ? ఎంత అమాయికుడు

పాపం! తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్లు అనుకుంటాడు. కనుకనే ఈవిడగారి ఆటలు సాగుతున్నాయి. తనంటే పడిచస్తాడు గదా? వెలి చావులెందుకు? ఇంటిచెరకునే అనుభవించరాదూ? ఈవిడ సంగతి ఆయన చెవిలో వెద్దామని అప్పుడప్పుడు తెగ కోరిక పుడుతుంది. కాని, నువ్వులూ నూనే ఒకటే, తెలకలవాడే పరాయి వాడయినట్టు వాళ్లిద్దరూ ఒక్కటయి, నేను వేరయిపోతాను. ఎవరి కర్మ వాళ్లది. నాకెందుకు?

అదృష్టమంటే జ్ఞాపకం వచ్చింది ఒక రాత్రి ఎందుకో అలిగాను. ఏమన్నారో ఏమో మనస్సు నొచ్చుకుంది. క్షణం క్షణం కాళ్ల మీద పడ్డారు. ఇవన్నీ సాకులే అనుకున్నాను. తగినట్టు మంచం కూడ అలాటిదే దొరికింది. అడుగడుగునా పాడు కోడు పడిపోసాగింది. సరిగ్గా బిగించలేదు కాబోలు. అటు పొర్లితే ఇవతలి పాదం పతనం, ఇవతలికి జారి పడడం. ఇటు పొర్లితే తీర్చడానికి ఆయన పాదపతనం నా కాళ్ల మీద పడడం. ఈ పాద పతనాలతో రాత్రల్లా కంటిరెప్ప వాలలేదు. ఇక తెల్లవారగానే మంటనే వుంది. పనీ, పాటూ అంతా సాకులే, కుంటిసాకులు అనేవాళ్లు వుండనే వుంటారు.

సాకంటే – ఒక రాత్రి సంగతి కళ్లకు కట్టినట్టవుతూంది. ఏదో సాకుతో మూతి ముడుచుకు కూచున్నాను, పందిరి పట్టెమంచం మీద. పట్టె మంచం నేను కాపురానికి వచ్చినప్పుడు నాతో వచ్చింది. ఇద్దరు స్వేచ్ఛగా పడుకోవచ్చు. అలా కూర్చున్నాను. ఆయన వచ్చారు. నేను కదల్లేదు, కన్నెత్తి చూడలేదు. నోరు విప్పలేదు. నేనే తగ్గడమెందుకూ? తామే తగ్గనీ. కాని ఒళ్లు మాత్రం నా మాట వినడం లేదు. ఏదో కనకాభిషేకం జరిగినట్టు పరవశించిపోయి, పులకించింది. 'ఎక్కడ వచ్చి పైబడతారో' అని, తప్పుకుని తలుపులు తెరుచుకొని నడవలోకి వచ్చాను. నడవలో పడుకున్న మేనత్త నా వాలకం ఎంతసేపటి నుంచి కనిపెడుతూందో. "అమ్మాయి! ఈ సాకులు చాలించు. అలకలు ఆపు. నీ ఒంటి వైపు చూచుకో. వెచ్చని కంచుకం తొడుక్కున్నట్టు ఈ పులకాంకురాలేమిటి? ఉజ్జ్వలాలింగన సుఖలాలసే సుమా ఇది! కనుక ఈ అలక మాని, సాకులు చెప్పక లోపలికి వెళ్లు. హాయిగా, వెచ్చగా పడుకోక, ఎందుకు లేనిపోని కచ్చులు?" అని మందలించింది.

సరే! పెద్దలమాట సద్దిమూట అన్నారుగా!

# చెడిపోక చావమంటారా?

ఔను! మీకేం? కావలసినన్ని నీతులు వల్లిస్తారు. చెడిపె చెడిపె అంటారు. చెడిపోకుండా ఎలా వుండగలదు చెప్పండి.

భర్తేమో ముసలివాడు. మంచి వయసులో వుంది. ఊరి నిండా యువకులు. వసంతకాలం. మరి చెడిపోకుండా చస్తుందా? ఆవిడ తప్పేముంది? తప్పంతా సమాజందే.

ముసలివాడికి ఎందుకు కట్టబెట్టారట చూచిచూచి? యువకులకు మరే పనీ లేదా? ఇంటి చుట్టూ పదిసార్లు పారా కొట్టడమేనా? వాళ్లను ఎందుకు అదుపులో పెట్టరు? రెండు చేతులూ కలిపితేనే చప్పట్లయినట్లు ఇద్దరు కలిస్తేనే గదా తప్పులు పుడుతాయి? గడపదాటకుండా ఇంట్లోనే పడివుండే వాళ్లదేనా తప్పు? వృషభరాజులులా వీథుల్లో తిరుగుతూ కనిపించిన సారణగండ్ల నుంచి తొంగిచూస్తూ, పరాచికాలాడే వాళ్లు పెద్ద మనుషులా? విసిగి వేసారి ఒక్కసారి కాలుజారితే దుర్మార్గులా? తనతాహతు తెలీకుండా ఎందుకట అందమైన యువతులు మగవాడికి? ఇంటికి అలంకారమా? నీ నవనాడులూ కుంగిపోయిన తర్వాత నవవధువు కావాల్సి వచ్చిందా బతుక్కూ? ఒక్క అమాయికురాలి గొంతు కోయడం కన్నా, వండి వార్చి పోయడానికి వంటలక్క చాలదా? ఏ శారీరకసుఖమూ లేకుండా ఎలా వుంటుంది చెప్పండి? మరి తప్పెవరిది?

★ ★ ★

పరిసరాలు చూద్దామా, శీలం కాపాడుకోడానికి ఎంత మాత్రమూ అనుకూలం కానివి. పగటికి ఒక కథ. రాత్రికొక కథ. అవి చేరవేసే వారూ, రెచ్చగొట్టడానికి, ప్రలోభపరచడానికి ప్రయత్నించే వారే.

"విన్నారా అమ్మగారూ! గృహపతి (పెద్దకాపు) కుమారుడు గోదావరి గట్టుకు వెళ్లాడట. ఇదే సందు కదా అని అతనిని ప్రేమించిన మన పక్కింటి కాపు కోడలు కూడా గోదావరి గట్టుకు వెళ్లి నదిని దాటడానికి వీలుకాని చోటు నుంచి దిగడం

ప్రారంభించిందట.... ఎంత పన్నాగం! ఆ గట్టు నుంచి జారి నదిలో పడుతుందనుకోండి. అతడు కాపాడడానికి వస్తాడు. పది మందీ చూస్తుండగానే ప్రియుని బాహుబంధంలో వుండవచ్చు. ఆపత్కాలం. జారి నదిలో పడి, మునిగిపోతున్న దానిని రక్షించాడు సుమా! అని మెప్పులు కూడా..." అంటూ దాసీదాని కబుర్లు.

★ ★ ★

గోదావరి గట్టంటే జ్ఞాపకం వచ్చింది. గోదావరి గట్టు దగ్గర వున్న పత్తి చేను. చేను విత్తడానికి నాగలిపూజ చేస్తుండగా చేతులు తరతర వణికాయి. మనస్సులో ఏవేవో ఊహలు. పత్తి చెట్లు గుబురుగా పెరుగుతాయి. వాటి మరుగున ఏమి చేసినా ఎవరికీ కనిపించదు... ఇలా ఇలా. "ఏమిటి అలా వణికి పోతున్నావే? పూజాసామగ్రి కింద పడిపోదూ?" అని గదిమారు ఆయన. అప్పుడుగాని తెలియరాలేదు. గతస్మృతులూ చెడ్డవే, ఆగామి ఊహలూ చెడ్డవే. ఏమీ చేతకాకపోయినా, లోకం చూపులో మగడే కదా! పొలంలో రభస ఎందుకని మనస్సు చిక్కబట్టుకున్నాను.

★ ★ ★

వణుకంటే పెద్ద వణుకు సుమా! అదృష్టం బాగుంది గనుక, సమయానికి తగినట్టు ప్రవర్తించి, సందేహం కలుగకుండా చేశాను గాని, లేకపోతే ఏమయ్యేదో! మా ఆయన పొలం వైపు వెళ్లగానే వచ్చాడు అతడు. చాటున మాటున సరేగాని, పట్టపగలు ఇంట్లోనే కదా! అంతగా వచ్చినతణ్ని వుత్తినే పంపడం ఏం బాగుంటుంది?

ఏదో కక్కుర్తిపడి లేచామో లేదో... పతిదేవుడు తిరిగి వచ్చారు, ఏదో మరచిపోయానంటూ. ఏం చేయను? దొంగ సరుకుతో పట్టుబడ్డ దొంగలాగ దిగాలుపడి పోయాను. పచ్చి అబద్ధమాడేశాను. "ఇదిగో చూడండి. ఏవో చిక్కుల్లో వున్నాట్ట. శత్రువులు తరుముకొని వచ్చారు. మన ఇంట్లో దూరాడు. తలుపులు వేసుకుని ఒగరుస్తూ పడిపోయాడు. చల్లని మజ్జిగ ఇచ్చి, 'మీకేం భయం లేదు. మా వారు పెద్ద గృహపతి. మీకు రక్షణ ఇస్తారు' అని ఉండమన్నాను. శరణాగతుణ్ణి కాపాడడం ధర్మం కదా!" అన్నాను. ఆయన అతన్ని పరామర్శించి రెండు నాళ్లు వుండమని, తర్వాత పంపి వేశారు. ఆ వున్న రెన్నాళ్లూ అతడూ సందేహం కలుగకుండా జాగ్రత్తగా మెలిగాడు. ఒకపూట ఆయనతో పాటు పొలానికి కూడా వెళ్లి వచ్చాడు.

అదృష్టమంటే అలా వుండాలి. పక్క వూరి చుట్టాల వ్యవహారం ఏదో వుంటే, వెళ్లారు. రాత్రి రానంటూ అతిథిని జాగ్రత్తగా చూడమన్నారు. సరే. ఆ రాత్రంతా ముప్పయి గడియలూ ముప్పయి సంవత్సరాల సుఖం అనుభవించాం.

ఈ ప్రక్రియ తెలిసిందిగా. మరొకమారు మరొక ప్రియుడు వచ్చాడు. "మా పుట్టించి నుంచి వచ్చాడు. మిమ్మల్ని కలుసుకోవాలని" అంటూ దగ్గరికి తీసుకువెళ్లాను. ఇద్దరూ స్నేహంతో కావలించుకున్నారు.

★ ★ ★

"కుంకుమపూవు రంగు చీర కట్టుకురా – చాలా అందంగా వుంటావు" అన్నాడు ప్రియుడు. వెళ్లాను. మసక చీకటి, వెన్నెల అప్పుడే వ్యాపిస్తూంది. తీరంలోని ప్రబ్బలి పొదల్లో పడుకున్నాం. చిలిపివాడు. ఊరుకుంటేనా? నా కొత్త చీర కాస్తా లాగేశాడు. అది గాలికి లేచి పొదల మీద నా చెడ్డతనానికి పతాకలాగ ఎగురసాగింది. ఏం చేయను? ఒక చేత్తో చీరకొన పట్టుకున్నాను. సుడిగాలికి దానితోపాటు నేనూ లేచిపోతానేమో ఆకాశంలోకి అనిపించింది. రాత్రి గనుక, గోదావరి గట్టు వూరికి దూరంగా వుంది గనుక బతికాం!

★ ★ ★

ఏదో వ్రతదినం వచ్చింది. తెల్లవారు జామునే స్నానం చేసి వస్తానని చుక్కపొడవక ముందు చెరువుకు బయలుదేరాను. చెరువు పక్కన వున్న నూవుల చేల్లో కాచుక్కూచున్నాడు అతడు. ఇద్దరం చేల్లో పొడుగ్గా చాలాదూరం నడిచి గుబురుగా వుండే స్థలం చూచుకున్నాం. ఆ చేలను, పక్కింటతనే సాయంత్రం వచ్చి తెగ గొణుక్కుంటున్నాడు, తన నూవుల చేల్లో ఎద్దు జొరబడి చాలాదూరం వరకు తొక్కేసిందని, నాకు నవ్వు ఆగలేదు.

★ ★ ★

ఎలా పసిగట్టాడో నా సంగతి మా వూరి వైద్యుడు. నాకూ ఇష్టంగానే వుంది. ఎలా వెళ్లడం? "తేలు కుట్టింది అని చెప్పి వచ్చేయి. నేను తెలిసిన వాళ్లను పంపుతాను. ఆడవాళ్లను చేతుల మీద నా కుటికి చేర్చేస్తారు నిన్ను. మీ ఆయన వున్నప్పుడే ఈ నాటకం ఆడు" అని చెప్పంపాడు వైద్యుడు. ఎన్ని అవసరాలు వస్తాయో? ఆయనకూ చీటికిమాటికి మందులు కావాలిగా! వెళ్లక తప్పలేదు. అతని ఇల్లు మరీ సత్రం. రెండోసారి రానని చెప్పాను. అతనికీ పరువు అనేది వుంది గదా. తల పంకించాడు.

ఆయన ఎదుట ఆడిన నాటకాలు చాలా వున్నాయి. ఒకనాడు ఆయన ఎవరింటికో వెళ్లారు. అక్కడ మద్యం సేవించి వచ్చారు. ఇంటికి వచ్చి మత్తులో నా ముఖం మద్యం వాసన కొడుతూంది అన్నారు. చిన్న మరది వున్నాడు ఇంట్లో అతనికి నా

అభిప్రాయం ఎలా తెలుపాలా అని ఆలోచిస్తున్నాను. ఇప్పుడు మంచి అదను దొరికింది. "చూడు మరదీ- నా నోరు మద్యం వాసనట!" అంటూ అతని పెదవులు ముద్దు పెట్టుకున్నాను. అతను మరీ మరీ దగ్గరికి వస్తూ 'అన్నయ్యవి వట్టి అబద్ధాలు వదినా!' అంటూ ఆనందించాడు. ఆయనేమో మత్తులో తమ్ముడి మాటలకు విరగబడి నవ్వారు.

★ ★ ★

నా మొట్టమొదటి ప్రియుడు మరణించాడు. అతనితోపాటు మరణిద్దామనేంత ఉద్వేగం కలిగింది. లోకం నవ్విపోదూ అలా చేస్తే? గట్టిగా ఏడుద్దామన్నా భయంగా వుంది, గుట్టు బయట పడిపోతుందని. ఏం చేయను? ఏం చేయను? గుండెలు మండిపోతున్నాయి. ఈ దొంగచాటు జీవితం! ఇష్టులు చస్తే మనసారా ఏడ్వడానికిక్కూడా వీలు లేదు.

★ ★ ★

ఆహా! కాలగతి! ఎంత మార్పు వచ్చింది? నేనంటే పడిచచ్చేవాడు, శృంగార కావ్యాలు తెగ వినిపించేవాడు, వాటి సారస్యాలు ఆచరణలో పెట్టేవాడు, ఆచరణలో పెడుతూ సమన్వయం వ్యాఖ్యానించేవాడు. అలాటివాడు ఇప్పుడు నేనంటే తప్పుకు తిరుగుతున్నాడు. ఏకపత్నీవ్రతుడిలాగ, పరస్త్రీ పరాఙ్ముఖుడిలాగ ప్రవర్తిస్తున్నాడు. పరాశరధర్మశాస్త్రం చదువుతున్నాట్ట. అంతా ఇంతే అవసరం తీరిం తర్వాత, జనం ఏమనుకుంటే ఏం? వారికి పర పురుషసుఖం ఏం తెలుసు? నిజ పురుషుడితోను పరపురుషుడనే మెలిగాను అని ఆక్షేపించే వాళ్ల నోరు మూయించాను. ఈ పరాశరధర్మశాస్త్రం చదువుతున్న యువకుడు నా కళ్లు తెరిపించాడు. ఇక నేనూ నా పతిదేవునితోనే వుంటాను. ఎంతయినా భర్త భర్తే! ఎంత మంచివారు పాపం! ఎన్ని తిరుగుళ్లు తిరిగినా ఊరుకున్నారు. ఇలాటి పతిని మించిన దైవం వున్నాడా?

(*గాథాసప్తశతి*: 2-27, 65, 66, 98, 3-37, 97, 4-1, 5-61, 8-66, 67, 68, 70, 71, 76, 882, 86, 952)

# మాకొద్దీ మంచి పొరుగు!

**పొ**రుగున మంచి వాళ్లు వుండడం వల్ల మాబోటి వాళ్లకు చాలా నష్టం, కష్టమూను. వాళ్ల పోలికలతో మననూ చూస్తారు. అవకాశం కలుగకపోతే అంతా మంచి వాళ్లే. కాని, ఆ పొరుగింటావిడ నిజంగా మంచిదే అనుకో...

నాలుగుదార్ల కూడలిలో ఇల్లు. అందరికంటా సులభంగా పడుతుంది. రాకపోకలకూ సులువు. అందంగానూ వుంటుంది. భర్త వ్యాపారం కోసం సంవత్సరమనగా వెళ్లాడు. ఇంకా రాలేదు. ఎప్పుడు వస్తాడో తెలియదు. సముద్ర వ్యాపారానికి వెళ్లిన వాడు తిరిగి వస్తాడన్న నమ్మకం లేదు. వస్తే గాని నమ్మకం నిజం కాదు. పక్కన చెడిపె- అంటే ఇరుగు పొరుగూ అంతా అలాటివారే. వీటన్నిటినీ మించి దారిద్ర్యం. అయినా ఆవిడ శీలం చెడలేదు. బాగుంది! ప్రశంసించవలసిందే కాని ఆవిడను చూసి మావంటి వారిని ఎత్తి పొడుస్తారు. ఏం చేయను?

మరొక సంగతి చెప్పనా? వసంతకాలం వచ్చింది. మాలాంటి వాళ్ల మనస్సు కుతకుతలాడిపోతూంది. అయినా ఆవిడ మనస్సు చెక్కుచెదరలేదు. వసంతకాలానికి సాధ్యం కానిదేముంది గనుక? అయినా, ఆవిడను వసంతఋతువు ఏమీ చేయలేకపోయింది. మరీ వింత ఏమిటంటే, ఎర్రగోరింటలు పూచాయి. వాసన గుప్పుమంది రాత్రిళ్లు. అయినా, ఆవిడ తపస్సులో వున్న పార్వతీదేవి లాగ నిశ్చలంగా వుండిపోయింది. మరి నా వొళ్లు మండదూ? ఏమిటి ఈవిడ గొప్పతనం!

ఏమైనా, ఆవిడ గుణాలు కొన్ని నా బోటిదీ అనుసరించవలసినవే. ఇంట్లో ఏముంది, ఏమి లేదు అనే విషయాలు ముందుగా కనుక్కోడం, ఇంట్లో వాళ్ల కష్టం, సుఖం చూడడం.

అయినా, ఈ కులస్త్రీలకు ఏమి పోయేకాలం! తమ బాధలను ఎవరికీ చెప్పరు. ఏడిస్తే చాలా తేలికవుతుంది మనస్సు, అదీ చేయరు; ఎవరైనా వింటారేమోనని భయం! కుమిలికుమిలి చస్తారు-వాళ్ల కర్మ!

పక్క వీథిలో ఒక ఇల్లాలుంది. నిజంగా మెచ్చుకోవాల్సిందే. అత్తగారు మహాక్రూరురాలు. ఇంటి బరువంతా ఆమె మీదే పడేసి హాయిగా తిరుగుతూంటుంది. సాయంకాలం సంధ్యాసమయంలో క్షణం తీరిక దొరికేది.

అప్పుడే కలుసుకొనేది భర్తను. మరొక విచిత్రమేమిటంటే, భర్త పని మీద ప్రవాసానికి వెళ్లితే, ఆమె యౌవనలావణ్య విభ్రమవిలాసాలు కూడా అతనితో పాటే తరలిపోయేవి. అతడు తిరిగి రాగానే, తిరిగి వచ్చేవి.

అలా వ్యాపారసాపారాలు చేసి, అలసి పోయి ముసలి వాడయ్యాడు. వయస్సులో వున్నంతవరకు కష్టపడ్డాడు. సంపాదించింది కరిగిపోతూ వచ్చింది. అయినా, ఆవిడ మరీ ప్రేమతో చూచేది, ఉపచారాలు చేసేది. మాబోటి వాళ్లు డబ్బు లేని ముసలి పీనుగను ఎందుకు చూస్తారు? అగ్నిసాక్షిగా కట్టుకున్న భార్యలు చూస్తారు మరి. ఆవిడకే ఏం మహా! మా బోటి వాళ్లకూ మంచివే. అలాటి వాళ్లను ఎవరన్నా మెచ్చుకుంటారు. తక్కిన ఆడవాళ్లు మగవారి పాలిటి ముసలితనం అంటారు.

కోపం వచ్చిందా, భర్తను ఒక్క మాటా అనదు, ఒక నవ్వు నవ్వుతుంది. అదే అతనికి రంపపుకోతగా వుంటుంది. తన కష్టం తెలుపడానికి పద్ధతేమిటంటే, మరీ విపరీతంగా ఉపచారం చేయడం. దానితో తెలుసుకుంటాడు భర్త, ఏదో కష్టం కలిగింది అని. కంట తడి పెడుతుంది. అదేనన్న మాట పోట్లాట. ఇవి మాబోటివాళ్లు అనుసరిస్తా మనుకోండి, ఒక్కరూ దగ్గరకు రారు. "ఇంట్లో ఈ బాధలు పడే కదా వినోదం కోసం ఇక్కడికి వచ్చాం! ఇక్కడకూడా అదే తంతయితే రామ్ రామ్" అంటారు.

ఒక సరసుడు చెప్పాడు తన భార్యను గురించి- పలువరుస కనపడకుండా నవ్వుతుందట. ఎంత తిరిగినా, ఇంట్లోనే, పెద్ద బవంతి పడసాల. తలవాకిలి దాటదట. తల ఎత్తే చూడదట. "అంత పత్తిత్తును వదలి ఇక్కడికెందుకు వచ్చావు?" అనడిగాను. "నాకు నోరు విప్పి నవ్వేవాళ్లు, చక్కగా తలెత్తి చూచేవాళ్లు కావాలి" అన్నాడు.

మరొక సరసుడన్నాడు- తన అర్ధాంగికి సిగ్గే నగలట. పరపురుషుడంటే, ఏమిటోనట. చెడ్డ పనులు అంటే తెలీనే తెలీదట. "మరి ఎందుకు దయచేశావు, అంత మంచి ముద్దరాలిని వదిలి?" అనడిగాను. "ఎప్పుడూ లడ్డుకలు తింటున్నవాడికి చింతచిగురు మీద మనసు పోయినట్టు" అన్నాడు. ఈ మగవాళ్లకు మార్పు కావాలి.

నిజమే మరి. వంకరలు లేని ముగ్ధహాసం, విలాసాలు లేని సౌందర్యం, స్వభావ సరళమైన పలుకులు బాగానే వుంటాయి కాని, ఎప్పుడూ అదే పద్ధతి అయితే విసుగు పుడుతుంది. విలాసాలు కోరక ఏం చేస్తారు పాపం!

అందుకే అన్నారు పెద్దలు భార్య భార్యే, భోగిని భోగినియే అని. ఏమయినా అలాటి అంతటి మంచి పొరుగు మాకెందుకు? మేము సామాన్యనాయికలం. సామాన్యంగానే వుంటాం.

ఆ కులపాలికల పోలికలు మనకెందుకు? రాని హంస నడకలెందుకు? కాకి నడకలతోనే వుందాం.

ఈ మగమహారాజుల సంగతి చూచావో లేదో! విలాసాలు, వినోదాలు, వింతలు, విడ్డూరాలు కావాలి. కాని, అవి తమ పెళ్లాలకు వుండరాదు. ఉంటే మరొకరు చూస్తే ప్రమాదం కదా! వెంటబడితేనో? కనుక వాళ్లు అమాయికలుగా నటించనన్నా నటించాలి. ఆ విలాసాలు, వినోదాలు మన వద్ద తీర్చుకోవాలి. విలాసాలుంటే ఎవరన్నా చెడిపోతారా? చెడిపోవడానికి ముఖ్యకారణం మగవాళ్లే.

ఇంతకూ, మనకెందుకీ చర్చ? మన బతుకులే వేరు. ఉత్తమ ఇల్లాళ్లతో సాపత్యం ఎందుకు మనకు?

(గాథాసప్తశతి: 1-36, 3-19, 93, 6-12,
13, 25, 8-60, 61, 63, 65, 9-69)

# సంకేతస్థలాలు

**తె**లివితేటలంటే ఈ ఊరివాళ్లవే. ఊరి వెలుపలి మఱ్రిచెట్టు గుబురుగా పెరిగింది. అది చాలాకాలంగా ప్రేయసీప్రియుల సమాగమస్థానంగా వుంటూంది. ఆ పెద్ద మఱ్రిచెట్టు ఎక్కడికక్కడే ఊడలు, కొమ్మలు పెనవేసుకొని పొదరిళ్ల గుంపులాగ కనిపిస్తుంది. ఇంత అందంగావున్న చెట్టు కింద హాయిగా కూచుంటారు ఏ బాటసార్లయినా సేద తీర్చుకోడానికి.

చేతిలోని మూట పక్కనే పెట్టి ఒక ఊడను ఆనుకొని కూచుని అమ్మయ్య అనుకుంటూ పైకి చూతును గదా, ఆకులన్నిటి మీదా కాకిరెట్టలు! "ఇదేమిటి అలసి సొలసి అక్క ఇంటికి వస్తే అక్క ఏమో చేసింది అన్నట్టు, విశ్రాంతి తీసుకుందామని వస్తే రెట్టల బెడదా?" అనుకుంటూ, పెద్ద చెట్టు కదా, మరో ఊడవద్దకు వెళ్లాను. అక్కడ కూడా ఇదే రెట్టల రొష్టు!

ఛ! ఇలా ఎక్కడయినా చెట్టునిండా రెట్టలూ, ప్రతి ఆకుమీద రెట్టలు వుంటాయా? అనుకుంటూ ఒక ఆకును గిల్లి పరిశీలనగా చూచా. రెట్ట కాదు, పిండి మరకలు!!

అప్పుడు తోచింది, ఇదేదో ప్రేయసుల వ్యవహారమయి వుంటుందని. దారినపోయే పథికులు ఈ గుబురయిన చెట్టుకింద నీడలో కూర్చుంటారు. నాలాగే పైకి చూస్తారు. మఱ్రాకులు బాగున్నాయి, విస్తర్లు కుట్టుకుందామనుకుని కోసుకుపోతారు. పది మంది చేయిపడితే పచ్చనిచెట్టు బోడిదై పోతుంది. ఈ ఆలోచనతో పిండి కలిపి చిలకరించినట్టున్నారు. అందరూ నాలాగే పరిశీలనగా చూస్తారా, రెట్టలా, పిండి మరకలా అని. మరో చెట్టుకింద తలదాచుకుంటారు. అందువల్లనే అన్నాను తెలివి తేటలంటే ఈ వూరి వాళ్లవేనని!

ఇలా ఏదో ఉపాయం ఆలోచించకపోతే చెట్టు నిజంగానే మోడవుతుంది. నేనయితే ఈ చెట్టుకింద మొండిగా కూర్చున్నాను గాని, తక్కిన పాంథులు అదిగో ఆ చెట్టుకింద కూచున్నారు. పైన పచ్చగా, ఎఱ్రగా కనిపిస్తే ఆకులూ పళ్లూ ఎంత బాగున్నాయి

అనుకుంటున్నారో లేదో, ఒక్కసారిగా పక్షులు ఎగిరినట్టయి పైకి చూచారు. చెట్టు మోడుగా నిలిచింది. ఆకులూ పళ్లూ అనుకున్నవి చిలుకల రెక్కలు, ముక్కులూను. వాళ్లు కూచోగానే తుర్రుమన్నాయి. బాటసార్లు చేతులు తడుతూ విరగబడి నవ్వారు. ఔను! నాలాటి బాటసార్లు ఆకులు కోసుకోవడం వల్లే – ఆ చెట్టు మోడయిపోయి వుంటుంది.

సంకేతపు మర్రిచెట్టుపై ఎన్నెన్ని కథలు, గాథలు! ఆ మధ్యన ఒక ఊరి మర్రిచెట్టు కింద కూర్చున్నాను. ఒక ఇల్లాలు ఎవరితోనో ఏమో అంటూంది. గుండె మండి వుంటుంది. లేకపోతే అలాటి ఆవేదన వెలువడదు. భర్త పూర్తిగా తిరుగుబోతు అయి వుంటాడు. కనుక చెడిపెలను దుమ్మెత్తి పోయడం సహజం. ఆ ఇల్లాలు అన్నది గదా!

"అత్తయ్యా, చూచావా, పండబారి పచ్చగా అయిన ఆకులు గాలికి రాలి పోతున్నాయి. అవి ఆకులు కావు సుమా. గాలికి ఆకులు రాలి, చెట్టు మోడుబారి తమ విలాసాలకు ఎక్కడ ఆఘాతం కలుగుతుందో అని దిగులుపడి తెల్లబారిన చెడిపెల హృదయాలు సుమా!"

పాపం ఎంతగా బాధపడిందో! ఆ బాధలోను ఎంత చక్కగా పోల్చిందో!

ఈ సంకేతాల, సంకేతస్థలాల పురాణం మహా దొడ్డది. ఒకసారి ఏమైందంటే ఒక జాతరకు వెళ్లాను. ఏ సత్రం అరుగో, గృహస్థు ఇంటి అరుగో కదా జాతర్లలో యాత్రికుల విడిది. ఒక ఇంటి అరుగు మీద తిష్ఠ వేశాను. లోపల ఏవో మాటలు వినబడ్డాయి. మనకెందుకులే అని అనుకున్నా, వినక తప్పింది కాదు. కారణం ఇంటి యజమానురాలు కాబోలు గట్టిగానే చెబుతూంది– "ఈ పాడు చచ్చిన రాత్రి. కారుచీకట్లు. ఇంటాయనయితే వ్యాపారం మీద పొరుగూరు వెళ్లాడు. ఇల్లంతా శూన్యం. నేను తప్ప మరో ప్రాణి లేదు. పక్కింటి పెద్ద మనిషీ, దొంగలు కొడతారేమో! మేల్కొనే వుండు" అని. ఎవరితోనో మాట్లాడుతూందనుకున్నాను మొదట్లో. పూర్తిగా విన్న తర్వాత ఆరి దీని... ఎంత గడుసుది! 'ఇంట్లో ఎవరూ లేరు. వచ్చేయి' అని ఎంత గుంభనగా చెబుతూంది? అనుకుని తెలివితేటలకు సంతోషించాను కాని, పెడదారి పట్టిందే అని విచారపడ్డాను.

జాతరంటే చెప్పాలా, భక్తిప్రపత్తులతోపాటు రక్తియుక్తులూ సాగిపోతుంటాయి. శృంగారపు బేరాలు, కుంటెన కత్తెల కార్యకలాపాలు కొనసాగుతుంటాయి. ఎక్కడి ఉప్పో, ఎక్కడి చింతపండో కలుస్తూంటాయి. అదొక చోర ప్రణయపర్వం!

జనం ముందే ఒకరికి తెలీకుండా సాగుతాయి ఈ కథలు. మీరు కనుక్కోలేరు. నా వెంట రండి. జాతరలో ఎవరి గొడవలు వారివి కదా! అయినా కొందరు ఇతరుల సంగతే పట్టించుకుంటారు. అదిగో చూడండి. ఆ అందగాడు, ఆ అందగత్తె మీద కన్ను వేశాడు. ఇద్దరికీ తెలిసిపోయింది తమ తమ అభిప్రాయం. బహిరంగంగా జరుగగూడదు వ్యవహారం. గుట్టుగా జరుగాలి. ఒప్పుకున్నాం. కలుసుకుందాం అని పరస్పరం చెప్పుకోవాలి గదా! అతడేమో తన పెద్ద కళ్లు మరీ పెద్దగా చేసి, సంతోషం ప్రకటించాడు. జాతరలో ఏదో చూచి ఆశ్చర్యపడి కళ్లు పెద్దవి చేసి వుంటాడని ఇతరులు అనుమానించరు. ఆ అందాల గుమ్మ కళ్లతో సైగలు చేస్తే పట్టుపడుతానని అలా చేయలేదు. అతని అభిప్రాయం తెలీగానే ఒళ్లు చెమర్చింది సంతోషసంభ్రమాలతో. జాతరలో అలసి చెమటలు కక్కుతూందేమోనని ఇతరులు అనుకుంటారు. అనుమానించరు. ఇలాంటి పిట్ట కథలు ఎన్నో!

చేయరాని చోట్ల చెడ్డ పనులకు పూనుకొని దెబ్బలు తిన్న వారూ చాలామందే. జాతర నుంచి ఊరిలోకి వస్తున్నాను. ఒక గృహస్థు ఇంటి ముంగిట్లో పాద్రి చెట్టు. ఏపుగా, ఎత్తుగా పెరిగింది. కింది కొమ్మలు కొట్టి వేయడం కష్టం. ఆ ఇంటి ముందు తారట్లాడుతున్నారు యువకులు. వారి వెర్రిచేష్టలు చూస్తూ పొరుగింటి ఇల్లాలు మందలించింది. "అబ్బాయిలూ, పాద్రిచెట్టు నిలువునా పెరిగింది. ఎక్కి పూవులు కోద్దామా అంటే, కొమ్మలు లేనందున ఎక్కడం పడదు. కష్టపడి ఎక్కినా, జారిపడి పోతారు సుమా!" అని.

పాద్రిచెట్టు సాకుతో ఆవిడ చెప్పినదాని సారాంశ మేమిటంటే, ఇంటి వాళ్లు గడుసు పిండాలు. మీ ఎత్తులేమీ సాగవు. ఎత్తి పడేస్తారు. జాగ్రత్త–అని.

కాని, ఒకొకప్పుడు వున్న స్థితిని తెలుపడం కూడే ఏదో సంకేతమని భ్రమ కలిగిస్తుంది.

ఒక ఇల్లాలు ఇంట్లో– పిచ్చి అత్తగారు. కుంటి కుక్క. భర్త పొరుగూరు వెళ్లాడు. పత్తి చేనును ఊరి దున్నపోతు మెట్టి పాడు చేస్తూంది. ఎవరితో మొర పెట్టుకుంటుంది? ఈ మాటలే పైకి అనిందా, ఏదో సైగ సుమా అనుకుంటారు. మంచి ఇల్లాళ్లు ఇలా మథనపడుతుంటారు.

(గాథాసప్తశతి: 2-66, 79, 3-63, 95, 4-35, 44, 5-68, 6-49)

# ఇప్పపూవూ... ఇప్పపూవూ!

**మ**న్మథుడు మహామేధావి, మహాశూరుడు అనుకున్నాను గాని, అంత మందబుద్ధి మరొకడు లేడనుకుంటాను. ఎందుకంటావా, ప్రియతములను జ్ఞాపకపరచేవి, విరహులను కలిపేవి, శరీరానికీ, మనస్సుకు మహోల్లాసం కలిగించేవి ఇప్పపూలు గదా. వాటిని తన బాణాలలో చేర్చలేదు గనుక.

ఇప్పపూలు ఎంత ఇంపుగా ఉన్నాయో! ఆ పథికుడు ఎంతో కాలమయింది ఇల్లు వదలి. ఇప్పపూల కాలం వచ్చింది. ప్రియురాలు తలపులో మెదలింది. గుప్పెడు ఇప్పపూలు తీసుకున్నాడు. ప్రియురాలి మెత్తని, నున్నని చెక్కులలాగా ఉన్నాయి ఆ పూవులు. మనకు ఇష్టమయినవారి పోలికలున్న వస్తువులపై మక్కువ ఏర్పడడం సహజం. ప్రియురాలి చెక్కులలాంటి ఇప్పపూలున్న గుప్పిలిని ముక్కు వద్దకు సుతారంగా తీసుకువెళ్లాడు. మూర్కొన్నాడు. ఇప్పపూవుల మత్తువాసన మెదడుకు చేరింది. గుప్పిలిని కొంచెం కిందికి దించాడు. పెదవుల వద్ద అద్దుకున్నాడు. ముద్దులవర్షం కురిపించాడు. మరికొంత కిందికి దించాడు గుప్పిలిని రొమ్ము పైన పెట్టుకున్నాడు పూవులను. ప్రియురాలు వచ్చి కౌగిలించుకొన్నట్లయి ఒళ్లు పులకరించింది. పరవశుడై పోయాడు; ఇప్పపూవు ప్రియురాలి వంటిదే. రెండూ మత్తెక్కిస్తాయి, పరవశులను చేస్తాయి.

ఎంతో ప్రపంచజ్ఞానం గల పురుషుల పరిస్థితే ఇలా ఉన్నప్పుడు, ప్రేమమూర్తులయిన అమాయిక గ్రామ స్త్రీల సంగతి చెప్పాలా? వారికి ఇప్పచెట్లు, ఇప్పపూలు ఎంత ఆప్తమైనవి! ఒక ప్రియతమ ప్రియుడిని కలుసుకోవాలంటే ఎన్నో అవాంతరాలు! ఊరి బయటి ఇప్పచెట్ల గుబురుకు రమ్మంటుంది ప్రియుణ్ని. ఇప్పపూవులు త్వరగా ఏరుకు రావాలి. వాటిని మరగబెట్టి మద్యం కూడా తీయాలి ఇంట్లో. ఆలస్యమైతే ఇంట్లో వాళ్లు అనుమానిస్తారు. “ఇంతసేపా పూవులు ఏరడానికి?” అని అడుగుతారు. “అన్నిటినీ ఒక కర్రతో ఒకచోట కుప్పగా కూర్చి గంపకెత్తుకోడం ఎంత సేపు పడుతుంది?–” అంటారు. అందుకోసం ఆ అమాయిక ప్రియురాలు మధూక వృక్షాన్నే - ఇప్పచెట్టునే - ప్రార్థిస్తూంది.

"గోదావరి గట్టులో ఎగుడుదిగుడుగా పెరిగిన పొదరిళ్లలోని మధూక వృక్షరాజమా! నీ కొమ్మలు విరగబూచి భూమికి వంగాయి. నీ కెంతో అందాన్ని ఇస్తున్నాయి. నీవు త్వరత్వరగా పూవులు నేలమీద విదిలించావా, నేను త్వరగా ఏరుకోవాల్సి వస్తుంది. ప్రియుడు చాలాకాలానికి నన్ను కలుసుకుంటున్నాడు. అతనితో కొంచెం సేపన్నా మాటలు, ముచ్చట్లు వుండాలి కదా! కనుక, నీవు పూవులను ఒక్కటొకటిగా రాల్చు. నిదానంగా ఏరుకుంటూ ముచ్చట లాడవచ్చు ప్రియునితో. నా మనవి మన్నించు సుమా! –" అని వేడుకుంది. పాపం! ఇప్పచెట్టు ఆమె మాట వింటుందా, పెడుతుందా? చూద్దాం.

ఇప్పచెట్టుక్కూడా మనసుంది సుమండీ! ఆమె మాట విన్నట్టుంది. ఇద్దరికీ చాలాకాలం ఆశ్రయమిచ్చి, సుఖపడేట్టు చేసింది. కాలం ఒకే రీతిగా వుండదుగదా! ఋతువు మారగానే ఇప్పపూవుల కాలం అయిపోయింది. ఒకటీ అరా రాలుతున్నాయి. ఇక ఇప్పపూలు ఏరే సాకుతో ప్రియుణ్ణి కలుసుకొనే అవకాశం వుండదు కనుక ఆ పూవులను చూడలేకపోతున్నది. ఏడుస్తూ, మరణించిన వారి అస్థులను అస్థిసంచయనం నాడు ఏరుతున్నట్టు ఏరుకుంటూంది. ఏం చేస్తాం! ఎవరికి ఎంత ప్రాప్తమో అంతే, మంచయినా, చెడ్డయినా.

ఇలాటి పనులు ఎప్పటికైనా బైట పడేవే గదా! భర్తకు సందేహం కలిగింది. అయినా ఇప్పపూల కాలం కాదు గనుక మనసులోనే పెట్టుకున్నాడు. మళ్లీ ఇప్పపూల కాలం వచ్చింది. భర్త ఆమెను రాత్రిళ్లు ఇప్పపూవులు ఏరడానికి పోవద్దని చెప్పి, తానే పోవడం ఆరంభించాడు. పరిస్థితి తారుమారయింది. ప్రియురాలికి ఈ పరిస్థితి మరీ అనుకూలమైంది. ఈ సంగతి ప్రియునికి చేరవేయాలి. తన చెలిని పిలిచి చెప్పింది, ఈ వార్త చేరవేయి నా ప్రియునికి అని.

ఆ చెలి చాల చతురురాలు. పొరుగింటి గేస్తురాలితో మాట్లాడే సాకుతో సంగతి చేరవేస్తుంది. ఇంతవరకు ప్రియుడికి ఈ కార్యక్రమం మారడం తెలీదు. ఇప్పపూవుల కోసం ప్రియురాలు వస్తుంది కదా అని అతడు ఇప్పపొద వద్ద వేచి వుండవచ్చు. మారిన పరిస్థితిలో ప్రియురాలి భర్త ఇప్పపూవుల కోసం ఎలాగూ వెళ్లుతాడు. అప్పుడు అక్కడ ప్రియుడు వేచి వుంటే భర్త అతనిని చూడడం, దొంగ అనో, తన భార్యకోసం వచ్చిన వాడనో అని అనుమానించడం, మాటా మాటా పెరగడం, చేతులూ చేతులూ కలవడం మొదలయిన అనాహూతాలు జరుగవచ్చు. అందువల్ల చెలికత్తె ఎంతో రహస్య గర్భంగా అంటూంది పొరుగింటావిడితో: "చూచారా! నా మిత్రురాలి భర్త ఎలాటి

వాడో! నిరుడు ఆవిడే ఇప్పపూవులు ఏరుకొని వచ్చేదా సరదాగ. ఇప్పుడేమో భర్తకు కొంత సందేహం కలిగింది. తను వెళ్లుతానని, భార్యను ఇంట్లోనే వుండమని చెప్పాడు. తానే పూవులను ఏరుకొని వస్తాడట! ఎంత అమాయికుడో తెలిసిందా?"

ఈ మాటలను విన్నాడు ప్రియుడు. "ఇంట్లో ఎవరూ లేరు. భర్త ఇప్పపూవుల కోసం వెళ్లాడు. గంపనిండే వరకు రాడు. అప్పటికి తెల్లవారుతుంది. నీవు ఇంటికే సరాసరి వస్తే సరి, గుట్టు చప్పుడు లేకుండా. ఏ బెడదా వుండదు. ఇప్పచెట్ల కిందేమో ఎవరన్నా ఆకతాయిలు వస్తారనే భయం వుంటుంది. ఇక్కడ నిశ్చింత. ఎలాటి భయమూ లేదు. కనుక ఇల్లు పదిలం" అని గ్రహిస్తాడు.

చూచారా, గృహస్థు అమాయికత! తాను ఇల్లు కదిలితే మరీ ప్రమాదమని గ్రహించలేక పోయాడు. ఒకటి రెన్నాళ్లు ఇప్పపూవులు ఏరకపోతే ఏమిటి? ఇంట్లో వుండవచ్చుగా!

బాగా అన్నారు. ఇప్ప పూవులు ఏరుకొని రాకపోతే కొంప మునిగిపోదూ? పూవుల నుంచి మద్యం సిద్ధపరుస్తారు. దాంట్లో కలువలు, కమలాలు వేస్తారు. వాటితో దానికి ఎక్కడలేని గుమాయింపూ వస్తుంది. తమ ఉపయోగానికి సరిపడా వుంచుకొని తక్కినది పొరుగున వున్న పట్నంలో అమ్ముకుంటే బోలెడు రూకలు. అతని యావ అతనిది. అమ్మగారి దోవ అమ్మగారిది.

ఆడవారి మనస్సు మరీ సున్నితం. ప్రియుల సాధారణప్రేమ వాక్యాలకే మత్తెక్కిపోతూంటారు. ఇక మత్తు కలిగించే ఇప్పపూల గాటుకు మరీ కైపెక్కిపోతారు.

ఆ మదవతి ఒంటరిగా వుంది. భర్త ప్రవాసంలో వున్నాడు. విరహంతో వేగిపోతూంది. ఎంతోకాలం నిగ్రహంతో ఉంది. కాని ఇప్పపూవుల వాసన మత్తుకు నిలువలేకపోయింది. విరహానికైనా అవధులు, గడువులు వుంటాయి. ప్రియుడు, భర్త రావడం ఏండ్లు పూండ్లు పట్టినా పట్టవచ్చు. నిగ్రహం సడలింది, పిచ్చెత్తిపోతుందేమో నన్నంత ఆవేదన!

ఒంటరిగా ఇంట్లో వుండలేక, కానున్నది కాకమానదనే నమ్మకంతో ఇప్పపూవులు ఏరడానికి ఊరికి దూరంలోని ఇప్ప వనానికి వెళ్లింది. ఇంతకీ ఒక పథికుడు ఆ దారిన వెళ్లుతున్నాడు. అతడూ ఇప్పపూల వాసనకు తబ్బిబ్బయ్యాడు. చేరెడు మానులు ఒంటికి అద్దుకుని చల్లదనం పొందుదామనుకున్నాడు. రెండు పూవులు ఇమ్మని కోరాడు ఆవిడను.

ఆకలితో వుంది పాపం! నిగ్రహం సడలింది ఇది వరకే. పురుషుణ్ని చూడగానే అంగాలు స్వాధీనం తప్పుతున్నాయి. మనస్సు కోతిలాగ గంతులు వేస్తూంది. పథికుణ్ని చూచింది. తనలాగే విరహపీడితుడిలాగ, సుహృదయుడిలాగ కనిపించాడు. ఎదుటివారి బాధ తెలుసుకొనేవాడయితే వింటాడు మాట- అని అనుకుంది. ఇలా అన్నది:

"పాంథుడా! ఇప్పపూవులు కావాలా? ఇంకేమీ వద్దా? ఇప్పపూవులే కాదు. నా సుందరనితంబం మీది గుడ్డను కూడ ఇస్తాను. నేనివ్వడమేమిటి? నీవు నా నితంబంమీది చీరను లాగివేయి. నేనేమీ అనను, ఎవరితోనూ చెప్పను. ఇంతకూ ఇది అరణ్యం. ఈ అరణ్యంలో ఎవరికి చెప్పను? ఊరు దూరంగా వుంది. నేను ఒంటరిదానిని. నీవూ ఒంటరివాడివి. నేను ఏమి చేసినా, నీవూ ఏమీ చేయలేవు. మనం ఏం చేసుకొన్నా ఎవరు చూడవచ్చారు? ఎవరు వినవచ్చారు?" అని ఉద్రేకంతో ఊగిసలాడింది.

ఆహా! ఇప్పపూల మత్తు వాసన మాహాత్మ్యం! ఇద్దరు ఒంటరిగాళ్లూ ఒక్కటయ్యారు. ఇప్పపొద వారిపై పూలవాన కురిపించింది!

(*గాథాసప్తశతి*: 2-3, 4,59; 7-39, 8-71)

# అబ్బ! ఏమిటి వీళ్ల గొడవ!

అబ్బబ్బ! ఈ ధార్మికులతో పెద్దచావు వచ్చి పడిందంటే నమ్ము సఖీ! వీళ్లు ధర్మశాస్త్ర ప్రకారం నడచుకుంటూ ధార్మికులని, బొందెతో స్వర్గానికి వెళ్లేవాళ్లని పేరు తెచ్చుకుంటారు గొప్పగా. కాని మన కొంప నిలువునా కూల్చుతారు.

పొరుగింటి ఆ ధార్మికునికి ఏమి పోయే కాలమో చెప్పు మరి. తన ఆచారాలేమో, వ్యవహారాలేమో, తన పూజలేమో, పునస్కారాలేమో చూచుకోవచ్చుగా. ఊహుఁ! అలా చేయడు. మనం ఎంతో ప్రేమగా, సంకేతస్థానంగా పెట్టుకున్న కానుగపొదల పుల్లలే కావాలా, పళ్లు తోముకోడానికి? ఇంకెక్కడా కానుగ చెట్లే లేవా? కానుగ పుల్ల లేకపోతే ఈయన గారి ముత్యాలలాంటి పలువరుస పరిశుభ్రం కాదా?

ఇంకా చుక్క పొడవకముందే హాజరు, గోదావరి గట్టుమీద కానుగ పొదకు. రాత్రంతా గడచిపోయింది తియ్యని గుసగుసలతో. ఎంత తియ్యని ముచ్చట్లు! ఎంత తియ్యని కాలం. ఆ నల్లటి రాత్రి ఆ ముచ్చటలతో ఎంత హాయిగా వుంది! కమ్మతెమ్మెరలు గోదావరి మీదుగా వీచుతూ, చల్లగా ఒంటికి తగులుతూంటే ప్రియుని రాక, ప్రియుని కౌగిలి, ప్రియుని మాటలు మరింత చల్లగా, హాయిగా వున్నాయి. ఆ హాయిలో ఎప్పుడు కళ్లు మూతలు పడ్డాయో ఇద్దరికీ. కళ్లు తెరిచే వేళకు ఇతగాడు - ధార్మికయ్య - ప్రత్యక్షం! మీగాళ్ల మీద నిలుచుని, చిటారు కొమ్మను అందుకుంటున్నాడు. స్వర్గానికి వెళ్లుతున్నట్లుగానే వుంది మీగాళ్లు పైకెత్తడం చూస్తే. స్వర్గానికి వెళ్లినా బాగుండును. ఇలాంటి వాళ్ల పీడ విరగడయ్యేది!

నాకు ఒళ్లు మండిపోయింది. నా రహస్యం బట్టబయలయినా సరేనని అక్కసుతో- "ఏం ధార్మికయ్యా, కొసవేళ్లతో నిలబడి స్వర్గానికి ప్రయాణమా? స్వర్గానికి బొందెతో పోయేవాడివి. ఇంకా కాళ్లు భూమిని తాకుతూనే వున్నాయే?" అన్నాను. ఆ సున్నితమైన వ్యంగ్యం తెలీనివాడు మానవుడేనా? నిజానికి దాని అర్థం నీవింకా చావలేదా అని.

ధర్మశాస్త్రంలో తలదూర్చడమే గాని లోకజ్ఞానమేదీ? ఇహిహీ అని ఇగిలించాడు. సిగ్గు మాలినవాడు. ఏదో రహస్యంగా ఇద్దరు వున్నారు కదా. మనమెందుకు అక్కడికి వెళ్లాలి. అనే ఇంగితజ్ఞానం వుండవద్దూ? ఏం చెప్పను, పురాకృతకర్మ!

ఈ ధార్మికులు తాము చేసే పనులు– దైనందిన కాలకృత్యాలు కూడా లోకోద్ధరణకే చేస్తున్నామనుకుంటారు. వారం దినాలకు సరిపడా పుల్లలు విరుచుకు పెట్టుకోరాదూ! అది తప్పు. ప్రతిదినమూ ఇంకా జాముర్రాత్రి వుండగానే లేవడం, గోదావరి గట్టుకు వెళ్లడం, సుఖంగా వుంటున్న మనకు పానకంలో పుడకల్లా అడ్డుపడడం! తామేదో ఘనకార్యం చేస్తున్నామని జనం అనుకోవద్దూ?

ఈ ధార్మికులకు గోదావరి గట్టు తప్ప కొంపా, గోడూ వున్నట్టు లేదు. ఉదయమేమో ప్రాతరాహ్నికమనీ, మధ్యాహ్నం మాధ్యాహ్నికమని, సాయంకాలం సాయంసంధ్యావందనమని ఇలా ఎప్పుడూ గోదావరిగట్ల మీదే కాపురముంటారు. ఇంతకూ ఇతరులకు కష్టం కలిగించే వారు ధార్మికులెలా అవుతారు నీవే చెప్పు? ఇతరులకు ఎలాటి కష్టమూ కలిగించక పోవడం ధార్మికుని ప్రధానకర్తవ్యం. అలా కాక ఎప్పుడూ ఏదో విధంగా కష్టం కలిగించేవాడు ధార్మికుడెలా అవుతాడూ అంట!

ఆ మధ్య మరొక ధార్మికుడు వేళాపాళా లేక గోదావరి గట్టుకు వచ్చేవాడు. ఎప్పుడు ప్రియుణ్ని కలుసుకొని నర్మోక్తులు ఆడుకుందామా అంటే ఏదో అలికిడి. అలికిడి ఏమిటా, అడుగుల చప్పుడేమిటా అని చూస్తే ధార్మికయ్య!

విసుగెత్తిపోయాను. ధార్మికయ్యను పిలిచాను. గట్టిగా చెప్పాను. "ధార్మికయ్య గారూ, ఇక మీ పంట పండిందండీ. గోదావరి గట్లలో, గట్ల మీది చెట్ల పొదల్లో నిశ్చింతగా తిరగండి. విమ్మల్ని అడ్డుపెట్టేవాడే లేడు. ఎందుకంటారా, కుక్క ఒకటి వుండేదే అక్కడ, దానిని ఒక పోతరించిన సింహం చంపేసిందట! ఆ కుక్క ఊరికే మొరిగేది ఎవరు వచ్చినా, ఆ కుక్కకు మీరు భయపడేవారు. ఇప్పుడా బాధ కూడా లేదు. కుక్క చచ్చిందిగా, హాయిగా గట్ల మీద తిరగండి" అని మొహం మీదే అన్నాను.

చీరకొంగు పట్టిలాగితే లేదు, చీకట్లో కన్ను గీటాడన్న సామెతగా ఎదురుబడి గట్టిగా చెప్పినా అర్థం కాంది, వ్యంగ్యం తలకెక్కుతుందా? మొదట విన్నాడు. కుక్క పీడ విరగడయ్యింది కదా అని అనుకున్నాడు. కొంత సేపయితే గాని అతనికి వ్యంగ్యం అర్థం కాలేదు. సింహమా, మరి ఎలా పోను? అని అనుకున్నాడు. సింహమే మరి!

దానిని ఎలా వెళ్లగొట్టగలం? కుక్కయితే మొరుగుతుంది కొత్త వాళ్లను చూచినప్పుడల్లా. సింహం మొరగదు. వెంటనే పైనబడి చంపేస్తుంది. నిజంగానే చలించిపోయాడు పాపం!

మంచి బెదురు పెట్టాను సుమా అని సంతోషించాను. సింహం తిరుగాడుతూంది. వెళ్లితే ప్రాణాలు దక్కవు అని గ్రహిస్తాడంటావా? ఇంతకన్నా స్పష్టంగా ఎలా చెప్పను?

ఇంకొక ధార్మికుడు మరీ ఆగడం చేసేవాడు. "ఇంత పెద్ద ఊరు నిండా సంపన్నులయిన సంసారులు. ఇండ్ల నిండా పాడీ, పంటా. విలాసాలకు, వినోదాలకు తక్కువ లేదు. అయినా అభ్యాగతులకు, అతిథులకు పిడికెడు అన్నం పెట్టేవాడు లేడు. ఎంత వుంటే ఏమి ప్రయోజనం ధర్మబుద్ధి లేకపోతే? భగవంతుడు తినడానికి, కట్టడానికి ఇంత ఇచ్చాడు గదా, సత్కార్యాలు చేయవద్దూ? ఈ జన్మలో సత్కార్యాలు చేస్తేనే గదా ఉత్తరజన్మలు మంచివవుతాయి. ఉత్తరజన్మ సంగతి పట్టించుకోనివారు కూడా ఇప్పుడు మంచిపనులు చేస్తేనే గదా ఇరుగూ పొరుగూ మంచీ, చెడ్డా చూస్తారు. అంత మాత్రమన్నా చేయకపోతే జనం ఆడిపోసుకోరూ?" అని ఏమేమో గొణుక్కుంటూ కూర్చున్నాడు అరుగుమీద.

విన్నాను! విన్నాను! చాలాసేపు విన్నాను! ఈ ధార్మికులకు అలికి, ముగ్గుపెట్టి, ఆకేసి వడ్డించడానికే కూర్చున్నామా మనం? "ఏం ధార్మికయ్యా, మరీ మితి మీరిపోతున్నావు సుమా. నీవు చేస్తున్న దుండగాలకు నిన్ను ఊరిలో వుండనివ్వడమే గొప్ప. ఎందుకంటావా? గోదావరి గట్టుమీది కానుగపొదలు నీకేమి చేశాయి ఎప్పుడు బడితే అప్పుడు విరవడానికి? వేళా పాళా లేదా? గుబురుగా పెరిగిన ఆ కరంజ నికుంజాలలో నవదంపతులో, నవప్రేమికులో, ఎవళ్లో ఒకళ్లు సంతోషంగా సల్లాపాలు చేసుకుంటుంటారు. మనం వారిని ఇబ్బంది పెట్టకూడదు. ప్రేమికుల మనస్సును పాడుచేయడం మహాపాపం అని తెలీదూ? ఇద్దరు విడిగా, ఏకాంతంగా వున్నప్పుడు కుక్కలు, పిల్లులవంటి జంతువులు కూడా దగ్గరికి రావే! నీకు అంత తప్పనిసరి పనేం వచ్చింది? పళ్లు తోముకోడానికి ఆయుర్వేదంలోను, ధర్మశాస్త్రాలలోను ఎన్నో పుల్లలు చెప్పారుగా. అర్క న్యగ్రోధ, ఖదిర కరంజ కకుభాదికం, జిల్లేడు, మిర్చి, చంద్ర, కానుగ, మద్ది మొదలయిన పుల్లలు వాడవచ్చునన్నారుగా. ఒక్క కానుగ పుల్లలే ఎందుకు విరుచుకుంటావు? ఊరి పొలిమేరలో ఎన్ని మర్రులు, చంద్రలు, మద్దులు లేవు గనుక?

మా సంకేతస్థానాలయిన కానుగపొదలే కనిపించాయా నీ దుర్మార్గం కాకపోతే?" అని చీవాట్లు పెట్టాను.

అయినా ధార్మికుడు గొణుగుతూనే వున్నాడు. అప్పుడు గట్టిగా చెప్పాను. "చూడు ధార్మికయ్యా, నీవు తప్పులపైన తప్పులు చేస్తున్నావు. మా సంకేత స్థానాలయిన కానుగ గుబుర్లను పాడు చేయడం ఒక తప్పు. మా వూళ్లో వుంటూ, మా తిండి తింటూ, ఇంత పెద్ద గ్రామంలో పట్టెడన్నం పెట్టేవారు లేరనడం రెండో తప్పు. ఈ వూరివాళ్లు నీ సంగతి తెలుసుకున్నారా, ఇక్కడ వుండనివ్వడం అలా వుండగా బ్రతకనివ్వరనుకో. నిన్ను ఇలా వుండనివ్వడమే మహాభాగ్యమనుకో" అన్నాను.

బాగా చురుకు తగిలిందిలే. మన మన సంకేత స్థలాల జోలికి రాడు. మనం హాయిగా ఆ నికుంజాలలో గడపవచ్చు. ఏమంటావ్? నేను మంచిపనే చేశాను గదూ!

(గాథాసప్తశతి: 2-66, 75, 6-53.)

# మన్మథుని బాణాలు

**అ**న్నీ పరస్పరవిరోధాలే ఈ మన్మథునివి. సున్నితమైన వాటితోనే కొడతాడు. వీడి బాణాలేమో మరీ విడ్డూరం! ఏం చెప్పను? ఎవరితో చెప్పను? మహాబాధ పెడుతాయి ఆ బాణాలు. కాని హాయిగా వుంటుంది ఆ బాధ. అనురాగం కలిగిస్తాయి ఇతరుల పైన. ఆ ఇతరులు ఏడిపించుకొని తింటారు. అయినా ఏదో ఆనందం. ఆ మన్మథుడు ఎలాంటి బాణాలు వేస్తాడో, ఎన్ని వేస్తాడో, ఎప్పుడు వేస్తాడో చెప్పలేం. ఆ బాణాలు తగిలి, మనసులో ఏదో గుబులు పుట్టినప్పుడు గాని అవి తగిలాయని తెలీదు. ప్రియుడు దగ్గరుంటే సంతోషం కలిగిస్తాయి. దూరంగా వున్నాడా మరి చెప్పలేం! దగ్గరున్నా ఒకొకప్పుడు కష్టం కలిగించడమూ కద్దు. అబ్బో! ఈ మన్మథుని బాణాలకు దండాలు! వేయి దండాలు!!

ఏమిటీ వింత! ఇంత మెత్తనివి, అన్నీ పూవులే. పూవులు మెత్తనివి కాక మరేమౌతాయి, సుకుమారమయినవి – అంటారు. కానీ, వాటి దెబ్బ చూస్తే మహా తీక్షణంగా వుంటుంది. అవి ఎక్కడ తగులుతాయో, తెలీదు. తగిలినట్టే కనిపించదు. కాని బలే దెబ్బలు కొడుతాయి. తగిలిన తర్వాత గానీ వాటి ప్రభావం తెలీదు. గుండెలో లోతుకు దిగిపోతాయి. మెదడును కప్పేస్తాయి, తలను తిప్పేస్తాయి, అంగాలను పరవశింపజేస్తాయి. హృదయాన్ని పీలికలు పీలికలుగా చీలుస్తాయి. కాని ఏమిటో ఉల్లాసం పెల్లుబుకుతుంది.

అమ్మయ్యో! వీటి ప్రభావం అంతా ఇంతా అనలేం. అసూయతో ఒళ్లు మండేట్టు చేస్తాయి. మనిషిని చూస్తేనే గాదు, తలుచుకుంటేనే ఒళ్లు మండేట్టు చేస్తాయి. అంతలోనే ప్రేమ పుట్టుకొచ్చేట్టు, పొంగేట్టు, పొంగి పొర్లేట్టు చేస్తాయి. ప్రియుడు ఏమి తప్పు చేసినా, ఎంతటి చెడ్డ పని చేసినా, ఎంత మనస్సును కష్టపెట్టినా, మనస్సునూ, శరీరాన్ని నలిపివేసినా సహించేట్టు చేస్తాయి. వీటి గొప్పదనం ఎన్ని విధాలో!

సఖీ! ఏమిటీ ధోరణి అని అనుకుంటున్నావు గదూ! మన్మథబాణాలతో గుండె పుండయిపోయింది. ఆ పుండు ఈ వేళ ఘటాలున పగిలింది. కారణం ఏమనుకున్నావు? ఎవరో విరహి దారినపోతూ మా తోట అరుగు మీద కూర్చున్నాడు. ఏం తలచుకున్నాడో, గీతం ఆలపించాడు. అదీ తెల తెలవారగానే. ఆ గీతం విన్నాను. మనస్సు కకావికలైంది. గుండెలోని పుండు రేగింది. ఆ గీతం ఎలా వుందనుకున్నావు! ఎన్ని జన్మల విరహబాధో, ఎన్ని కష్టాల విరహబాధో, ఎన్ని కష్టాల ప్రవాహాలో కుమ్మరించినట్టుంది. నా మనసులోని బాధను మేల్కొల్పినట్లయింది. పుండును రేపినట్లయింది. రేగిన పుండు ఎంత బాధ పెడుతుందో నీకు తెలీదూ? గీతాక్షరాలు, గీత రాగమూ, పాడిన పద్ధతీ అన్నీ మనస్సును పిండి ఎండించాయి. లేచీ లేవగానే ఈ విరహగీతం విన్నాను. మొదలే విచారంతో క్రుంగిపోతున్న నన్ను ఈ గీతం మరింత క్రుంగదీసింది. ఈ దినమంతా ఎలా గడుస్తుందో! ఎందుకా గీతం నన్ను ఇంతగా దుఃఖితను చేసిందో తెలుసా? నా భావాలు, నా ఆశలు, నా ఆవేదనలు, నా అక్కసులు, నా మక్కువలు- అన్నీ వున్నాయి దాంట్లో. అందుకే దుఃఖం పొంగుకువస్తూంది. సమానదుఃఖం గలవారి మనస్సులే కదా స్పందిస్తాయి! కామబాణాల మాహాత్మ్యం ఇదే!

ఒంటిని పింజ పింజగా కొడుతాయి. బాధలోనూ తీయని ఊహలు కలిగిస్తాయి. ఒళ్లు సన్నబడినా అందాన్నిస్తాయి. ఆ అందం ప్రియులను మరీ మరీ ఆకర్షిస్తుంది. మన కోసం మరొకరు చిక్కిపోతున్నారంటే. ఏదో ఆనందం! ఏదో తృప్తి! మన కోసం ఇంత త్యాగం చేసే వారున్నారు గదా అని ఆత్మప్రత్యయం.

ఈ బాణాల రూపాలు ఏమిటి?- అంటావు కదూ? పాతవాళ్లు చెప్పారు అరవిందం, అశోకం, మామిడిపూత, విరజాజి, నల్లకలువ అని. అరవిందం- కమలమేమో విష్ణుచక్రం లాంటిది. విష్ణువు దుష్టులను శిక్షిస్తే మదనుడు ఈ చక్రంతో విరహి చక్రాన్నే మట్టుపెడతాడు. అశోకమేమో పేరుకు శోకం లేనిది గాని, అందరికీ శోకం కలిగిస్తుంది. మామిడి పూవుల గుత్తులు శతఘ్ని వంటివి. ఒకేమారు వందమందిని వంద వందలమందిని బాధిస్తుంది. విరజాజులు చూచావు గదా! సన్నగా వుంటుంది వాటి మొగ్గ. సరిగ్గా బాణం ములికిలాగ దాని చివర. విరహుల గుండెకు తగిలిందీ అంటే, వెంటనే పడిపోవడమే! నల్లకలువ గదలాంటిదనుకో. యముడి గద విన్నావు గదూ!

ఈ ఐదింటినే చెప్పారు గాని ముఖ్యంగా ఇంకా చాలా బాణాలే వున్నాయి మన్మథుని అమ్ముల పొదిలో. అవసరం వస్తే ఏ పూవునన్నా వాడుతాడు వాడు. తుమ్మి పూవుతోనూ కొట్టగలడు. ఆయా పూవులను బట్టి ఆయా బాణాలుగా తీర్చుకుంటాడు.

ఇప్పుడు చూచావుగా, నా పైన కసి వుంది. నన్ను ఏడిపించాలనుకున్నాడు. కంటికి కనిపించని ఏ బాణం వేశాడో ఏమో, ఎప్పుడో తిరిగి రావలసిన నా ప్రియుడు ఇంతవరకూ రాలేదు. ఇష్టమైనవాళ్లు దూరమయినా చెప్పిన గడువుకు చేరుకోకపోయినా, ఇక చూస్కో ఏ బాణాలు వేస్తాడో! ఒళ్లు మండిపోతుంది. పిచ్చెక్కినట్టవుతుంది. తిండి సయించదు. ఒళ్లు తెల్లబడుతుంది. గొంతు పెగలదు. కళ్లనీళ్లు కళ్లలోనే ఇంకిపోతాయి. ఏవేవో తలపులు పుట్టుకువస్తాయి. పాత కతలు మనస్సులో మెదలి మతిపోయి మూర్ఛవస్తుంది. ఎవరికి చెప్పుకుంటాము! చెప్పుకున్నా వినేవాళ్లెవరు? విన్నా వెక్కిరించే వాళ్లే. ఇది మదపిచ్చోయ్! అంటారు. పాపం అనరూ? మదపిచ్చట! మదమా అది? మదనం అంటే బాగుండును!

అందువల్ల ఒకే నిర్ణయానికి వచ్చాను. మన గోడు ఎవరికీ వద్దు. ఆ మన్మథునే అడుక్కుందాం. ఇంత బాధ పెట్టినా, ఒక్క మారన్నా కరుణించడూ? ఇంతకూ నేను కోరేది కరుణ కాదు. నాపైన దయ, అనుగ్రహం చూపమని కాదు. ఓ మదనా! నేను కోరేది ఇంతే. నీవు నన్ను ఎలాటి బాణాలతో కొట్టి వేపుకుతింటున్నావో ఆ బాణాలతో ఆ కృతఘ్నుడ్ని, ఆ నిర్దయుణ్ని కొట్టు. అతనికి నేను విరహంతో ఎంతగా వేగిపోతున్నానో తెలుస్తుంది. తన దాకా వస్తేగాని తెలీదుగా ఎవరికైనా?

ఈ ఉపకారం చేస్తే ఏమి ప్రత్యుపకారం చేస్తానంటావు గదూ? నేను నీ కనబడని రూపానికి ఏమి సేవ చేయగలను చెప్పు? ఒక్కటి మాత్రం చేయగలను. ఈ జన్మలో ఎలాగూ నిన్ను తిట్టుకుంటూనైనా పూజిస్తూనే వున్నాను. నీ ధ్యానం లేని క్షణం లేదు. నీ మంత్రజపం లేని ఒక లిప్తకాలమైనా లేదు. వచ్చే జన్మలోనూ, నా ప్రాణాలు ఒడ్డి అయినా, నీ పాదాలను పూజిస్తాను. ఎలాగూ నేను బతికే ఆశ లేదు. ఎన్ని గడువులకూ రానివాడు ఎప్పుడు వస్తాడనుకోను? కనుక నా ప్రాణాలు వుండవు, ఎగిరిపోతాయి పక్షుల లాగ. పునర్జన్మ తప్పదు. ఆ జన్మలోనూ నిన్ను పూజిస్తాను.

మరి చిన్న మనవి. మరు జన్మకైనా ఇలాటి కష్టాలు- విరహబాధలు లేకుండా చేస్తావా? ఏమో! నీవు అలాటి వాగ్దానాలు చేసే మూర్ఖుడివా ఏమిటి? మా వాడంటే ఎలాటి వాగ్దానాలన్నా చేస్తాడు నిర్భయంగా, నిస్సంకోచంగా. వాగ్దానాలే కదా! పోయేదేముంది? ఎన్నయినా చేయవచ్చు. ఎవడో దశరథుని వంటి మహారాజు వాగ్దాన భంగమని ప్రాణాలకే భంగం కలిగించుకున్నాడు గాని, అందరికీ మాట నిలబెట్టుకుందామనే వెర్రి ఉంటుందా?

సరే. మనస్సులో వుంచుకో. వచ్చే జన్మలో కలుసుకుందాం. ఇప్పటికి సెలవు.

(*గాథాసప్తశతి*: 4-25, 26, 27, 81, 5-41, 742, 994)

## తిరుమల రామచంద్రగారి జీవిత సాహిత్య విశేషాలు

అనంతపురం జిల్లా ధర్మవరం తాలూకా రాఘవంపల్లెలో 17 జూన్, 1913 (ప్రమాది జ్యేష్ఠ శుద్ధ చతుర్దశి)న తిరుమల శేషాచార్యులు, శ్రీమతి జానకమ్మలకు తిరుమల రామచంద్ర జన్మించారు.

**విద్యార్హతలు :** అలిగఢ్ ఆయుర్వేద విద్యాపీఠం నుండి ఆయుర్వేదభూషణ (1933), మద్రాసు విశ్వవిద్యాలయం నుండి తెలుగు-సంస్కృతంలలో విద్వాన్ (1936), పంజాబ్ విశ్వవిద్యాలయం నుండి హిందీ ప్రభాకర్ (1941) పూర్తి చేసిన వీరు లాహోర్‌లో బి.ఏ., చదువుకు వెళ్లారు కాని పూర్తి చేయలేకపోయారు. సంస్కృత, ప్రాకృత, తెలుగు, కన్నడ, హిందీ, తమిళ, ఆంగ్ల భాషల్లో గాఢమైన ప్రవేశం ఉంది.

**స్వాతంత్ర్య సమరయోధుడు :** ఉప్పు సత్యాగ్రహంలోను, వైయక్తిక సత్యాగ్రహంలోను పాల్గొని 12 నెలల కఠిన కారాగారశిక్షను అనుభవించారు (1930-32).

స్వాతంత్ర్య సేనానిగా సమ్మానం అందుకున్నారు.

**ఉద్యోగాలు :** డెయిలీ టెలిగ్రాఫ్, కాన్పూరు. తెలంగాణపత్రిక, హైదరాబాద్. మీజాన్ దినపత్రిక, హైదరాబాద్. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, భారతి, పరిశోధన, ఆంధ్రభూమి, హిందూస్థాన్ సమాచార్ మొ॥న పత్రికల్లో వివిధ హోదాలలో పనిచేశారు.

**నిర్వహించిన శీర్షికలు :** ఆంధ్రప్రభవారపత్రికలో నుడి-నానుడి, తెలుగుతల్లి, మరపురాని మనీషి, పదసంపద, మాటలకథ, ధర్మపీఠమ్, సంస్కృతి-సంప్రదాయం, హైదరాబాద్ లేఖ శీర్షికలను, ఆంధ్రసచిత్ర వారపత్రికలో హైదరాబాద్ నోట్‌బుక్, తెలుగు వెలుగులు శీర్షికలను, భారతిలో సాహితీసుగతుని స్వగతం, మనవిమాటలు; ప్రజాతంత్రలో ఇదీ మన హైదరాబాద్; ఆంధ్రప్రదేశ్‌లో రాజధాని విశేషాలు; పల్లకిలో ప్రాచీనాంధ్రగాథలు; పరిశోధనలో చరిత్రకెక్కని చరితార్థులు, తెలుగుతోబుట్టువులు; ఉదయం దినపత్రికలో మరోప్రపంచం; ఆంధ్రప్రభ దినపత్రికలో మాండలికాలు, పలుకుబడి అన్న శీర్షికలను నిర్వహించారు.

**ప్రచురణలు :** సంస్కృతంలో సత్యాగ్రహవిజయః, నాటకం (1930), సుమతిశతకమ్ (1932), హిందీలో ఆంధ్ర కే కుఛ్ త్యోహార్ రచనలు చేశారు. తెలుగులో రూట్‌మార్చ్ (సైన్యం కథలు) (1945), వీరగాథలు (1952), దక్షిణాంధ్రవీరులు (1953), లాల్‌బహాదూర్‌శాస్త్రి (1953), కాటమరాజు (1955), హిందువుల పండుగలు -పర్వాలు (1957), మన లిపి - పుట్టుపూర్వోత్తరాలు (1957), ధర్మదీక్ష (1958), శశాంకవతి (బృహత్కథ ఆధారంగా నవల) (1960), తెలుగు వెలుగులు (1962), నుడి నానుడి (1963), సాహితీసుగతుని స్వగతం (1970), నూరేళ్ల తెలుగు వ్యాసం (1975), మరపురాని మనీషి (లేఖినీచిత్రాలు) (1975), నాగలాపురం-దాని పరిసరాలు (చరిత్ర పరిశోధనం) (1975), గాథాసప్తశతిలో తెలుగు పదాలు (1980), మూడు వాఙ్మయశిఖరాలు (1988), తెలుగు పత్రికల సాహిత్యసేవ (1989), ప్రాకృత వాఙ్మయంలో రామకథ (1992), మనవిమాటలు (1992), బుద్ధుణ్ణి బళ్లో వేసిన కథ (1993), బృహదారణ్యకం (1993), అహం భో అభివాదయే (లేఖినీచిత్రాలు) (1995), హాలుని గాథలు- తెలుగు కథలు, నాలుగు చరిత్ర స్తంభాలు, హంపీ నుంచి హరప్పాదాక.

మనోరమా వాచకాలు, వివేకానంద వాచకాలు, ఆనంద వాచకాలు (1954-1956), వేయికి పైగా వ్యాసాలు, వందలలో పుస్తక సమీక్షలు చేశారు.

దాదాపు 17 కలంపేర్లతో పత్రికలలో రచనలు చేశారు.

**అనువాదాలు :** తమిళ, హిందీ, ఆంగ్ల భాషల నుండి 45 పుస్తకాల అనువాదం

**బిరుదులు, సన్మానాలు :** సాహితీసుగతుని స్వగతానికి రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు, హైదరాబాద్ (1970), "మహామహోపాధ్యాయ" బిరుదం, అఖిలభారత విద్వత్పరిషత్తు, వారాణసి (1978), 'గాథాసప్తశతిలో తెలుగు పదాలు' కు రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు, హైదరాబాద్. (1980), గౌరవ డాక్టరేట్ బిరుదు, సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాద్ (1988), రాజా లక్ష్మీ అవార్డు, మద్రాసు (1989)

తన జీవితాన్ని సాహిత్యసృజనకే అంకితం చేసిన తిరుమల రామచంద్ర 12, అక్టోబరు 1997న హైదరాబాదులో పరమపదించారు.

# ప్రాచీనాంధ్ర గాథలు

మహామహోపాధ్యాయ తిరుమల రామచంద్రగారు సంస్కృత, ప్రాకృత, ఆంధ్ర, ఆంగ్ల, హిందీ, కన్నడ, తమిళ భాషల్లో పండితులు. మన లిపి పుట్టు పూర్వోత్తరాలు, తెలుగువెలుగులు, నుడి నానుడి, మరపురానిమనీషి, గాథాసప్తసతిలో తెలుగు పదాలు, తెలుగు పత్రికల సాహిత్యసేవ, ప్రాకృత వాఙ్మయంలో రామకథ వంటి అనేక గ్రంథాలు రచించారు. హంపీ నుంచి హరప్పాదాక అన్న పేరుతో తన ఆత్మకథను రచించారు. అనేక గ్రంథాలు అనువదించారు. వ్యాసాలు రాసారు. బిరుదులు, సన్మానాలు పొందారు.



**తిరుమల రామచంద్ర**

**17.6.1913 - 12.10.1997**

---

గాథాసప్తశతిలోని ఒక్కొక్క గాథను తీసికొని దాని పూర్వాపరాలను ఊహించి ఒక కథనే అల్లవచ్చు. దీన్ని విస్తరించి ఒక కావ్యాన్నే కూర్చవచ్చునేమో కూడా. సప్తశతిలోని కొన్ని గాథలను తీసికొని సుప్రసిద్ధ పండితుడు, రచయిత తిరుమల రామచంద్రగారు అలా కథలు అల్లారు. ఒక పూర్వరంగాన్ని కూర్చి అందమైన భావానికి సన్నివేశాన్ని కూర్చారు. సన్నివేశాన్ని కథగా మలిచారు. కొన్ని గాథల్ని ఒకచోట కూర్చి వాటికొక సన్నివేశరూపాన్నిచ్చారు. సప్తశతి రమణీయ గాథలు తిరుమల రామచంద్రగారి కలంలో.



రూ. 90/-

ISBN 978-93-82203-75-9